





# చరిత్ర

హిందూ దేశ,ఆంధ్రుల,సాహిత్య,తత్వ

# ఆంధ్ర వాఙ్మయ చరిత్ర





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 6020010003824

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions |
Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!



ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# ఆంధ్రవాఙ్మయ చరిత్రము

*

డాక్టరు దివాకర్ల వేంకటావధాని,
యం. ఏ. (ఆనర్సు), పి. హెచ్. డి.



సారస్వత పరిషత్తు,
లక్ రోడ్, హైద్రాబాదు.

# తొలిపలుకు

హైదరాబాదు నందలి ఆంధ్ర సారస్వత పరిషత్తువారి పరీక్షల కాంధ్రవాఙ్మయ చరిత్ర యొక పాఠ్యభాగముగా నున్నది. ఆ విషయమును గూర్చి విద్యార్థుల కుపయుక్తమగునట్లుగా వ్రాయఁబడిన సమగ్ర గ్రంథము లేమియు లేకపోవుటచే వా రట్టిగ్రంథ మొకటి వ్రాయుమని నన్నుఁ గోరిరి. పరిషత్పరీక్షలకే కాక ఇతర పరీక్షలకుఁ గూడఁ బోవువారి కుపయోగకరముగా నుండునను నుద్దేశముతో సంగ్రహమైన యీ వాఙ్మయచరిత్రను వ్రాసితిని. ఇందాంధ్రవాఙ్మయముయొక్క స్వరూపము దిఙ్మాత్రముగా వివరింపఁబడినది.

విస్తరభీతిచే నిందుఁ గొన్ని చోట్లఁ గావ్యములయుఁ, గావ్యకర్తలయుఁ బేర్లు మాత్ర మొసంగితిని. కొన్ని గ్రంథములను గూర్చి యూరక పేర్కొనుటకుఁ గూడ నవకాశము లేకపోయినది. అట్టివానిలో వరదరాజు ద్విపద రామాయణము, ద్విపద భారతము, పలువు రాధునికులు రచించిన కావ్యములు ముఖ్యములైనవి. భగవత్కృప యుండుచో నచిర కాలముననే సమగ్రమైన యాంధ్రసారస్వతచరిత్రము ప్రకటించి, యందాంధ్రకావ్యము లన్నిఁటిని గూర్చి విమర్శలు రచించి, గ్రంథకర్తల ఋణము తీర్చుకొందును.

హైదరాబాదు నుండి ప్రచురింపఁబడుచున్న సంగ్రహాంధ్ర విజ్ఞానకోశమున నాంధ్రవాఙ్మయ మను శీర్షికను గూర్చి నేను గొంత వఱకు వ్రాయుట సంభవించినది. చిఱుమార్పులతో నున్నంతవఱ కందలి భాగమునే యిందు గ్రహించితిని.

ఈ గ్రంథమును వ్రాయుటకుమునుం దాంధ్రవాఙ్మయమును గుఱించి వ్రాయఁబడిన గ్రంథము లన్నియుఁ జూచితిని. ఏతద్రచనమున నవి యన్నియు నాకుఁ జాల తోడ్పడినవి. శ్రీ పాటిబండ మాధవశర్మగా రాధునికాంధ్రవాఙ్మయమును గూర్చియు, శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావు, పోతుకూచి సాంబశివరావుగార్లు రూపకములను గూర్చియు,

శ్రీ బి. వి. కుటుంబరావుగారు నవలా కథానికలను గూర్చియు నాకుఁ గావలసిన విషయ మంతయు సేకరించి యిచ్చిరి. జానపదగేయ వాఙ్మయ మను నధ్యాయమిందుఁ గ్రొత్తగాఁ జేర్చితిని. దీనిని వ్రాయుటకు శ్రీ డా. బి. రామరాజుగారి వ్యాసమెంతయుఁ దోడ్పడినది. వారందఱికిని నా కృతజ్ఞతానమస్కృతు లర్పించుచున్నాను.

శ్రీ దేవులపల్లి రామానుజ రావుగారును, గడియారం రామకృష్ణ శర్మగారును ఈ గ్రంథరచన విషయమున నన్నుఁ బ్రోత్సహించిన వారిలో ముఖ్యులు. వారికిని, దీనిని నిర్దుష్టముగా ముద్రించి యిచ్చిన 'శ్రీ శివాజీ ప్రెస్' వారికిని నా కృతజ్ఞతలు. విద్వాంసు లిందలి దోషములు తెలిపినచో సవరించుకొందును.

ఇది యచిరకాలముననే ద్వితీయ ముద్రణ మందఁ జాలుటకు విద్యార్థులును, ఆంధ్ర వాఙ్మయ జిజ్ఞాసువులైన పెద్దలును దీని యెడఁ జూపిన యపారమైన యాదరమే కారణము.

ఇట్లు

గ్రంథకర్త.

# విషయసూచిక :



# ఆంధ్రవాఙ్మయ చరిత్రము

## ప్రవేశకము

సాహిత్యము, సారస్వతము, వాఙ్మయము అను పదములు మూఁడును ఇప్పుడు కొంచె మించు మించుగా సమానార్థకములుగానే వాడఁబడుచున్నవి. కాని సూక్ష్మముగాఁ బరిశీలించినచో వాని యర్థ విస్తృతిలోఁ గొంత భేదము కనిపించును. ఈ మూఁడు పదములలో వాఙ్మయ మనునది మిగిలినవానికంటెఁ గొంత విస్తృతతరమైనది. వాగ్రూపమైన సర్వమును ఈ జాతికిఁ జెందునని చెప్పవచ్చును. దీనిని బట్టి సంభాషణ ములు, ఉపన్యాసములు కూడ వాఙ్మయ భాగములుగానే పరిగణింపఁ దగియుండును. సారస్వత మనుపద మింత విశాలమైనది కాదు. లిఖితమైన లేక ముద్రితమైన గ్రంథజాలమంతయు ఈ జాతికిఁ జెందును. దీనినిబట్టి శాస్త్ర గ్రంథములను సైతము సారస్వత మని పిలువవచ్చును. సాహిత్య మను పదము వైశాల్యమునఁ బై రెండింటికంటెను సంకుచితమైనది. రస ప్రధానములును, ఆనందప్రదములు నగు కావ్యములను మాత్రమే ఈ నామముతోఁ బిలువవచ్చును. ఇట్లీ పదముల కర్థవైశాల్యమునఁ గొంత భేదమున్నను సామాన్యజన వ్యవహారముననివి పర్యాయపదములుగానే వాడఁబడుచున్నవి.

సంస్కృతలాక్షణికులు కావ్యమును బలువిధముల నిర్వచించి యుండిరి. వా రొసంగిన నిర్వచనము లన్నిటిలో రసాత్మకమైన వాక్యమే కావ్య మను నిర్వచనము కొంతవఱకు సమంజసముగాఁ గానవచ్చును. రసప్రధానములైన యిట్టి కావ్యముల సమూహమునకే సాహిత్య మని పేరు. హితముతోఁ గూడినది సహితము. దాని భావము సాహిత్యము.

సాహిత్యమున కానందప్రదానమే పరమ ప్రయోజనమయ్యును అది ఉపదేశ ప్రధానమైకూడ నుండుట దానికి మఱింత వన్నె చేకూర్చును. సంస్కృతలాక్షణికులు కావ్యమునకుఁ బరనిర్వృతితోపా టుపదేశమును గూడఁ బ్రయోజనముగాఁ జెప్పుట యిందుచేతనే. కాని యుపదేశము లేనంతమాత్రమున రసానందసంధాయకములైన కావ్యములను అకావ్యములుగాఁ బరిగణింపరాదు. కావ్యము లుపదేశప్రదములైనను, గాక పోయినను దురుపదేశప్రదములు మాత్రము కాఁగూడ దని కొందఱభిప్రాయ పడియున్నారు. కావ్యాలాపములను వర్జింపవలె నను స్మృతి వాక్యము కూడ నొక విధముగా నీ విషయమునే సూచించుచున్నది.

చరిత్రకును గావ్యమునకును గొంత భేదమున్నది. చరిత్ర సత్య విషయ ప్రధానమైనది. కావ్యము రస ప్రధానమైనది. చరిత్రకారుఁడు జరిగిన విషయములను జరిగినట్లు చెప్పును. అం దాతఁడు సొంతభావములను ప్రవేశపెట్టుటకు వీలులేదు. కావ్యమునఁ గవి సత్యముననే చెప్పవలయు నను నియమములేదు. అది జరిగిన విషయములపైఁ గాక కవి భావనపై నాధారపడియుండును. చరిత్ర ఆ యా కాలములందలి వ్యక్తులను గూర్చి విశదముగాఁ జెప్పుచుండును. ఒక వ్యక్తిని గూర్చి చెప్పిన విషయము లా వ్యక్తికే కాని యితరుల కేవిధముగను అన్వయింపవు. కావ్యములందుఁ జెప్పఁబడు విషయము లట్లుగాక విశ్వజనీనములును, సార్వకాలికములునై యుండును. ఉదాహరణమునకుఁ జరిత్రకారుఁడు శివాజీ చరిత్రము చెప్పెననుకొందము. అది యొక్క శివాజీకిఁదప్ప నింకెవ్వరికి నన్వయింపదు. కావ్య మట్లుగాక దేశకాల వ్యక్తిభేదములు లేక యెల్లరకు నెల్లదేశములందు, నెల్లకాలములందు నన్వయించును. రామాయణాది మహాకావ్యము లెన్నో యేండ్ల క్రింద రచింపఁబడిన వయ్యు నేఁటికిఁ గూడ నొక్క భారతీయులకే కాక యెల్లదేశము లందలి యెల్లమానవులకు నన్వయించుచుండుటయే యిందుకుఁ దార్కాణము. కావ్యములందుఁ గవు లొసంగు నామములు జాతి సూచకములు మాత్రము.

కావ్యమునకును జరిత్రకునువలెనే కావ్యమునకును శాస్త్రమునకును భేదమున్నది. శాస్త్రము జ్ఞానప్రధానము. కావ్యము రసప్రధానము. శాస్త్రము బుద్ధిని రంజింపఁజేయును; కావ్యము హృదయమును రంజింపఁ జేయును. శాస్త్ర మా యా విషయములం దభినివేశముకల వారికి మాత్రమే పనికివచ్చును. కావ్యము సర్వజనులకును బనికివచ్చును. శాస్త్రోక్త విషయములు స్థిరములు కావు. అవి పరిశోధనలు జరిగిన కొలంది మార్పు చెందుచుండును. కావ్యము నందలి సత్యములు స్థిరమైనవి. దేశకాలములు మాఱినను అవి మాఱవు.

సాహిత్య చరిత్రమునఁ గవుల జీవితములు, తత్కాల పరిస్థితులు, వారు రచించిన కావ్యములు, అందలి మంచి చెడ్డలు చెప్పఁబడును. భాషా చరిత్రమం దట్లుకాక భాషయందలి శబ్దములు, వాని వ్యుత్పత్తులు, శబ్ద ముల యంతమునఁ గానవచ్చు ప్రత్యయములు, వాని చరిత్రము, ఒక భాష కితర భాషలతోఁ గల సామ్య వైషమ్యములు, పదములు క్రమ క్రమముగాఁ బొందుచుండు పరిణామము చెప్పఁబడును. సాహిత్య మర్థ భావములకు సంబంధించినది. భాష పదప్రత్యములకు సంబంధించినది. ఈ చిన్న గ్రంథమున నాంధ్రసాహిత్య చరిత్రము సంగ్రహముగాఁ జెప్పఁ బడును.

## ఆంధ్రవాఙ్మయ - యుగవిభజనము

రచనాసౌలభ్యమునకై వాఙ్మయ చరిత్రను కొన్ని యుగములుగా విభజించుచుందురు. ఈ యుగవిభజనము చేయుపట్లఁ బలువురు పలు మార్గముల నవలంబించియుండిరి. కీ. శే. వీరేశలింగం పంతులుగారు కవులను ప్రాచీనకవులు, మధ్యయుగకవులు, ఆధునిక కవులు అని మూఁడు తెఱఁగులుగా విభజించిరి. వారు రచించినది కవుల చరిత్రయే కాని వాఙ్మయ చరిత్ర కాదు. అందుఁ గవుల జీవితచరిత్రము, వారి కాలము, వారు రచించిన గ్రంథములు, వాని పౌర్వాపర్యము మున్నగు విషయ

ములు విపులముగాఁ జర్చింపఁబడినవి. కావ్యములందలి రసవస్తుభావాదులను గూర్చిన విమర్శ యందుఁ జాల స్వల్పము. వారు కావించిన విభజనము కాలమునుబట్టి సామాన్యదృష్టితోఁ జేయఁబడినది.

కొందఱు దేశమును బరిపాలించిన రాజవంశములను బట్టి వాఙ్మయ యుగములను విభజింతురు. దీనినిబట్టి చాళుక్యయుగము, రెడ్డిరాజ యుగము, విజయనగరయుగము, నాయకరాజయుగము, ఆంగ్లేయరాజ యుగము, ప్రజాయుగము అని యుగము లేర్పడును. ఇందుఁ గవులకును దత్కృతగ్రంథములకును గాక దేశమును బాలించిన రాజులకుఁ బ్రాధాన్య మీయఁబడును. కొంద ఱా యా కాలములందు బయల్వెడలిన కావ్య ప్రక్రియాభేదమునుబట్టి యుగవిభజనము కావింతురు. దీనినిబట్టి పురాణ యుగము, కావ్యయుగము, ప్రబంధయుగము, గద్యగేయ యక్షగాన యుగము, ఖండకావ్య (భావకవితా) యుగము అను యుగము లేర్పడును. మఱికొంద ఱా యా కాలములం దుద్భవించి ప్రతిభా సంపన్నములైన తమ రచనలచేఁ దమకాలమునందలి యితర కవులకు మార్గదర్శకులై ప్రసిద్ధికెక్కిన మహాకవుల పేర్లతో యుగములను బిల్చుచుందురు. అట్టి మహాకవులే యుగకర్తలుగాఁ బరిగణింపఁబడుచుందురు. దీనినిబట్టి నన్నయ యుగము, తిక్కనయుగము, శ్రీనాథయుగము మున్నగు యుగము లేర్పడును. పై పద్ధతులలో నే పద్ధతి నవలంబించి యుగ విభజనము కావించినను అది సమగ్రము, నిర్దుష్టము అని చెప్పుటకు వీలులేదు. అందేదో యొక విధముగా నతి వ్యాప్త్యవ్యాప్తి దోషములు కన్పట్టుచునే యుండును. చాళుక్యయుగమున నా చాళుక్యరాజుల పాలనమున లేని ప్రదేశములందుఁ గొన్ని కావ్యములు రచింపఁబడుటయుఁ, బ్రబంధయుగ మునఁ బురాణములును, బురాణయుగమునఁ బ్రబంధములును రచింపఁబడి యుండుటయు, యుగకర్త యగు నొక మహాకవి జీవితకాలముననే యతని పద్ధతికి విరుద్ధములైన కావ్యములు రచింపఁబడుటయు నిందుకు

నిదర్శనము. అందుచే యుగవిభజన మెవ్వ రెట్లు చేసినను అది కావ్య బాహుళ్యమునుబట్టి చేయఁబడినదే యని గ్రహింపవలయును.

ఈ గ్రంథమునఁ గావ్యప్రక్రియాభేదములనుబట్టి యుగవిభజనము చేయఁబడును. ఆంధ్రవాఙ్మయమున నన్నయకుఁ బూర్వ మసలు కావ్యములు రచింపఁబడెనో లేదో, రచింపఁబడినచో నెట్టి కావ్యములు రచింపఁబడెనో తెలిసికొనుట కాధారములు లేకున్నవి. అందుచే దానిని అజ్ఞాతయుగ మని పేర్కొనవచ్చును. దీనినే ప్రాఙ్నన్నయ యుగమనియుఁ జెప్పుచుందురు. నన్నయ తరువాత సుమారు మూఁడు శతాబ్దులకాలము వఱకుఁ బలువురు కవులు సంస్కృతము నందలి పురాణేతిహాసముల నాంధ్రీకరించుటకే యత్నించి యుండిరి. శైవకవు లట్లుగాక స్వతంత్ర కావ్యములను రచించిన మాట వాస్తవమే. అయినను బ్రాధాన్యవ్యపదేశమును బట్టి యీ యుగమును పురాణయుగ మనికాని, భాషాంతరీకరణయుగ మని కాని పేర్కొనుట యుచితముగా నుండును. తరువాతి యుగమున విక్రమార్క చరిత్రము, భోజరాజీయము, కేయూరబాహు చరిత్రము మున్నగు కావ్యములు రచింపఁబడినవి. అదియునుగాక శ్రీనాథుఁ డీ కాలమున సంస్కృతము నందలి నైషధాది కావ్యముల నాంధ్రీకరించి యుండెను. అందుచే దీనిని కావ్యయుగ మని చెప్పవచ్చును. పిమ్మట రాయలవారి పోషణమునఁ బెద్దనాదులచేఁ బ్రబంధము లను కావ్యవిశేషములు రచింపఁబడినవి. ఆ కారణముచే నీ యుగమును ప్రబంధయుగ మని పిలువ నగును. అనంతర యుగమున సైతము కొన్ని ప్రబంధములు రచింపఁబడినను అప్పుడు యక్షగానములు గద్యకావ్యములు గేయరచనలు విస్తారముగా వెలువడినవి. అందుచే నీ యుగమును (గద్యగేయ) యక్షగానయుగ మని చెప్పనగును. ఈ కాలమునఁ బెక్కుకావ్యములు దక్షిణదేశమున వ్రాయఁబడియుండుటచే దీనిని దక్షిణాంధ్రయుగ మనియుఁ బిల్చుచుందురు. తరువాత నాధునిక కాలమునఁ బెక్కు ఖండకావ్యములు, గద్యగేయకావ్యములు, నవలలు, కథలు, నాటకములు రచింపఁబడినవి.

కవితాప్రాధాన్యమునుబట్టి దీనిని ఖండకావ్యయుగ మని కాని భావకవితా యుగ మనికాని చెప్పవచ్చును.

ఏ వాఙ్మయము నందలి యుగములనైనను ఈ దృష్టితోడనే విభజింపవలయునను నియమములేదు. వాఙ్మయచరిత్రకారులు తమ యభిరుచినిబట్టి సౌకర్యమునకై యే విధముగానైనను యుగవిభజనము కావింపవచ్చును.



# ఆంధ్రవాఙ్మయ చరిత్రము

## ప్రాఙ్నన్నయ యుగము

మన భాష యిప్పు డాంధ్రిము, తెనుఁగు, తెలుఁగు అను పేర్లతో వ్యవహరింపఁబడుచున్నది. దీని కీ పేరు లెప్పుడు కలిగెనో చెప్పఁజాలము. ఆంధ్రు లాక్రమించుటకుఁ బూర్వము కృష్ణా గోదావరీ నదుల నడిమి ప్రదేశమునకు తెలుఁగు దేశమనియే పేరు. ఆంధ్రుల పాలనము క్రిందికి వచ్చినపిమ్మట నిది యాంధ్రిదేశ మయ్యెను. ఆంధ్రదేశము నందలి తెనుఁగుభాషకుఁ దదనుగుణముగా నాంధ్రిభాష యనునామ మేర్పడెను. ఆంధ్రులును మొదటినుంటియు తెనుగుదేశమున నుండిన తెనుఁగువారును గలసి యాంధ్రులైరనియు, నాంధ్రిభాషమాత్రి మట్లు రెండు భాషల కలయికచే నేర్పడినది కాదనియు, తెనుఁ గే యాంధ్రులీ దేశము నాక్రి మించుకొన్న పిమ్మట నాంధ్రమయ్యె ననియు విమర్శకు లభిప్రాయపడు చున్నారు. నన్నయభట్టు కాలమునాఁటికే దీనికి తెనుఁగు, ఆంధ్రిము అను పేరులుండె ననుటకు నిదర్శనములున్నవి.

తెలుఁగుభాష ద్రావిడజన్యమా లేక సంస్కృత ప్రాకృతజన్యమా అను విషయమున భిన్నాభిప్రాయము లున్నవి. తమిళము, మలయాళము, కన్నడము, తెలుఁగు మున్నగు భాషలు ద్రావిడభాషా కుటుంబమునకుఁ జెందినవనియు నివి కొన్ని శతాబ్దులకుఁ బూర్వ మేకాకారముగనే యుండి క్రిమముగా నొండొంటి నుండి విడివడి ప్రత్యేక పరిణామము నొందిన వనియు నొక పక్షమువారి వాదము. ఈ వాదమునకు డాక్టరు కాల్డ్వెల్ మార్గదర్శకుఁడు. తెలుఁగు సంస్కృత ప్రాకృతజన్య మనియు బాగుగాఁ బరిశీలించినచోఁ దెలుఁగుపదము లన్నిటికి సంస్కృతమందో, ప్రాకృతమందో మూలరూపములు గోచరించు ననియు రెండవ పక్షము వారి వాదము.

ఈ వాదమును బ్రతిపాదించినవారు కీ. శే. చిలుకూరి నారాయణరావుగారు, ఆంధ్రకవులును వైయాకరణులునుగూడ నీ యభిప్రాయమునే వెల్లడించి యుండిరి. ఈ రెండు వాదములలో దేశమున ద్రావిడ వాదమునకే అధికమైన ప్రచారమున్నది. కాని తెలుఁగితర ద్రావిడ భాషలనుండి విడివడి యెప్పటినుండి ప్రత్యేక పరిణామ వికాసముల నంద మొదలిడెనో నిశ్చితముగాఁ జెప్పుట కాధారములు లేవు.

బుద్ధఘోషుఁడు తాను వినయపిటకమునకు వ్రాసిన సమన్త పసాదిక యను వ్యాఖ్యలో నంతకు మున్నున్న వ్యాఖ్యానములను గొన్నిటిని బేర్కొనియుండెను. మిగిలినవానిలో అంధకఅట్టకథ యనున దొకటి కూడ నుండెనని కొన్ని టీకలవలన తెలియుచున్నది. డాక్టరు బి. సి. లా గారు పాళీవాఙ్మయ చరిత్రలో అంధకఅట్ట కథ బహుశః దక్కను నందలి యేదో యొక దేశభాషలో వ్రాయఁబడియుండవలె నని తెల్పియున్నారు. ఆ అట్ట కథ యిప్పు డుపలభ్యమాన మగుట లేదు. పేరునుబట్టి అది ఆంధ్రభాష యందు వ్రాయఁబడినదో లేక ఆంధ్రదేశమునఁ బ్రచారము చేయఁబడిన దోయై యుండవలయును. ఈ అట్టకథల నశోకునికుమారుఁడైన మహేంద్రుఁడు సింహళద్వీపమునకుఁ గొనిపోయి ఆ ద్వీపమునందలి భాష లోని కనువదించెనని ప్రతీతి దీనినిబట్టి యవి క్రీ. పూ. ౩ వ శతాబ్దికి పూర్వము వై యుండవలయును. ఆంధ్రఅట్టకథకును ఆంధ్రభాషకును నేదైన సంబంధమే యుండుచో ఆంధ్రము క్రీ.పూ. ౩వ శతాబ్దికిఁ బూర్వమే యితర ద్రావిడభాషల నుండి వేఱయ్యెననియు, నప్పటికే కొంత పరిణా మము పొందెననియుఁ జెప్పవచ్చును. కాని యా అట్టకథ లభింపకపోవుట చేతను, అందలి భాష ద్రావిడ ప్రాంతమున వాడఁబడుచుండిన పైశాచీ పాళివంటి యార్య భాషలో వ్రాయఁబడి యుండునని కొందఱు విమర్శ కులు తలంచుచుండుటచేతను ఈ విషయమును నిశ్చితముగాఁ జెప్పుటకు వీలులేకున్నది.

భరతుఁడు నాట్యశాస్త్రమున నాటకములం దేయే జాతుల పాత్రలేయే భాషల నుపయోగింపవలెనో చెప్పుచు బర్బర కిరా తాంధ్ర ద్రవిడాది జాతులందు నాట్యప్రయోగమున కావ్యము భాషా సమాశ్రియము కావింపరాదనియు, శుద్ధములైన యీ సర్వజాతుల విషయమున శౌరసేని నుపయోగింపవలె ననియు చెప్పియున్నాఁడు. భరతుని కాలమును గూర్చి భిన్నాభిప్రాయము లున్నమాట నిజమే కాని యాతఁడు క్రీస్తుపూర్వముండె ననుటకు మాత్రము సందేహింపఁ బనిలేదు. ఆతఁడు చెప్పిన పై విషయములనుబట్టి క్రీస్తు పూర్వమే ఆంధ్ర ద్రవిడ జాతులవలెఁ దద్భాషలుకూడ వేఱైయుండెననియు, వానికి బదు లొకప్పుడు శౌరసేని వాడఁబడుచుండెననియు, నందుచే నవి శౌరసేనికంటె భిన్నములనియుఁ దెలియుచున్నది. ఈ విధముగా క్రీస్తు పూర్వమే ఆంధ్రభాష యుండెనని ఊహించుటకే వీలుకలుగుచున్నదికాని నిశ్చితముగాఁ జెప్పుటకు వీలులేకున్నది.

క్రీ. శ. ప్రథమ శతాబ్దిలో గుణాఢ్యుఁడను కవి పైశాచీ ప్రాకృతములో బృహత్కథ యను పెద్ద కథాకావ్యమును నిర్మించియుండెను. ఈతఁడు శర్వవర్మకును తనకును జరిగిన వాగ్వివాదములో శర్వవర్మ రాజు నాఱుమాసములలో సంస్కృతభాషానిష్ణాతునిఁ గావింపఁజాలినచోఁ దాను సంస్కృతప్రాకృత దేశ భాషలను బరిహరింతు నని చెప్పియుండెను. ఈ వివాదము పైఠణ నగరమున జరిగియుండెను. అది యిప్పుడు మహారాష్ట్ర ప్రాంతమున నున్నను అప్పు డాంధ్రసామ్రాజ్యమున కొక రాజధానిగా నుండెను. గుణాఢ్యుఁడు పేర్కొన్న దేశభాష యేదో నిశ్చితముగాఁ జెప్పుట కాధారములేదు; కాని అప్పటి కింకను ఆధునిక మహారాష్ట్ర భాష యేర్పడియుండని కారణమున నది తెలుఁగేయై యుండునని తలంచుట కవకాశము కలుగుచున్నది.

హాలుఁడు తన యాస్థానమునకు వచ్చి ప్రాకృతకవులు వినిపించిన గాథలలో రసవత్తరములైన యేడువందల గాథల నేరి గాథాసప్తశతి

యను పేర నొక ముక్తకకావ్యమును సంకలనము చేసియుండెను. ఆ ప్రాకృతగాథలను రచించినవారిలోఁ గొంద ఱాంధ్రులై యుండుటచేతనో లేక యాంధ్రభాష యప్పుడు జనవ్యవహారమున నుండుటచేతనో అందెడ నెడ కొన్ని తెలుఁగు పదములు ప్రవేశించినవి. అత్తా, పాడి, పొట్ట, పిలుఅ (పిల్ల), కరణి, బోండీ (పంది), మోడి కులుఃఇ౧ఁఊణ, మున్నగు శబ్దము లిందుకుఁ దార్కాణము. దీనినిబట్టి గాథాసప్తశతి కాలమునాఁటికే, అనఁగా క్రీ. శ. ప్రథమ శతాబ్దినాఁటికే, తెలుఁగుభాష సుస్థిర రూపమునంది ప్రత్యేక పరిణామమునొంద మొదలిడె నని చెప్పుటకు వీలగుచున్నది. ఒక భాష బహుళప్రచారమున నుండిననేకాని యందలి శబ్దములు కొన్ని యన్య భాషాప్రవిష్టము లగుటకు వీలులేకపోవుట యీ విషయమునకు బలము చేకూర్చుచున్నది.

క్రీ. శ. ప్రథమశతాబ్దికిఁ జెందిన అమరావతీస్తూపము నందలి యొక రాతిపలకమీఁద నాగబు అను మాట కానవచ్చుచున్నది. అది యందు వాక్యగతమైన కాక ప్రత్యేకముగానున్నది. నాగశబ్దము సంస్కృత శబ్దమే యైనను దాని చివరఁగల 'బు' అను నక్షర మది తెలుఁగు మాటయే యని స్పష్టముగాఁ దెల్పుచున్నది. ఈ బు వర్ణమే క్రమముగా ము్బ, ంబు, మ్ము, ము అను రూపములను బొంది తెలుఁగున నమహద్వాచక ప్రథమైకవచనముగాఁ బరిగణింపఁబడుచున్నది దీనినిబట్టి కొన్ని సంస్కృత శబ్దములు తత్సమీకరింపఁబడునప్పు డిప్పటి ముువర్ణమునకుఁ బూర్వరూప మైన బువర్ణమును వాని చివరఁజేర్చు నాచార మప్పటికే యేర్పడెనని తెలియుచున్నది.

శాతవాహనుల తరువాత ఆంధ్ర సామ్రాజ్యము చిన్నచిన్న భాగ ములుగాఁ జీలి వేఱువేఱు వంశములవారి యేల్బడిలోనికి వచ్చినది. వారిలో ఇక్ష్వాకులు, బృహత్ఫలాయనులు, శాలంకాయనులు, ఆనంద గోత్రికులు, విష్ణుకుండినులు, పల్లవులు అనువారు ముఖ్యులు.

వారి రాజ్యకాలము లందలి శాసనము లన్నియు సంస్కృతము నందో ప్రాకృతమునందో వ్రాయఁబడినవి కాని యం దొక్కటియు నాంధ్ర భాషలో వ్రాయఁబడియుండలేదు. వానియందుఁ బేర్కొనఁబడిన గ్రామ నామములును, ప్రతిగ్రహీతల నామములును, వాడఁబడిన కొన్ని అక్షరములును ధ్వనులును, పదములును ప్రత్యయములును క్రీ. శ. మొదటి మైదాఱు శతాబ్దులయందలి తెలుఁగుభాష పరిణామస్వరూప ములను గూర్చి కొన్ని విశేషములను వెల్లడించుచు నా భాష క్రీస్తు శకారంభము నుండియు జనవ్యవహారమున నుండె ననుటకు దృష్టాంతము లుగా నున్నవి.

పై శాసనములందలి గ్రామనామములు పెక్కు ఊరు, పర(పఱ్ఱు) కొణ్ట (కొండ), చెరువు, కోడు, కుదురు, రేవు, పాక, పల్లి, వాడ, చేడు, వట్టి, ముడి (మూడి, పూడి) అను వానిలో నేదో యొక పదముతో ముగియుచున్నవి. ఇందుఁ బెక్కు దేశ్యపదములగుటయే కాక యితర ద్రావిడభాషా సామాన్యములై యున్నవి. ఇవి యిప్పటికిని తెలుఁగు దేశమునందలి కొన్ని గ్రామముల చివరఁ గానవచ్చుచున్నవి. ఇట్లే గోలశర్మ, కొట్టిశర్మ, దొడ్డిస్వామి మున్నగు బ్రాహ్మణులనామము లందలి పూర్వభాగములు తెలుఁగు శబ్దములే. కురువాడ, చిన్నపురి, చెఞ్చెరువు, తెల్లవల్లి, పెరువాటకము మున్నగు గ్రామనామము లందలి పూర్వ భాగములు తెలుఁగు విశేషణపదము లని చెప్పుటకు సందేహింప నక్కఱ లేదు. కొన్ని గ్రామనామముల మొదట రావి, కొండ, రా, ఇరు, మూగ, తాణ్డి (తాడి), రే అను శబ్దములు కానఁబడుచున్నవి. చూరదాన శాసన ములో మేట్టితాపశి, ముదిటి తటాక అను పదములున్నవి. కొన్ని శాసన ములలో మహాతలవర, మహాతగవర అను శబ్దములు కనఁబడుచున్నవి. ఈ శబ్దములన్నియు ప్రాక్చాళుక్యయుగమున తెలుఁగుబహుళ ప్రచారమున నుండెననుటకుఁ దార్కాణముగా నున్నవి. అట్లువి జనవ్యవహారమున నుండనిచో శాసనములందుఁ బ్రయోగింపఁబడుట సంభవింపదు.

పై శాసనములందుఁ బెక్కుచోట్ల ఱ, ౚ అను అక్షరములును ౘ్ర అను వింత ధ్వనియుఁ గనిపించుచున్నవి. ఇవి ద్రావిడభాషలందే కాని సంస్కృతప్రాకృతములందుఁ గానరావు. ఇవి వ్రాయవలసినచోట్ల నా లిపిలో ప్రత్యేక చిహ్నములులేని కతమున నాంధ్ర కర్ణాట లిపియందలి గుర్తులే వ్రాయఁబడుచుండెను. దీనినిబట్టి యా ధ్వనులుగల ద్రావిడభాష లప్పుడు వాడుకలో నుండెనని యూహింపవచ్చును.

చెఱ్చుఱువు అను గ్రామనామము నందలి చెమ్, చెఱువు అను రెండు పదములును తాలవ్యీకరణముచే నేర్పడినట్టివే. ఈ పద్ధతి ననుస రించి కకారము చకారముగా మాఱుటకు తెలుఁగు సోదరభాషల నుండి విడివడినపిమ్మటఁ జాలకాలము పట్టియుండును. ఇట్లే అప్పటి కొన్ని శాసనములలో అనుస్వారము వాడఁబడిన పద్ధతికూడ నప్పుడు ద్రావిడ భాషలు పఠనలేఖన వ్యవహారమున నుండె ననుటకు దృష్టాంతముగా నున్నది.

విక్రమేంద్రవర్మ చిక్కుళ్ల శాసనమున క్రీ. శ. (6 వ శతాబ్ది) సంస్కృతపదముల నడుమ విజయరాజ్య సంవత్సరంబుళ్ అను పదము కానవచ్చుచున్నది. నాగబు అను పదమునందలి బువర్ణమే యిచ్చట ంబు అను రూపముతో కానవచ్చుచున్నది. చివరనున్న ళ్ అనునది బహువచన మును దెలుపుచున్నది. ద్రావిడమునందలి కళ్ అను బహువచన ప్రత్య యమే అనుచిత విభాగముచే ళ్ అనుదానిగాను, తరువాత ళు, లు అను రూపములుగాను మాఱినట్లు తోఁచుచున్నది. ఈ మార్పు జరుగుటకుఁ దప్పక కొన్ని శతాబ్దుల కాలము పట్టియుండును. దీనిఁబట్టి క్రీస్తుశకారంభ మునకే తెలుఁగు మూలద్రావిడమునుండి వేఱై జనులచే మాటాడఁబడు చుండె నని యూహింప వీలగుచున్నది.

ప్రాక్చాళుక్యశాసనములు కొన్నింటిలో చిన్నపురము, రేగొన్ఱమ్, ఇర్పులి, ముయుూర్కూటువ మున్నగు ద్విత్రిపదఘటిత సమాసములు

కనఁబడుచున్నవి. ఇట్టి సమాసము లేర్పడుట అంతకుఁ బూర్వమే తెలుఁగు చాల శతాబ్దుల నుండి వాడుకలో నుండెననుటకుఁ దార్కాణ మగు చున్నది.

ఈ విధముగ ప్రాక్చాళుక్యయుగమునఁ దెలుఁగు జనవ్యవహారమున నుండె నని దృఢముగాఁ జెప్పుటకు వీలగుచున్నది. కాని యప్పుడేదైన వాఙ్మయముండెనో, ఉండినచో నెట్లుండెనో చెప్పుట కాధారము లేమియుఁ గానరావు. అప్పటి తెలుఁగు భాషనుగూర్చి యింతకంటె నేమి చెప్పుటకును అవకాశములేదు.

క్రి. శ. 6 వ శతాబ్ది యందలి పూర్వార్ధముతో తెలుఁగుభాషా పరిణామము నందలి రెండవ దశ యారంభించుచున్నది. అంతవఱకును తెలుఁగు జనవ్యవహారమున నుండెనేమో యని యనుమానించుటకు వీలు కలుగుచున్నదే కాని గ్రంథములందో, శాసనములందో లిఖితమైన తెలుఁగు రూపము మాత్రము కనిపించుటలేదు. తరువాత తెలుఁగు దేశము నందలి భాగములను పరిపాలించిన రాజులు కొందఱు కొన్ని శాసనము లను సంస్కృతభాషయందే వ్రాయించినను గొన్నింటిని దేశభాష యగు తెలుఁగునఁ గూడ వ్రాయించుట కారంభించిరి. అట్టి వారిలో రేనాటిచోళులును, తూర్పు చాళుక్యులును మొదటఁ బేర్కొనఁ దగినవారు. వారు వ్రాయించిన తెలుఁగుశాసనములే ఆ భాషయొక్క లిఖితరూప మునకుఁ బ్రథమ నిదర్శనములు. మొన్న మొన్నటివఱకును క్రి. శ. 641 వ సంవత్సరము నందలి జయసింహవల్లభుని విప్పర్లశాసనమే తెలుఁగు నందలి మొదటి శాసనముగాఁ బరిగణింపఁబడుచుండెను. కాని రేనాటి చోళుల శాసనములు బయలుపడిన తరువాత నంతకు ముందుకూడఁ గొన్ని తెలుఁగుశాసనము లున్నట్లు తెలియవచ్చినది. వానిలో క్రి. శ. 6 వ శతాబ్ది చరమపాదము నందలి ధనంజయుని కలమళ్లశాసనము మొదటిది.

పూర్వ చాళుక్య యుగమునందు లభించు నాంధ్రవాఙ్మయ మంతయు శాసనాత్మకమైనదే. శాసనములు సాధారణముగా నే దేవునికో దేవాలయమునకో బ్రాహ్మణునకో మఠాచార్యునకో యొసంగఁబడు దానములను సూచించుటకును, రణనిహతులైన మహావీరుల పరాక్రమము లను వర్ణించుటకును వ్రాయింపఁబడుచుండును. వీనిలోఁ బెక్కు దేవాలయ కుడ్యములందో స్తంభములందో కానవచ్చును. వీనిలో దాతృప్రతిగ్రహీతల వంశములయు గుణగణములయుఁ బ్రశస్తులును, దత్తములైన గ్రామముల సీమాదులును వివరింపఁబడియుండును.

క్రీ. శ. 7, 8 శతాబ్దులందలి తూర్పుచాళుక్యుల శాసనములలో ప్రాకృతభాషా సంపర్కము కొంత అధికముగా కానవచ్చును. తరువాత క్రమముగా ఆ ప్రాకృతపదముల స్థానమును సంస్కృత సమాసము లాక్రమించినవి. గుణగవిజయాదిత్యుని ప్రథమరాజ్య సంవత్సరమునకుఁ (క్రీ. శ. 848) జెందిన పండరంగుని అద్దంకిశాసనములో ఒక తరువోజయు పిమ్మట కొంత వచనమును వ్రాయఁబడినవి. కొంచెమించుమించుగా ఆ కాలముననే చెందిన కందుకూరు ధర్మవర శాసనములలో సీసపద్యములు కనఁబడుచున్నవి. తరువాత క్రీ. శ. 934 నాటి యుద్ధమల్లుని బెజవాడ శాసనములో ఐదుమధ్యాక్కరా పద్యములు చూపట్టుచున్నవి. క్రీ.శ. 1000 ప్రాంతమునాటిదని తలపఁబడు విరియాల కామసాని గూడూరుశాసన ములో మూఁడు చంపకమాలలును రెం డుత్పలమాలలును వ్రాయఁబడినవి. నన్నెచోడుఁడు కుమారసంభవములో వ్రాసిన

మునుమార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవిత పుట్టించి తెనుం
గును నిల్పి రంధ్రవిషయం
బునఁ జన చాళుక్యరాజు మొదలగు పలువుర్.

అను పద్య మంతకుపూర్వమే తెలుఁగున కవిత్వముండెనను విషయమును వ్యక్తముచేయుచున్నది. ఇరుగు పొరుగు దేశములందు కన్నడము

మున్నగు భాషలలో మార్గకవిత్వము వ్రాయఁబడి ప్రచారము నొందు చుండఁగా గుణగవిజయాదిత్యుఁడో మఱే చాళుక్యరాజో తెలుఁగుదేశమున దేశికవిత పుట్టించి తెలుఁగును నిలిపెనని ఈ పద్యమున కర్థము చెప్పవల యును. దీని కనుగుణముగా క్రి. శ. 9, 10 శతాబ్దులలో వ్రాయఁబడిన శాసనములలో సంస్కృతవృత్తము లేమియు లేక కేవల దేశిపద్యములే గోచరించుచున్నవి. సంస్కృతాభిమానులైన పండితు లీ దేశికవిత్వము నంతగా నాదరింపని హేతువున తరువాత తెలుగుదేశమున కూడ మార్గ కవితా పద్ధతియే అవలంబింపఁబడినట్లు తోఁచుచున్నది. కామసాని గూడూరుశాసనము నందలి పద్యము లిందుకు దృష్టాంతములు. లభించిన ఈ పద్యముల సంఖ్య యధికముగా లేకపోవుటచేతను, పై శాసనము లందలి పద్యములు వ్యక్తుల వీరావదానములను, దానములను మాత్రమే వర్ణించునట్టివగుటచేతను వానియందలి సారస్వతగుణము నెత్తిచూపుట కవకాశములేకున్నది. కాని దేశిమార్గములు రెండింట చెప్పఁబడిన ఏదో యొక రకమైన కవిత్వమును, తరువాత నన్నయ భారతమున నవలంబించిన చంపూ పద్ధతియు అంతకుముందే ప్రచారమున నుండెననుట కివి నిదర్శనములుగా నున్నవి. (అద్దంకి, ధర్మవరముశాసనములు గద్యపద్యములతో కూడియుండుటచేత చంపూ పద్ధతికి చెందినవని చెప్పవచ్చును.) పైని పేర్కొనఁబడిన పద్యములే కాక దేశిమార్గమునకు చెందిన పలురకముల పదములుకూడ నప్పుడు వ్రాయఁబడుచుండెనని తెల్పుటకు కొన్ని ఆధారములు లభించుచున్నవి. పాల్కురికి సోమనాథుఁడు పండితారాధ్య చరిత్రమున భక్తులు తుమ్మెద పదములు, వెన్నెల పదములు, ప్రభాత పదములు మున్నగు పదములు పాడుచుండి రని వ్రాసియుండెను. మఱియు నతఁడు తాను రచించిన బసవపురాణమునకు "ఆతత బసవపురాతన భక్తగీతార్థసమితియే మాతృక" యని తెల్పియుండెను. ఆతనినాఁటి కంత బహుళ ప్రచారములో నుండిన పదములును, గీతములును, తత్సదృశము లైన యితర పద గీతాదులును అంతకు పూర్వముకూడ ప్రచారములో

నుండె ననుకొనుటలో విప్రతిపత్తి ఉండదు. క్రీ. శ. 11 వ శతాబ్దిలో రచింపఁబడిన యాప్పిరంగలమ్ అను తమిళచ్ఛందోగ్రంథమున తత్కర్త వాంచయ్యా వ్రాసిన తెనుగు ఛందమును పేర్కొనెను. (వాంచియార్ వడఘుచందవుమ్) కొందఱు వాంచియార్ అను శబ్దమును రేచియార్ అని చదువుచున్నారు. అదే సత్యమైనచో నతఁడు కవిజనాశ్రయకర్తయైన రేచనకావచ్చును. అప్పటికే తెలుఁగున ఛందోగ్రంథ మొకటి వెలువడి యుండుట, అంతకు పూర్వమే ఆ భాషలో ఛందోబద్ధమైన రచన విరివిగా నుండెనని చెప్పక చెప్పుచున్నది. కాని ఆ కవిత్వము గ్రంథస్థము కాక పోవుటచేతను, గ్రంథస్థమైనను మతవైషమ్యాది కారణములచే నష్టమై పోవుటచేతను దాని గుణగణములను నిర్ణయించుటకు వీలులేక పోవుచున్నది.



# ఆంధ్ర వాఙ్మయ చరిత్రము

## భాషాంతరీకరణ యుగము

ఇట్లు నన్నయకు పూర్వమే కొంత కవిత్వ ముండెనని నిశ్చయముగా తెలియవచ్చుచుండ నాతఁడు రచించిన భారతమే తెలుగున ఆది కావ్యమనుటకు హేతువేమి? అను ప్రశ్నకు సమాధానము చెప్పవలసియున్నది. ఆతనికి పూర్వముండిన కవిత్వము ప్రధానముగా దేశిమార్గమునకు చెందినది. భాషాచ్ఛందో విషయముల నది దేశి పద్ధతి నవలంబించి సంస్కృత లక్షణమునకు విరుద్ధమై యుండుటచే పండితాదరమును బడయక ప్రాకృత జనైకరంజకమై యొప్పారెను. అట్లుగాక సలక్షణమైన భాషలో దేశిమార్గములు రెండింటికి చెందిన పద్యములతో నుదాత్తవస్తుకమైన మహాకావ్యమున్ రచించి నన్నయ పండితపామరులందఱికిని ప్రీతి నాపాదింపఁ జాలెను. ఇంతవఱకు లభ్యములైన వానిలో నట్టి రచనతోఁగూడిన ప్రథమకావ్యమాతని భారతమే. అందుచేతనే దాని కాంధ్రమున నాదికావ్యమను ప్రసిద్ధి కలిగినది.

ఆ యారంభ దినములలో నన్నయ ఆంధ్రభాష కొనరించిన సేవ యింతింతనరానిది. అతఁడు జనవ్యవహారము నందలి పదజాలము నంతను పరిశీలించి, సంస్కరించి, సంస్కృత పదములను తెలుఁగునవాడు పద్ధతి నిర్ణయించి, ధారాళమైన నడకగల కొన్ని సంస్కృత వృత్తములను గ్రహించి, తన నాఁటికే ఉత్తమ కావ్యములతో నొప్పారుచుండిన కన్నడ వాఙ్మయమునుండి ప్రశస్త లక్షణములు సేకరించి, తెలుఁగున నుత్తమమైన కావ్యరచనామార్గము తీర్చిదిద్దెను. ఇది అనన్య సామాన్యమైన అతని ప్రతిభా మహత్త్వమునకు తార్కాణము.

నన్నయ ఆంధ్రభారతమునం దాది సభాపర్వములను అరణ్యపర్వమునందు మూఁడాశ్వాసములపై 142 పద్యములను మాత్రమే

రచించెను. అతఁడు వ్యాసుని సంస్కృత భారతము నందలి కథ ననుస రించిన మాట నిజమేయైనను అందు తన కనవసరము లని తోఁచిన భాగ ములను తగ్గించి, అవసరము లని తోఁచినపట్లు పెంచి, యౌచిత్య దృష్టితో కొన్ని మార్పు లొనరించి, తన కృతిని సర్వవిధముల నొక స్వతంత్ర కావ్యమా అనునట్లు సాగించెను. అతని కవిత్వము, ప్రసన్న కథాకలితార్థ యుక్తికిని, అక్షర రమ్యతకును, నానా రుచిరార్థసూక్తి సంపదకును నెలవై వీనుల విందు చేకూర్చుచుండును. ఉదంకోపాఖ్యానము, శకుంతలోపాఖ్యా నము, నలోపాఖ్యానము, సౌగంధికాపహరణము, రురుప్రమద్వరల కథ మున్నగు వృత్తాంతముల రచించుటలో నాతఁడు చూపిన నేర్పు అప్రతి మానమైనది. అతని కవిత్వము సంస్కృత పద బహుళమయ్యును క్లిష్టా న్వయములు లేక ధారాశుద్ధికిని ధ్వనిగాంభీర్యమునకును నిధానమై చదువరుల కానందము కూర్చుచుండును. ఆంధ్రమున గురుపద్య విద్యకు వలెనే గద్య విద్యకును నన్నయయే ఆద్యుఁడని చెప్పవచ్చును. అతని వచనము సులలితపదఘటితమై, అతి ధారాళమై ఒప్పారుచుండును. అతడు చంపకోత్పలమాలాది వృత్తములనే కాక తరువోజ, మధ్యాక్కర మున్నగు దేశిపద్యములను గూడ వాడియుండెను. ఆంధ్రమున కావ్యములను వ్రాసిన తరువాతి కవులెల్లరు నాతని గురుప్రాయునిగా భావించి కొనియాడి యుండిరి.

రాజరాజు మరణించిన పిమ్మట కొన్ని రాజకీయ మత సాంఘిక కారణములచే ఆంధ్రభారతరచన కొనసాగుట కంతరాయ మేర్పడెను. రాజరాజు కుమారుఁడైన కులోత్తుంగ చోడుఁడు తండ్రి తరువాత వేంగీ సామ్రాజ్యమును పాలింపక మాతామహరాజ్యమైన చోళరాజ్యమున కధిపతి యయ్యెను అది తమిళభాషా ప్రచారము గల దేశమగుటచే నాతఁ డచ్చట నుండి ఆంధ్రభాషను పోషించుట కవకాశము లేకపోయెను. క్రీ. శ. 12 వ శతాబ్ది ఆరంభమున కన్నడదేశమున బసవేశ్వరుఁ డవత రించి వీరశైవ మతమును స్థాపించెను. ఈ క్రొత్త మతము వర్ణాశ్రమ

వ్యవస్థను గాని, వేదప్రామాణ్యమునుగాని అంగీకరింపక భక్తిప్రధానమై యుండెను. దీని ప్రభావము కన్నడదేశమునుండి క్రమముగా దక్షిణమునం దంతటను ప్రాకెను. ఇట్లొకవంక వీరశైవము వ్యాప్తి చెందుచుండ ఆంధ్ర దేశమున దానికి ప్రతియోగముగా రామానుజ స్థాపితమైన వైష్ణవము కూడ పెంపొంద నారంభించెను. భక్తిప్రధానములైన ఈ మతముల నవలంబించి తత్ప్రచారమునకై యత్నించుచుండిన కవులు వైదికమత ప్రధానమైన భారతమును కొనసాగింప పూనినవారు కాకపోయిరి.

నన్నయ తరువాత చెప్పఁదగిన తెలుఁగుకవి నన్నెచోడుఁడు. ఈతఁడు నన్నయకు పూర్వుఁడని కొందఱును, సమకాలికుఁడని కొందఱును తిక్కన తరువాతి వాడని కొందఱును, నన్నయ తిక్కనల నడిమికాలము వాడని కొందఱును చెప్పుచున్నారు. ఇందేది సత్యమో నిశ్చయముగా చెప్పుటకు తగిన ఆధారములు లేవు. కాని చివరి వాదమే కొంచెము యుక్తి యుక్తముగా కనబఁడుచున్నది. దీనినిబట్టి అతడు క్రీ. శ. 12 వ శతాబ్ది ఆరంభమువాఁడని చెప్పవచ్చును. ఈ కవిరాజశిఖామణి వ్రాసిన కావ్యము కుమారసంభవము. ఇందు పండ్రెండాశ్వాసము లున్నవి. శివ పురాణము, కాళిదాసోద్భటుల కుమారసంభవములు చదివి అందలి పార్వతీ పరమేశ్వరుల ప్రణయవృత్తాంతమునకు తారకాసురవధ యను వీర రసప్రధానమైన కథ నంగముఁగాచేసి, యాతఁడు రసాలంకారవర్ణన పరిపూర్ణముగా నీ కావ్యమును నిర్మించినాడు. ఇందు కాళిదాసాదుల భావము లచ్చటచ్చట గోచరించుచున్నను మొత్తముమీఁద నిది స్వతంత్ర కావ్య మనియే చెప్పవలెను. ఇందు కన్నడ కవితా సంప్రదాయములు హెచ్చుగా గోచరించును. తిక్కనాదుల రచనలలో తరువాత కానవచ్చు షష్ఠ్యంతములను తెలుఁగున తొలుఁదొల్త వ్రాసినవాఁ డీ నన్నెచోడుఁడే. ఇతనికి వర్ణన ప్రీతి హెచ్చు, ఇతని వర్ణనలు సహజములును, దేశీయ సంప్రదాయానుకూలములునై మనోహరముగా నుండును. తిక్కన యుద్ధ

వర్ణనల కీతని కావ్యముతుదనున్న యుద్ధవర్ణనమే మేలుబంతియై యుండ వచ్చును. రతిమన్మథుల సంభాషణము, పార్వతీ కపటవటువుల సంభాషణము, ఈతని సరస సంభాషణ రచనాసామర్థ్యమునకు తార్కాణములు. ఈ విధముగా నీతని కావ్య మాంధ్ర మందలి మొట్టమొదటి ప్రబంధమని చెప్పఁదగియున్నది. దేశిమార్గములు, వస్తుకవిత మున్నగు పదముల నాంధ్ర వాఙ్మయమున మొట్టమొదట వాడినవాఁ డీతఁడే. వాని నీతఁడు కన్నడ వాఙ్మయమునుండి గ్రహించియుండెను. ఇట్లీతఁడు తమిళ వాఙ్మయము నుండి గ్రహించిన దేశీయ సంప్రదాయములును కొన్ని గలవు. ఇతఁ డీ గ్రంథమును తన గురువైన జంగమ మల్లికార్జునున కంకితము చేసి అపార మైన గురుభక్తిని ప్రకటించెను. ఈతని శైలి నన్నయ శైలికంటె నించుక భిన్నమైనది. ఇతఁడు సంస్కృత సమాసములను సాధ్యమైనంత వఱకు తగ్గించి జాను తెనుఁగను పేరుతో చమత్కార గర్భితములైన తెలుగు పలుకుబళ్ళ నెక్కువగా ప్రయోగించెను. ఇతని కావ్యమున నర్థశబ్దాలంకార ప్రీతియే కాక బంధకవిత్వమును,ఛందోవైవిధ్యమును గూడ కానిపించును. అట్లయ్యు నీతని పద్యముల నడకలో భంగపాటెచ్చటను గోచరింపదు. ఇతని రచనలో లాక్షణికులు వ్యాకరణ విరుద్ధములుగా పరిగణించు వైరి సమాసములవంటి కొన్ని ప్రయోగము లచ్చటచ్చట కానబడును. కాని పదభావసంపదను, రచనా ప్రౌఢిమను, ధారాశుద్ధిని పరికించిచూడ నీతనికిఁగల కవిరాజ శిఖామణి యను బిరుద మన్వర్థ మనుటకు సందేహింపఁ బనిలేదు.

మల్లికార్జున పండితారాధ్యుఁడు (1120-1180) శివతత్త్వసారము, లింగోద్భవ గద్యము, రుద్రమహిమ, గణసహస్రమాల, అమరేశ్వరాష్టకము, పర్వతవర్ణనము మున్నగు కావ్యములను రచించినట్లు పండితారాధ్య చరిత్ర వలన తెలియుచున్నది. ఈతఁడు కన్నడ సంస్కృతము లందు కూడ పండితుఁడగుటచే నిందు కొన్ని ఆ భాషలలో రచింపఁ బడినవికూడనై యుండవచ్చును. శివతత్త్వసారము శివా! అజా!

రుద్రా! మహేశా! అను సంబోధనములతో కూడిన కందపద్యములతో రచింపఁబడినది. ఇందలి పద్యముల సంఖ్య కొన్ని వందలున్నను స్వభావమునుబట్టి దీనిని శతక మనియే చెప్పవచ్చును. సోమనాథుఁడు దీనిని శతకమనియే పేర్కొనెను. పండితుఁ డిందు శివదీక్షనుగూర్చియు, పాశుపత శైవసిద్ధాంతములను గూర్చియు విపులముగా వర్ణించినాఁడు. ఇందద్వైతుల మాయావాద మనేక యుక్తులచే ఖండింపఁబడినది. ఇతఁ డచ్చటచ్చట వేదములనుండి కూడ ప్రమాణములను చూపుచు అద్వైత పరములైన వాక్యములకు సైతము ద్వైతపరముగా నర్థముచెప్ప యత్నించెను. శివతత్త్వసారము నందలి శైలి లక్షణానుగుణమై పెక్కు విధముల నన్నయ శైలినే పోలియుండును, వలపలగిలక ప్రాసము, కొన్ని వింతశబ్దముల ప్రయోగము ఈ గ్రంథమునఁ గానిపించును. కాని మొత్తముమీఁద పండితుఁడు మతమునవలెనే రచనమునకూడ సంప్రదాయాను రక్తినే యెక్కువగా ప్రకటించెను.

దేశిమార్గమునకు చెందిన ద్విపదకవిత్వమునకే కాక శివకవిసమూహమునకును వీరశైవ మతసిద్ధాంతములకును గురుపీఠ మనిచెప్పఁదగినవాఁడు పాల్కురికి సోమనాథుఁడు. (క్రీ. శ. 13 వ శతాబ్ది ఉత్తరార్ధము) ఇతఁ డాంధ్ర సంస్కృత కర్ణాటభాషలు మూఁడింటను గ్రంథములు రచించెను. అందు బసవపురాణము, పండితారాధ్యచరిత్రము, సోమనాథ స్తవము, అనుభవసారము, చెన్నమల్లు సీసములు, వృషాధిప శతకము బసవోదాహరణము అనునవి తెలుఁగుకృతులు. వీనిలో బసవపురాణ పండితారాధ్య చరిత్రలకును, వృషాధిప శతకమునకును విశేష ప్రఖ్యాతి కలదు. బసవపురాణము వీరశైవ ప్రతిష్ఠాపకుఁడైన బసవేశ్వరుని జీవిత చరిత్రము. ఇందు ప్రసక్తానుప్రసక్తముగా పలువురు శివభక్తుల చరిత్రలు కూడ వర్ణితములైనవి. సోమనాథుఁ డిందలి వస్తువును వృద్ధులనుండియు ప్రాచీన శివభక్తులు బసవేశ్వరునిగూర్చి రచించిన గీతముల నుండియు గ్రహించినట్లు తెల్పియున్నాఁడు. శివతత్త్వసారమున సంగ్రహముగా

చెప్పఁబడిన శివభక్తుల చరిత్రములు బసవపురాణ పండితారాధ్య చరిత్రము లందు విపులముగా వర్ణింపఁబడినవి. బసవేశ్వరుఁడును ఇతర భక్తులును గావించిన లోకోత్తరములైన కార్యము లెన్నో ఇందు వివరింపఁబడినవి. ఇందలి బెజ్జమహాదేవి కథ, కన్నప్ప కథ, సూరసానమ్మ కథ, చిరుతొండనంబి కథ మిక్కిలి రసవంతములై ఉండును. శ్రీనాథుని హరవిలాసము నందలి సిరియాళుని కథ కిందలి చిరుతొండనంబి కథయే మాతృక. ఆంధ్రదేశము ననేకాక కర్ణాటదేశమునకూడ మత గ్రంథముగా బసవపురాణమున కమితమైన ప్రచారముకలదు. ఇది కన్నడ తమిళములలోనికేకాక సంస్కృతమునకుఁ గూడ పరివర్తనము చేయఁబడినది. దీనికి తెలుఁగున మూఁడు పద్యరూపానువాదములు కలవు. పండితారాధ్య చరిత్రము నందు శైవమతమున కాచార్యుఁ డని చెప్పఁదగిన మల్లికార్జున పండితారాధ్యుని జీవిత చరిత్రము వివరింపఁబడినది. ఇది సోమనాథుని రచనలలోని కెల్ల కడపటిదైనను కవితాపాటవమునం దగ్రగణ్యమైనది. పండితుఁడు వెలనాటిచోడుని సభలో జైన బౌద్ధచార్వాకాది మతముల ఖండించి వీర శైవమును ప్రతిష్ఠించిన వృత్తాంత మిందలి ప్రధాన విషయము. ఇందు దీక్షా పురాతన వాద మహిమ పర్వత ప్రకరణములు అను నైదు ప్రకరణము లున్నవి. ద్విపద చ్ఛందోబద్ధమైనను మహాకావ్యలక్షణ సమ గ్రతయందును, నవరసపరిపోషణము నందును ఈ కావ్యము మిక్కిలి వాసి కెక్కియున్నది. ఇందు పెక్కు చోట్ల పండితారాధ్యుని కృతులలోని భాగములు యథాతథముగా నుద్ధరింపఁబడియున్నవి. సంగీతము, నాట్యము వైద్యము, రసవాదము మున్నగు విషయములును, వివిధ దేశాచారము లును ఇందు వివరింపఁబడియున్నవి. దీనిని శ్రీనాథుఁ డాంధ్ర పద్యకావ్య ముగను, గురురాజకవి సంస్కృత కావ్యముగను సంతరించియుండిరి. వృషాధిపశతకము బసవా, బసవా, బసవా, వృషాధిపా! అను మకుటముతో రచితమైన శతకము. ఇందు బసవేశ్వరాదులగు శివభక్తుల చరిత్రములు సంగ్రహముగా వర్ణింపఁబడినవి. ఇందున్న తమిళ కన్నడ మహారాష్ట్ర

మణిప్రవాళ భాషా పద్యములు సోమనాథుని బహుభాషా పాండిత్యమును వెల్లడించుచున్నవి. మనకు లభ్యము లగుచున్న శతకములలో మకుటపద్య సంఖ్యానియములతో కూడిన ప్రథమశతక మిదియే. ద్విపదచ్ఛందమును మహాకావ్యోపయోగిగా తీర్చిదిద్దిన మహాకవి సోమనాథుఁడు. ఇతఁడును నన్నెచోడునివలె జాను తెనుఁగుపై నభిమానము ప్రకటించియున్నాఁడు. పాఠకుల భావన కించుకైనను విడిచిపెట్టక ఈతఁడు దేనినైనను విస్తృతతరముగా వర్ణించుచుండును. అందును శివునో, బసవునో, వర్ణించు సందర్భమున ఇతని రచన ఆవేశపూరితమై గిరినదివలె ఉరవడితో ప్రవహించుచుండును. ఇతఁడు కొన్ని ద్విపదలలో ప్రాసయతిని వాడెను. ద్విపదకు ద్విపదకు తెగచెప్పవలె నను నియమమును పాటింపక వాని నేకధారగా నడపించెను. లాక్షణికులు దోషముగా పరిగణించు పదములును, సంధులును, సమాసములును ఇతని రచనలో నచ్చటచ్చట కాననగును. అయ్యు వస్తుచ్ఛందోభాషా విషయముల కనవచ్చు దేశీయతయు, వర్ణనాదుల గోచరించు తన్మయతయు, దాని కొక అసాధారణ సౌందర్యమును చేకూర్చుచున్నవి. ద్విపదను రోకంటి పాటగా కాక బహుభంగుల వైవిధ్యముతో నడపించి అతఁడా ఛందము నకఖండమైన ప్రతిష్ఠ సంపాదించెను. అందుచేతనే ద్విపదకావ్యకర్తలలో కాలముచేతనే కాక కవితా ప్రతిభచే కూడ నీతని కగ్రస్థానము లభించెను.

క్రీ. శ. 12 వ శతాబ్దిలో నాంధ్రదేశమున శైవ వైష్ణవమతములు రెండును వ్యాప్తిచెంది పలువు రనుయాయుల నాకర్షించెను. వారన్యోన్య దర్శన స్పర్శన భాషణాదులనుకూడ నుజ్జగించి ఒండొరుల ద్వేషించుకొనుచు సంఘమున కొంత అలజడి కలిగించిరి. అదిచూచి ఆ రెండు మతములవారికి సామరస్యము కలిగింప యత్నించినవారిలో తిక్కన సోమయాజి ప్రథమగణ్యుఁడు (క్రీ. శ. 1210-1290). ఈతని వంశము పండితులకును, మంత్రి దండనాథులకును నెలవై వన్నెవాసి గాంచినట్టిది. ఇతని

తాత భాస్కరమంత్రి రామాయణము రచించినట్లు ప్రతీతి. కాని ఆ కావ్యమిప్పుడు లభించుటలేదు తిక్కన క్రీ. శ. 13వ శతాబ్ది పూర్వార్ధమున నెల్లూరును పరిపాలించిన మనుమసిద్ధికి మంత్రియు, ఆస్థానకవియునై అలరారెను. అతఁడు తన తొలికృతియైన నిర్వచనోత్తర రామాయణమును ఆ మనుమసిద్ధికే అంకితము కావించెను. ఆ కావ్యము నాతఁడు చంపూ పద్ధతినిగాక నిర్వచనముగా రచించెను. ఇందారంభమున నాతనికి కవితా రచనమునఁగల వివిధములైన అభిప్రాయములు వెల్లడింపఁబడినవి. ఇది వాల్మీకిరచిత రామాయణోత్తరకాండ కనువాదము. ఇందు జనాప వాద భీతిచే రాముఁడు సీత నడవికిపంపించుట, సీత కుశలవులను ప్రసవించుట మున్నగు వృత్తాంతములును, రావణాదుల జననవర్తనాదులును వర్ణింపఁబడినవి. అనువాద విషయమున తిక్కన యిందు చాల స్వతంత్రత వహించెను ఇందు విష్ణువు రాక్షసుల వధించిన ఘట్టమున వీరరసమును, సీతాపరిత్యాగ సందర్భమున కరుణరసమును చక్కగా పోషింపఁబడినవి. ఇందలి శైలి భారతములోని దానివలె నంత పరిపక్వము కాకపోయినను మిక్కిలి రసవంతముగానే యుండును తిక్కన యిందు రామనిర్యాణ కథ నెందుచేతనో తెనిఁగింపక విడిచిపై చెను. తరువాత దానిని జయంతి రామభట్టను నాతఁ డేకాశ్వాసముగా రచించి భద్రాద్రిరామున కంకితము కావించెను. తిక్కన రచించిన రెండవ గ్రంథము భారతము. ఇందాతఁడు విరాటపర్వము మొదలుకొని పదునైదు పర్వములు తెనిఁగించెను. ఆంధ్రీకరణవిధానమున నిందాతఁడు నన్నయ పద్ధతినే అవలంబించెను. పాత్రరసౌచిత్యపోషణమున నాతఁ డిందు ప్రదర్శించిన ప్రతిభ అపారమైనది కీచకుఁడు ద్రౌపదిని వలచిన సందర్భమున శృంగార రసమును, ఉత్తర గోగ్రహణమునందును, యుద్ధపర్వములందును వీర రసమును, స్త్రీపర్వమునను అభిమన్యు వధ ఘట్టమునకు కరుణరసమును శాంత్యను శాసనములందు శాంతరసమును ఆతఁ డెంతో నిపుణముగా వర్ణించియుండెను. ఉద్యోగ పర్వమున కృష్ణుని ముఖమున నాతఁడు ప్రదర్శించిన రాజనీతి నైపుణ్య

నద్వితీయముగా నుండును. పాండవులయు, ధృతరాష్ట్ర దుర్యోధనులయు, కర్ణశకునులయు, భీష్మ విదుర ద్రోణాదులయు, కుంతీ ద్రౌపదులయు పాత్రముల నాతఁడు సుస్పష్ట రేఖలతో తీర్చిదిద్దెను. ఆతఁడు చిత్రించిన కుంతీ ద్రౌపదులలో క్షత్త్రియకాంతోచితమైన మనస్విత నిండారి యుండును. కీచకు నాతఁడు పాశవమైన కామమునకు వశుఁడైన మోహాంధుఁడుగాఁగాక విషాదనాయకునిగా చిత్రింప యత్నించి కృత కృత్యుఁ డయ్యెను. మంత్రియు, యుద్ధనీతి విశారదుఁడును అగుటచే నాతని యుద్ధవర్ణనములు, సహజములును, గంభీరములునై నిజముగా యుద్ధము జరుగుచున్నప్పటి వివిధ పరిస్థితులను పఠితలకు సాక్షాత్కరింపఁ జేయును. తిక్కన శైలి ప్రధానముగా సంవాదశైలి. పాత్రల సంభాషణద్వారముననే అతఁడు కథను రమ్యముగా నడపించుచుండును. అలఁతి అలఁతి దేశ్యపదములు వాడుటయందును రసోచిత పదవృత్త ప్రయోగము నందును ఆతఁడు మిక్కిలి నిపుణుఁడు. ఆంధ్రులందఱును మోదమును పొందవలె నను ఉద్దేశముతో నాతఁడు దీర్ఘ సమాసములను తగ్గించి దేశిమార్గము నవలంబించెను. ఆ కారణముచే నతని రచన తెలుఁగుతనమునకు నికిపట్టై సరస సుందరమై ముద్దుగొల్పుచుండును. క్లిష్టములైన ఆధ్యాత్మిక విషయములను కూడ స్పష్టముగా వ్యక్తము చేయఁగల శక్తి తెనుఁగుభాష కున్నదని మొట్టమొదట ప్రదర్శించిన వాఁడతఁడే. అతడు తన భారతమును హరిహరనాథదేవుని కంకితము కావించి, తద్ద్వారా శివ కేశవాభేదమును ప్రచారముచేసి, ధర్మాద్వైతమును స్థాపింప యత్నించెను.

అభినవదండి బిరుదాంకితుఁడైన మూలఘటిక కేతన తిక్కనకు సమకాలికుఁడు. ఇతఁడు సంస్కృతమున దండి రచించిన దశకుమార చరితమును చంపూకావ్యముగా ననువదించెను. ఇది శృంగారహాస్యముల కాలవాలమైన చక్కని సాహస కథలతో నిండారియుండును. కేతన కథాకథన నైపుణ్య మిందు సర్వతోముఖముగా గోచరించును. ఇదిగాక

ఈతఁడు విజ్ఞానేశ్వర మను ధర్మశాస్త్ర గ్రంథమును, ఆంధ్ర భాషా భూషణ మను వ్యాకరణ గ్రంథమును గూడ రచించెను. తెలుఁగు వ్యాకరణమును తెలుఁగుభాషలో రచించిన మొదటి లక్షణకర్త ఇతఁడే. ఇతఁడు దశకుమార చరితమును తిక్కన కంకితముచేసి యందాతని వంశమును, పూర్వులను చక్కఁగా వర్ణించెను. కవితచెప్పి ఉభయకవిమిత్రు మెప్పించితినని ఇతఁడు సగర్వముగా చెప్పుకొనియుండెను.

మారన తిక్కన సోమయాజి శిష్యుఁడు. ఇతఁడు మార్కండేయ పురాణమును తెనిఁగించి గోన గన్నారెడ్డి కంకితము చేసెను. ఇతని శైలి ఆడంబర రహితమై సరసముగా నుండును. తెలుఁగున తరువాత వెలసిన మనుచరిత్రము, హరిశ్చంద్రోపాఖ్యానము, కువలయాశ్వ చరిత్రము మున్నగు ప్రబంధములందలి కథావస్తువు లిందుండియే గ్రహింపఁబడినవి.

ఈ యుగమున వెలసిన పండిత కవులలో అథర్వణాచార్యు డొకఁడు. ఇతఁడు భారతము నాంధ్రీకరించె నని ప్రతీతి. ఇది యిప్పుడు లభ్యమగుటలేదు. దొరకిన కొలఁది పద్యములనుబట్టి ఈతని రచన విరాట పర్వము నుండి ఆరంభింపఁబడిన దనియు, మిక్కిలి ప్రౌఢమైన దనియు తెలియుచున్నది. అథర్వణకారికావళి అను తెలుఁగు వ్యాకరణము నీతఁడు సంస్కృత శ్లోకములుగా రచించెను. ఇతఁడు త్రిలింగశబ్దానుశాసన మను చిన్న వ్యాకరణమును గూడ రచించె నందురు.

క్రీ. శ. 1260 ప్రాంతమున బద్దె భూపాలుఁడు నీతిసార ముక్తావళి అను నీతి పద్యములతోఁ గూడిన గ్రంథమును రచించెను. సుప్రసిద్ధమైన సుమతి శతకమును గూడ నీతఁడే రచించిన ట్లిందు చెప్పఁబడినది, ఇది ఎంతవఱకు సత్యమో తెలియదు. ఇతని పద్యములు సరళసుందరములై పండిత పామర హృదయరంజకములుగా నుండును.

తెలుఁగున వెలసిన మొదటి రామాయణము రంగనాథ రామాయణము. దీనిని రంగనాథుఁ డనుకవి వ్రాసి, గోన బుద్ధారెడ్డి పేర

ప్రకటించె ననియు, తండ్రి యుపదేశముచే బుద్ధారెడ్డియే రచించె ననియు ఏతత్కర్తృత్వ విషయమున రెండు వాదము లున్నవి. ఆశ్వాసాంతము లందు గోన బుద్ధారెడ్డియే (1200-1250) తండ్రియైన విట్ఠలక్ష్మానాథుని పేర నీ గ్రంథమును రచించినట్లు స్పష్టముగా చెప్పఁబడియుండుటచే ఆ వాదమునే పలువురు విమర్శకు లంగీకరించుచున్నారు. ఇది వాల్మీకి రామాయణము ననుసరించి తెలుఁగున వ్రాయఁబడిన ద్విపద కావ్యము. ఇందు కవి జనశ్రుతి నుండి గ్రహించి చొప్పించిన అవాల్మీకములయిన గాథలును కొన్ని గలవు. అందు జంబుమాలి, కాలనేమి, సులోచన అను వారి వృత్తాంతములు ముఖ్యాలైనవి. ఇందలి కథాభాగములు మూలమున కెంతో మెఱుఁగు చేకూర్చుచు రసవంతములై యున్నవి. రావణ విభీషణ కుంభకర్ణాదుల శీలములును, చిత్తవృత్తులును ఇందు చక్కగా వర్ణింపఁ బడినవి. ఇందలి వర్ణనములు మిక్కిలి గంభీరములై ఉదాత్తములుగా నుండును. ఇందలి శైలి లాక్షణికమును ప్రసన్నమునై ద్విపదయయ్యు నెచ్చటను విసువు గొల్పక చాల మనోహరముగా నుండును. ద్విపద కావ్యములలో శైలీపాటవముచేతను, కథా గౌరవము చేతను రంగనాథ రామాయణమున కొక విశిష్టస్థానము చేకూరినది. ఇందలి ఉత్తరకాండమును బుద్ధారెడ్డి ఆనతిచే ఆతని కుమారులైన కాచవిట్ఠలవిభులు రచించి రామాయణమును పూర్తికావించిరి. వీరి రచన తండ్రి రచన యంత ఉత్తమము కాకపోయినను రసవంతముగానే ఉండును.

తిక్కన తరువాత యుగకర్త అని చెప్పఁదగినవాఁడు ఎఱ్ఱాప్రెగ్గడ. ఈతని యుగమున వెలసిన తొలి కావ్యము భాస్కర రామాయణము. ఇదియును భారతమువలె నైకకవికర్తృక మగుట సంభవించినది. హుళక్కి భాస్కరుఁడు, ఆతని కుమారుఁడైన మల్లికార్జునభట్టు, శిష్యుఁడయిన కుమారరుద్రదేవుఁడు, మిత్రుఁడయిన అయ్యలార్యుఁడు దీనికి కర్తలు. వీరిలో వయఃపాండిత్య ప్రతిభలచే పెద్దయైనవాఁడు భాస్కరుఁ డగుటచే కావ్య మాతనిపేరనే వెలయింపఁబడినది. ఈ రామాయణమున తిక్కన

తాత అగు భాస్కరుని రచన కూడ నున్నదని కొందఱి తలంపు. అతఁడు వాల్మీకి రామాయణమును చాల సంగ్రహముగా రచించె ననియు, దానితో తృప్తినొందక హుళక్కి భాస్కరాదు లచ్చటచ్చట పెంచి ఈ రామాయణ మునకు రూప మొసంగి రనియు వారి వాదము. వారు చెప్పు హేతువులను బట్టి చూడ నీ వాదము కొంత యుక్తియుక్తముగానే కానవచ్చుచున్నది. మంత్రి భాస్కరుని రచన సుందరకాండము వఱకుఁగల అన్ని కాండము లంమ నెంతో కొంత కలదని దీనివలన తెలియుచున్నది. హుళక్కి భాస్కరుఁ డారణ్యకాండమును, యుద్ధకాండమున 1133 పద్యములను రచించెను. ఈతని రచన రెండవ ప్రతాపరుద్రుని అశ్వసేన కధ్యక్షుఁడైన సాహిణి మారన (1295-1323) కంకితము చేయఁబడినది. ఈతనిశైలి సమాస భూయిష్ఠమయ్యు సుబోధమై నన్నయ కవితను బోలియుండును. యుద్ధ కాండమున నతని రచనలో తిక్కన అనుకరణములు గోచరించుచున్నవి. మల్లికార్జునభట్టు తండ్రి యంత కవి కాకపోయినను ప్రతిభావంతుఁడు. ఇతని రచన బాలకాండమునకంటె కిష్కింధా సుందర కాండములలో మేల్తరముగా నుండును. వాలిభార్య యైన తార శోకము నీతఁడు కరుణరస నిర్భరముగా వర్ణించెను. కుమారరుద్రదేవునికి సంగ్రహరచనపై ప్రీతి మెండు. ఇతఁడు రచించిన అయోధ్యాకాండము భావ సంగ్రహమునకును భాషామాధుర్య మునకును నెలవై మనోహరముగా నుండును. అయ్యలార్యుఁడు భాస్కరుఁడు రచింపఁగా మిగిలిన యుద్ధకాండమును పూర్తిచేసెను. ఇతఁడు ప్రౌఢసమాసములతో కూడిన శైలియం దభిమానము చూపెను. వీరరస ప్రధానమయిన యుద్ధకాండమున కా శైలి అనుగుణముగానే ఉన్నది. మొదటినుండి తుదిదాఁక నొక చేతిమీఁద సాగమిచే భాస్కర రామాయణము నందలి శైలి ఏకధారగా నుండక సమవిషమముగా గోచరించును.

ఎఱ్ఱన రెడ్డిరాజుల ఆస్థానమున నుండిన మహాకవి. (క్రీ. శ. 14 వ శతాబ్ది పూర్వభాగము) ఇతఁడు ప్రతిభా పాండిత్యములందు నన్నయ తిక్కనల కెనయై భారతారణ్యపర్వ శేషమునేకాక హరివంశమునుగూడ

సమర్థతతో నిర్వహించి కవిత్రియములో స్థానము సంపాదింపఁ జాలెను. ఇతఁ డారణ్యపర్వశేషమును నన్నయ పేరుమీఁదుగనే తెనిఁగించి రాజరాజునకే అంకితము చేసెను. ఇది ఆతనికి సహజమైన వినయమును నన్నయపైఁ గల భక్తిని చాటుచున్నది. ఈతఁ డారణ్యపర్వ శేషమును నన్నయ శైలితో నారంభించి తిక్కన శైలితో ముగించెను. అందుచే నితని రచన నన్నయ తిక్కనల రచనలను మహాసముద్రములను కలుపు జలసంధివలె గోచరించును. అరణ్యపర్వము నందలి ఘోషయాత్ర, రామోపాఖ్యానము, సావిత్ర్యుపాఖ్యానము, యక్షప్రశ్నలు అను భాగములు మిక్కిలి పేరుగాంచినవి. అరణ్యపర్వశేషమున ఎఱ్ఱన సంస్కృతాంధ్రములను సమభాగములుగా వాడియుండెను. ఎఱ్ఱన రామాయణమును గూడ రచించి తన ప్రభువైన ప్రోలయ వేమారెడ్డి కంకితము కావించెను. అది యిప్పుడు లభ్యమగుట లేదు. హరివంశమున నీతని శైలి పరిపక్వత నొందినది. ఇందు శ్రీకృష్ణుని చరిత్రము సంపూర్ణముగా వర్ణింపఁబడినది. గోకులమును వర్ణించుపట్ల ఎఱ్ఱన జానపద జీవితము నెంతో రమ్యముగా చిత్రించెను. హృద్యమైన అనురాగమున కాలంబనమైన సాత్త్వికశృంగారమును వర్ణించుటలో ఎఱ్ఱన మేటి. ఉషానిరుద్ధుల చరిత్రము, రుక్మిణీ కల్యాణము ఇందు మిక్కిలి రసవంతములుగా నుండును. అనువాద విషయమున ఎఱ్ఱన నన్నయ తిక్కనలమార్గమునే అవలంబించెను. ఎఱ్ఱన రచించిన స్వతంత్ర కావ్యము లక్ష్మీనృసింహపురాణము. బ్రహ్మాండ పురాణము నుండి వస్తువును గ్రహించి ఎడనెడ చక్కని వర్ణనలు చేర్చి దాని నాతఁ డొక హృద్యమైన ప్రబంధముగా సంతరించెను. ప్రహ్లాద చరిత్ర మిందలి కథ. భక్తివర్ణనమున నీతఁడు పోతన కీడుకాకపోయినను ప్రహ్లాద చరిత్ర వర్ణించుపట్ల నాతని కీతని రచన ఉజ్జ్వలంతియయ్యె ననుటలో నతిశయోక్తి ఉండదు. ఈతని శైలి సత్త్వశుద్ధికి నెలవై సత్త్వప్రధానమైన యితనిశీలమున కాదర్శమువోలె గోచరించును. శ్రీనాథుఁ డితని సూక్తివైచిత్రిని ప్రశంసించెను. ఇతనికి ప్రబంధపరమేశ్వరుఁ డనియు శంభుదాసుఁ డనియు బిరుదనామములుకలవు.

బాలసరస్వతి తన యనువాదము నందలి పద్యములను సురభి మల్లా నీతివాచస్పతీ అను మకుటముతో రచించెను. ఈ సురభిమల్లి భూపతి జటప్రోలు సంస్థానాధీశుఁడని విమర్శకులు చెప్పుచున్నారు. బాల సరస్వతి కవిత్వము ప్రౌఢమై, కొంచె మర్థక్లేశము కలిగించును. ఇతఁడు నన్నయ రచనగా ప్రసిద్ధమైన ఆంధ్రశబ్ద చింతామణికి టీక రచించెను. ఇదికాక చంద్రికా పరిణయ మను ప్రబంధమును కూడ ఇతఁడు వ్రాసె నని చెప్పుదురు. కాశీరాజు కూఁతురైన చంద్రికను భీముఁడు వివాహ మాడుట ఇందలి కథ. ఈ గ్రంథము సురభి మాధవరాయల చంద్రికా పరి ణయముకంటె భిన్నమైనది.

అడిదము సూరకవి విజయనగర సంస్థానమునఁ బూసపాటి (రెండవ) విజయరామరాజుగారి కాలమున (1730-1780) నుండినట్లు తెలియుచున్నది. కవిజనరంజనము, రామలింగేశ్వర శతకము, కవి సంశయ విచ్ఛేదము, ఆంధ్రచంద్రాలోకము, ఆంధ్రనామశేషము అనున వీతని కృతులు. ఇవిగాక ఇతఁడు రచించిన చాటువులును, దూషణ పద్యములును బెక్కు గలవు. కవిసంశయ విచ్ఛేదము మూఁ డాశ్వాస ములతోఁ గూడిన చిన్న లక్షణగ్రంథము. ఆంధ్రనామశేషము అచ్చ తెనుఁగు నిఘంటువు. పైడిపాటి లక్ష్మణకవి రచించిన ఆంధ్రనామ సంగ్రహమున కిది శేషగ్రంథము. ఆంధ్రచంద్రాలోకము జయదేవకృత మైన సంస్కృత చంద్రాలోకమున కాంధ్రీకరణము. రామలింగేశ శతకము "రామలింగేశ రామచంద్ర పురవాస" అను మకుటముగల సీసపద్య శతకము. ఈ శతకమున ఆ కాలపు రాజుల దుశ్చర్య లన్నియు వర్ణింపఁబడినవి. ఇందలి దూషణమునకు గుఱియైనవాఁడు పూసపాటి సీతారామచంద్రరా జను విజయనగరసంస్థానపు మంత్రియని చెప్పుదురు. ఈతని గ్రంథములలోనికెల్ల నుత్తమమైనది కవిజనరంజనము. చంద్రమతీ పరిణయ మిందలి కథ. ఇందలి పద్యములు పెక్కు వసుచరిత్రము నందలి పద్యములను దలపించుచుండుటచే దీనికి పిల్లవసుచరిత్ర యను పేరు

కల్గినది. ఇందు మూఁడాశ్వాసము లున్నవి. ఈ కవి తన కృతుల నన్నిటిని రామచంద్రపురము నందలి రామలింగేశ్వరున కంకితము చేసెను. సూరకవి శైలి లాక్షణికమును, సమాసభూయిష్ఠమునై రమ్యముగా నుండును. ఈతని తిట్టుకవిత్వము "సూరకవి తిట్టు కంసాలి సుత్తిపెట్టు" అని ప్రసిద్ధి కెక్కినది.

క్రీ. శ. 18వ శతాబ్ది యందలి యాంధ్రకవులలో మిక్కిలి ప్రౌఢుఁడని పేరందినవాఁడు కనుపర్తి అబ్బయామాత్యుఁడు. ఇతఁడు సూరకవికి సమకాలికుఁడు (1780). మంగళగిరి పానకాలరాయని భక్తుఁడు. ఇతఁడు అనిరుద్ధ చరిత్రము, కవిరాజ మనోరంజనము అను రెండు ప్రబంధములు రచించెను. ఇందు మొదటిదానికంటె రెండవది మిక్కిలి ప్రౌఢమై పిల్ల వసుచరిత్ర మని ప్రసిద్ధి గాంచినది. పురూరవశ్చక్రవర్తి చరిత్ర మిందలి విషయము. "వసుచరిత్రమునకుఁ దరువాత నీతని కవిరాజ మనోరంజనముతో సరితూఁగఁగల ప్రబంధము లొకటి రెంటికంటె నెక్కువగా లే"వని కీ. శే. వీరేశలింగం పంతులుగారు దీనిని గూర్చి చెప్పియున్నారు. ఈ కవి భట్టుమూర్తివలె సాహిత్యమునందే కాక సంగీతమునందుకూడ మిక్కిలి ప్రవీణుఁడైనట్లు తెలియుచున్నది.

ఈ కాలమున మిక్కిలి ప్రసిద్ధికెక్కిన మఱొకకవి కంకంటి పాపరాజు. ఇతఁడు నెల్లూరు మండలము నందలి ప్రళయ కావేరీ పట్టణమున అమీనుగా లౌక్యాధికారమునం దుండినవాఁడు. (1750–1800) తిక్కన సోమయాజి నిర్వచనముగా రచించిన ఉత్తర రామాయణమునే ఇతఁడు ప్రబంధరీతిని చంపూకావ్యముగా సంతరించెను. అచ్చటచ్చట కొన్ని లాక్షణికదోషము లున్నను ఇది మిక్కిలి రసవంతమై సహృదయ హృదయ రంజకముగా నుండును. దీనికి మూలము రామాయణము నందలి ఉత్తరకాండము. తిక్కన మూలమును సాధ్యమైనంత వఱకు సంగ్రహించుటకు యత్నింపఁగాఁ బాపరాజు దానిని విస్తృత మొనరించినట్లు కాననగును. ఇందలి వర్ణనలు ప్రబంధోచితములై మిక్కిలి

ప్రౌఢములుగా నున్నవి. రావణ కుంభకర్ణాదుల పూర్వచరిత్రములును, శ్రీరాముఁడు జనాపవాద కారణమున సీతను పరిత్యజించుటయు ఇందు చక్కఁగా వర్ణింపఁబడినవి. సీతాపరిత్యాగము, రాముని అశ్వమేధాచరణము కుశలవుల రామాయణ గానము, నిండు సభలో సీత భూగర్భము చొచ్చుట మున్నగు ఘట్టములను వర్ణించుపట్ల పాపరాజు మిక్కిలి నేర్పు ప్రదర్శించెను. గ్రంథారంభమున ఇతఁడు శబ్దాలంకారములం దెక్కువ మక్కువ చూపినను పోను పోను రసపోషణమునకే యధిక ప్రాధాన్య మొసంగి యుండెను. ఈ కావ్యమున వృత్తముల సంఖ్య హెచ్చు. రచన సంస్కృత సమాసభూయిష్ఠమై మిక్కిలి ధారాళముగా నుండును. ఈ కావ్యమును రచించుటలోఁ దనకుఁ బుష్పగిరి తిమ్మన సాయ మొనరించెనని పాపరాజు చెప్పుకొని యుండుటచేఁ గొంద ఱీ గ్రంథమంతయుఁ గూడ నాతఁడే రచించి పాపరాజు పేరఁ బ్రకటించెనని యభిప్రాయపడుచున్నారు. ఈ కావ్యము రచించుటకు ముందు పాపరాజు విష్ణుమాయా విలాస మను యక్షగానమును గూడ రచించియుండెను. ఈ రెండు గ్రంథములు అతని యిష్టదైవమగు మదన గోపాలస్వామి కంకితము చేయఁబడినవి.

దిట్టకవి నారాయణకవి రంగారాయ చరిత్ర మను మూఁడాశ్వాసముల చారిత్రిక ప్రబంధమును రచించి (1790) బెల్లంకొండ దుర్గాధిపతియు, పద్మనాయక వంశజుఁడును అగు మల్రాజు రామారాయనింగారి కంకితము కావించెను. ఇది వీరరస ప్రధానమైన ప్రబంధము. బొబ్బిలి సంస్థానాధిపతియైన రావు రంగారావుగారి సేనలకును బుస్సీ యాధిపత్యము నందలి ఫ్రెంచి సేనలతోఁ గూడిన పూసపాటి విజయరామరాజుగారి సేనలకును క్రీ. శ. 1757 వ సంవత్సరమున బొబ్బిలికోట దగ్గఱ జరిగిన యుద్ధ మిందు వర్ణింపఁబడినది. ఈ యుద్ధమున బొబ్బిలివారే ఓడిపోయినను వా రందు ప్రదర్శించిన శౌర్యధైర్యములు నిరుపమానములు. వానివి నారాయణకవి మహోత్సాహమున వర్ణించెను. లక్షణదోషము లెడనెడ

గోచరించుచున్నను ఈ కావ్యము హృద్యమయిన రచనతోఁగూడి మిగుల రసవంతముగా నున్నది. ఇందు సందర్భానుసారముగా నా కాలమున వాడుకలో ఉన్న ఉర్దూపదములు పెక్కు ప్రయోగింపఁబడినవి.

మంగళగిరి ఆనందకవి (1760 ప్రాంతము) బ్రాహ్మణుఁ డయ్యును క్రైస్తవమత మవలంబించి, వేదాంతరసాయన మను గ్రంథము రచించి, తనవలెనే క్రైస్తవమతము నవలంబించిన నిడిమామిళ్ళ దాసామాత్యున కంకిత మిచ్చెను. ఈ గ్రంథమున క్రైస్తవమత స్థాపకుఁడైన ఏసుక్రీస్తు చరిత్రము వర్ణింపఁబడినది. ఇందలి శైలి నిర్దుష్టమై, మిక్కిలి ప్రౌఢముగా నుండును. వర్ణనలు ప్రబంధకవుల వర్ణనల ననుకరించుచుండును. పింగళి ఎల్లనార్యుఁ డను కవి గూడ ఇట్లే క్రైస్తవమత సంబంధియగు సర్వేశ్వర మాహాత్మ్య మను తోభ్య చరిత్రమును మృదుమధురపాకమున రచించి పేరు గాంచెను.

మహాకవి యను పేరు గడింపక పోయినను వేలకొలఁది పద్యములను రచించి సర్వాంధ్రజనుల హృదయములందు స్థిరనివాస మేర్పఱుచుకొన్నవాఁడు వేమనయోగి. ఈతఁడు క్రీ. శ. 18 వ శతాబ్ది పూర్వభాగమున నివసించె నని శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు నిర్ణయించియున్నారు. ఇతఁడు వ్రాసిన పద్యములలో పెక్కు ఆటవెలఁదులు. కొన్ని కందములును, వృత్తములును కూడ ఉన్నవి. ఆటవెలఁదుల చివర "విశ్వదాభిరామ వినురవేమ" అను మకుటము గోచరించును. ఈతఁడు రచించిన పద్యములు శతసంఖ్యా నియమమునకు లోఁబడక పోయినను కథావస్తువేమియు లేకుండుట, మకుటము గోచరించుట అను హేతువులచే శతక పద్యములుగానే పరిగణింపఁబడుచున్నవి. ఈ విషయమున ఈతని పద్యములను శివతత్త్వసారము నందలి పద్యములతో పోల్చవచ్చును. ఈతఁ డేదో గ్రంథమును వ్రాయవలెనను తలంపుతో పద్యములను వ్రాసినవాఁడు కాడు దేశము నందలి వివిధ ప్రాంతముల

స్వేచ్ఛగాఁ దిరుగుచు, అడిగినవారికెల్ల నాశువుగా నాయాయి విషయము లను గూర్చి ఆతఁ డాటవెలఁదులలో సమాధానములు చెప్పియుండెను. వానిని శిష్యులు వ్రాసికొని ప్రచారము చేసియుండిరి. వేమన మిక్కిలి స్వతంత్రుఁడు. సంఘము నందును, వ్యక్తులందును దనకు గోచరించిన దోషములనెల్ల ఆతఁడు నిశితముగా విమర్శించియుండెను. ఆ కాలపు బ్రాహ్మణు లొనరించు దురాచారముల నతఁడు తీవ్రముగా ఖండించెను. మతము పేర జరుగు నత్యాచారములు చూచి యతఁ డసహ్యించు కొనెను. ఆతని పద్యములలో నీతులు కొల్లలుగా గోచరించును. ఆ నీతుల కతని యనుభవమే మూలము. వేదాంతతత్త్వమును బోధించు పద్యములు కూడ ఆతఁడు పెక్కు చెప్పియుండెను. అందుఁ గొన్ని గూఢభావగర్భితములయి యుండుటచే దురవగాహములుగా నుండును. వేమన హాస్యప్రియుఁడు. ఈతని విమర్శకు గుఱియగు వారు కూడ విచారము నొందక వికసిత హృదయములతో నేగుట కీతని పద్యములం దుండు మృదుల నిర్మలమైన హాస్యమే కారణము. భావముల తీవ్రత, నీతి నిర్భరత, ధారాశుద్ధి, నిశిత విమర్శ ఈతని పద్యము లందలి గుణ విశేషములు ఈతఁ డెచ్చటను పాండిత్య ప్రదర్శనమునకై పాటుపడి యుండలేదు. సర్వజన సుబోధములు, జాతీయములు, సరళమంజులములు ఐన పదములనే ఈతఁడు వాడియుండెను. పామరులు సైత మీతని పద్యములయెడ ప్రీతికలిగియుండుట కీ సౌలభ్యమే ముఖ్యకారణము. ఇతఁడు జీవితమునందువలెఁ గవిత్వమునఁ గూడ నాంతర్యమున కిచ్చినంత ప్రాధాన్యము బాహ్యవిషయముల కిచ్చియుండలేదు. అందుచే నితని రచనలో వ్యాకరణాది దోషము లచ్చటచ్చట గోచరించును. పండితు లెవ్వరును ఈతని మహాకవి యని మన్నింపకపోవుట కిదియే కారణము. కాని పండితులనక, పామరులనక ఆంధ్రులెల్లరు నీతని పద్యముల నాప్యాయ ముగా పఠింతు రని చెప్పినచో నత్యుక్తి ఉండనేరదు.

పిండిప్రోలు లక్ష్మణకవి రావణదమ్మీయ మను నామాంతరముగల లంకావిజయ మను ద్వ్యర్థికావ్యమును రచించెను. ఇందు రెండే ఆశ్వాసము లున్నవి. రావు ధర్మరాయఁ డను వెలమకులజుఁ డీతని లంక నేల కొంత అపహరింపఁగా ఇతఁ డాగ్రహమున నతనిని రావణునితోడను, క్షేత్రాప హరణ వృత్తాంతమును రామాయణ కథతోడను పోల్చి యీ ద్వ్యర్థికావ్య మును రచించెను. తిట్టు కవితయం దీతఁడు దిట్ట. భీమకవి, శ్రీనాథుఁడు మున్నగువారుకూడ తనవలెఁ దిట్టఁజాలరని ఈతఁడు చెప్పుకొనియుండెను. ఈతని కావ్యము రాఘవ పాండవీయాదు లంత ప్రౌఢమైనది కాదు. ఇందు అర్థశ్లేషమే పలుచోట్ల కానిపించును అందందు వ్యాకరణదోషములు కూడ ఉన్నవి. ఇతఁడు పెక్కు చాటుపద్యములు చెప్పినట్లు తెలియుచున్నది.

లక్ష్మణకవి సమకాలికుఁ డని చెప్పఁదగిన శిష్టు కృష్ణమూర్తి కవి సంస్కృతాంధ్రము లందు మహాపండితుఁడై పెక్కు గ్రంథములను రచించెను. సంగీతశాస్త్రమునఁ గూడ ఇతని కపారమైన పాండిత్యము కలదు. పురాణప్రవచనము నందును, ఆశుకవిత్వ మందును ఇతఁ డారితేరి యుండెను. ఇతఁడు తన జీవితకాలమున పలువు రధికారులను, భూస్వాము లను దర్శించి, వారిచే గొప్ప సత్కారములు పొందెను. సర్వకామదా పరిణయము, వేంకటాచల మాహాత్మ్యము, పీఠారణ్య మాహాత్మ్యము, పంచ తంత్రము, స్త్రీ నీతిశాస్త్రము, వసుచరిత్ర వ్యాఖ్యానము మున్నగున వీతని తెలుఁగు రచనలు. సంస్కృతమునఁగూడ ఇతఁడు రచించిన గ్రంథము లనేకము లున్నవి. అందు హరికారికలను వ్యాకరణ గ్రంథము పేర్కొనఁ దగియున్నది. చిన్నయసూరి బాలవ్యాకరణమునకును దీనికిని చాల పోలిక యున్నది. బాలవ్యాకరణమునకుఁ గల ప్రసిద్ధి చూచి దాని నపకీర్తిపాలు చేయుటకై కృష్ణమూర్తికవియే యీ కారికలను రచించి, హరిభట్టుకృత మను శంక కలిగించుటకై హరికారిక లని పేరుపెట్టెనని విమర్శకు లభిప్రాయపడుచున్నారు.

మండపాక పార్వతీశ్వరకవి (1833-97) శిష్టు కృష్ణమూర్తికవి వలెనే గొప్ప విద్వాంసుఁడు. ఇతఁడు బొబ్బిలి సంస్థానమున నాస్థాన కవియై ఉండెను. రాధాకృష్ణ సంవాదము, కాంచీపుర మహాత్మ్యము, అమరుక వ్యాఖ్యము అను కావ్యములే కాక ఇతఁడు పెక్కు శతకములు, దండకములు, వంశచరిత్రములు రచించెను. ఇతఁడు సుమా రెనుబది గ్రంథములు రచించెనని చెప్పుదురు. ఇతని గ్రంథములలోని కెల్ల రాధాకృష్ణ సంవాదము సుప్రసిద్ధమైనది.

గోపీనాథము వేంకటకవి వేంకటగిరి సంస్థానమున నాస్థానకవిగా నుండి పెక్కు గ్రంథములు రచించెను. అందు వాల్మీకి రామాయణమున కాంధ్రీకరణమైన గోపీనాథ రామాయణము, కృష్ణజన్మ ఖండము, శిశుపాలవధాంధ్రీకరణము ముఖ్యములైనవి. కృష్ణజన్మ ఖండము బ్రహ్మ వైవర్తపురాణము నందలి భాగము. భాస్కర రామాయణాదులు యథా మూలముగా లేవని వేంకటకవి దానిని మూలానుగుణముగా తెనిఁగించెను. ఇతని రచన సులభమును, సరళమునై మనోహరముగా ఉండును.

ఈ యుగమున ఆంధ్రదేశమున వర్తిల్లిన కవయిత్రులలో తరిగొండ వేంకమాంబ (1840) పేర్కొనఁదగినది. ఈమె వేంకటాచల మాహాత్మ్యము జ్ఞానవాసిష్ఠ రామాయణము, రాజయోగసారము అను గ్రంథములను రచించి, తరిగొండ నృసింహస్వామి కంకితము కావించెను. జ్ఞానవాసిష్ఠము ద్విపదకావ్యము తరణోపాయముగా తానీ గ్రంథము రచించినట్లు కవయిత్రి చెప్పుచున్నది. వైరాగ్య ప్రభావమును ఆత్మానాత్మ వివేకమును తెలుపు కథలిం దనేకము లున్నవి. గూఢ వేదాంత విషయములను గూడ వేంకమాంబ మృదుమధురముగను, స్పష్టముగను వివరించియున్నది. మడికి సింగన అను కవి ఈ గ్రంథము నింతకు పూర్వమే పద్యకావ్యముగ రచించియుండెను. రాజయోగసారముకూడ ద్విపద కావ్యమే. ఇందు రాజ యోగ విశేషములు చక్కఁగా వివరింపఁబడియున్నవి. వేంకమాంబ రచించిన

గ్రంథములలో ప్రసిద్ధమైనది వేంకటాచల మాహాత్మ్యము. ఇది వేంకటగిరి క్షేత్ర మాహాత్మ్యమును వర్ణించు కావ్యము. వరాహభవిష్యోత్తర పద్మపురాణము లందలి వేంకటాచల మాహాత్మ్యము లీ కావ్యమునకు మూలములు. క్షేత్రమాహాత్మ్యమును వెల్లడించుటకై యిందు చెప్పఁబడిన మాధవుఁడను బ్రాహ్మణ యువకుని కథ మిక్కిలి హృద్యముగా నున్నది. ఇట్లే యిందలి పద్మావతీ శ్రీనివాసుల వివాహ వృత్తాంతము కూడ రమణీయమై యొప్పారుచున్నది. శ్రీనివాసుఁ డెఱుకసాని వేషమున అంతిపురము చొచ్చుటయు, అతనికిని లక్ష్మీదేవికిని జరిగిన సంవాదమును మిక్కిలి సహజముగా వర్ణింపఁబడినవి. తన భర్త ద్వితీయ వివాహము చేసికొనఁ బోవునపుడు లక్ష్మి అనుభవించిన వేదనను వేంకమాంబ నిపుణతతో వర్ణించి, స్త్రీ హృదయమును గ్రుమ్మరించినది. ఈమె శైలి వేదాంత విషయ వివరణ సందర్భములఁ గూడ మధురమై, వ్యవహారమునకు సన్నిహితముగా నుండును. ఈమె రచనలో అచ్చటచ్చట వ్యాకరణ స్ఖాలిత్యములు గోచరించును. ఈమె గొప్ప విద్వాంసురాలయ్యును వినయవతి. శృంగారరసమును వర్ణించుటయం దీమె వైముఖ్యము ప్రదర్శించెను. ఈమె రచన లాత్మజ్ఞానమునకును, ఔచిత్యమునకును ఆటపట్టులు.

ఈ యుగమున తెలంగాణమున వెలసిన కొందఱు కవిపుంగవులను గూర్చి చెప్పవలసియున్నది. జటప్రోలు సంస్థానాధిపతి యయిన సురభి మాధవరాయలు చంద్రికాపరిణయ మను ప్రబంధమును రచించెను. ఈతఁడు సర్వజ్ఞ సింగమనీని వంశమునకు చెందినవాఁ డని ప్రతీతి. ఈ చంద్రికా పరిణయము పిల్లవసుచరిత్ర యని చెప్పఁదగినట్టిది. ఇందు చంద్రికా సుచంద్రుల ప్రణయము వర్ణింపఁబడినది. భట్టుమూర్తివలెనే ఈ కవియు శ్లేషయమకాదులందును, ఇతర శబ్దాలంకారము లందును ప్రీతి ప్రదర్శించెను. ఇతని శ్లేషలు వసుచరిత్రశ్లేష లంత భావ

పూరితములును, సుందరములును కాకపోయినను ఈతఁడు ప్రదర్శించిన పాండిత్య పాటవము అమేయ మని చెప్పుటకు సందేహింప నవసరములేదు.

పరశురామ పంతుల లింగమూర్తి కవి ఓరుగల్లులో జనించెను. ఇతఁడు యౌవనమున రతిమన్మథ విలాస మనెడి శృంగార ప్రబంధమును రచించినను క్రమముగా భక్తి వైరాగ్య భావములకు నిలయమై, సీతా రామాంజనేయ సంవాద మను వేదాంత గ్రంథమును రచించెను. ఇందు జీవబ్రహ్మైక్య సిద్ధాంతము నిరూపింపఁబడినది. ఇందలి మూఁడాశ్వాసము లలో వరుసగా తారకయోగము, సాంఖ్యయోగము, అమనస్క యోగము అను మూఁడు యోగములు వివరింపఁబడినవి. గూఢమైన వేదాంతమును గూడ రసవంతమైన కావ్యముగ చెప్పఁజాలుట ఈ కవి యందలి విశేషము. సందర్భోచితములును, అనుభవసిద్ధములునైన ఉప మానములను గూర్చి ఈ కవి వేదాంతమునుగూడ సర్వజనసుబోధముగా సంతరించెను. తెలుఁగున వెలసిన వేదాంతకావ్యములలో దీనికి సాటి వచ్చునది వేఱొకటి లేదు. ఈ కవి కుమారుఁడైన రామమూర్తి కవి శుకచరిత్ర మను వేదాంత గ్రంథమును వ్రాసినాఁడు, దీనినిబట్టి వేదాంత విచార మీ వంశమువారి కనుశ్రుత మని తెలియవచ్చు చున్నది.

దేవరకొండలో నుండిన మరింగంటి వంశమున పలువురు పండిత కవు లుదయించిరి. వీరు వైష్ణవులు. విశిష్టాద్వైతాచార్యులుగా చిర కాలమునుండి ప్రసిద్ధి వహించినవారు. వీరిలో మరింగంటి సింగరా చార్యులను కవి దశరథరాజనందన చరిత్ర మను పేర నిరోష్ఠ్యరామా యణమును శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకల్యాణ ప్రబంధమును రచించెను. ఈయనకు శతఘంటావధాని యని బిరుదు కలదు. ఈయన కవితస లక్షణమై పలువురు పండితులయు, విమర్శకు లయు ప్రశస్తి లందినది. మరింగంటి వేంకట నరసింహాచార్యుఁ డను కవి శ్రీకృష్ణ శతానందీయము, చిలువపడిగ రేని

పేరణమును అను రెండు కావ్యములను రచించెను. ఇందు మొదటిదాని యందలి కథ భాగవతము నుండి గ్రహింపఁబడినది. ఈ కవి కళాపూర్ణోదయ మునుచూచి కాఁబోలు ఇందొక విచిత్రమయిన కల్పన కావించెను. కృష్ణుఁడు మాయాబ్రహ్మయై సరస్వతికడనుండ, సత్యబ్రహ్మ ఆట కరిగి అతనితో వాదించుట ఈ కల్పన యందలి ముఖ్యాంశము. రెండవది అచ్చ తెనుఁగుకావ్యము. ఇందు నాగకేతనుఁడైన దుర్యోధనుని వివాహము వర్ణింపఁబడినది. మరింగంటి వంశమునకుఁ జెందిన మఱియొక కవి నరసింహాచార్యులు. ఇతఁడు తాళాంకనందినీ పరిణయమును ప్రబంధముగా రచించెను. మేనఱికపు వివాహముల పరిస్థితి ఇందు చక్కఁగా వర్ణింపఁ బడినది.

పురాణము నందలి ఆంధ్రకవిత్వమున శబ్దార్థములకు సమప్రాధా న్యము కనిపించును. ప్రబంధయుగమునాఁటి కర్థభావములపైకంటె శబ్ద ములపై కవులకు మక్కువ పెరిఁగినది. దక్షిణాంధ్ర యుగమున నది మఱింత యభివృద్ధి యైనది. చివరకు క్రీ. శ. 19 వ శతాబ్దినాఁటికి ఆంధ్ర కవిత రసభావములందు కొఱవడి శబ్దార్థాలంకార ప్రధానమై ఔదాత్త్య మును కోల్పోవుట సంభవించినది. కవులు పలువురు స్వతంత్ర ప్రక్రియ లకు పూనక పెద్దన రామరాజభూషణాదుల ప్రబంధముల ననుసరించుటే పరిపాటియైనది. ఈ కారణముచే నాంధ్ర సరస్వతి యమక శ్లేషాను ప్రాసాద్యలంకారశృంఖలలలో తగుల్కొని, సహజ స్వచ్ఛంద సంచారము నకు దూరము కావలసివచ్చినది. శ్రీ వీరేశలింగం పంతులుగారు రచించిన సరస్వతీ నారద సంవాద మను ఖండకావ్యములో అప్పటి కవితా పరిస్థితి చక్కఁగా వర్ణింపఁబడినది. సాహిత్యరంగమున చైతన్యము లోపించి అనుకరణమే ఆధిపత్యము వహించుట చూచి ఆంగ్లభాషా నిష్ణాతులగు పండితులును, యువకులును నూతన మార్గముల నన్వేషించి అనుసరింప యత్నించిరి. సంప్రదాయసిద్ధమైన కవితావాహిని యేదో యొకవిధముగా

ప్రసరించుచునే యున్నను, వారి అన్వేషణ ప్రయత్నములకు ఫలితముగా నూతన కవితాప్రవాహము లేర్పడి దేశము నలుమూలల వ్యాపించినవి. వాని పరిణామ వికాసముల వివరణమే ఆధునికాంధ్ర వాఙ్మయ చరిత్రమున ప్రధానస్థాన మాక్రమించును.

# ఆంధ్రవాఙ్మయ చరిత్రము

## ఆధునికయుగము

ఒక వంద యేండ్లు పరపాలనావిషమూర్ఛితమై, నిద్రాణ స్థితిలో నుండిన భారతజాతి 1857 నాఁటి ప్రథమ భారతస్వాతంత్ర్య సంగ్రామముతో నాకస్మికముగ జాగృతమయినది. పాశ్చాత్య నాగరికతా వ్యామోహాపరవశులై యుండిన యాంగ్ల విద్యాధికుల కది కనువిప్పయ్యెను. నా దేశము, నా జాతి, నా భాష, నా సంస్కృతి యను భావము విద్యాధికులనావహించినది. జాతియం దుద్బుద్ధమైన యీ నవచైతన్యము రాజకీయ మత సాంఘిక సారస్వతాది సర్వరంగములందును వ్యక్తము కాఁజొచ్చినది. స్వస్థాన వేష భాషాభిమానమే యీ చైతన్యము యొక్క ఫలము. ఆధునికాంధ్రవాఙ్మయచరిత్ర యనఁగా నా చైతన్య మాంధ్రసాహిత్యరంగమున నే యే రూపము లంది యెట్లు ప్రవర్తిల్లినదో పరిశీలించుటయే.

గాఢనిద్ర నుండి మేల్కాంచిన యాంధ్రజాతి యొక్కసారి తన గత చరిత్రపై దృష్టిసారించినది. కవులు కొందఱు మహోన్నతములైన తమ ప్రాచీన సాహిత్య సంప్రదాయములను బునరుద్ధరింపవలెనని దీక్ష పూనిరి. ఈ కాలముననే చిన్నయసూరి యాంధ్రభాష కొక వ్యాకరణము నిర్మించి, దానికి లక్ష్యభూతముగ నుండునట్లు నీతిచంద్రిక యను గద్యకావ్యమును రచించి, నన్నయ పద్యమునకువలెఁ దాను గద్యమున కాద్యుఁ డనిపించుకొనెను. ఆయన యొక నిఘంటువును గూడ రచించుట కారంభించి యది ముగియకుండనే దివంగతుఁ డయ్యెను. కొంచె మించుమించుగా నీ సమయముననే ఛార్లెస్ ఫిలిప్ బ్రౌను అను ఆంగ్లేయుఁడు ఆంధ్రదేశమునకు కలెక్టరుగా వచ్చి యాంధ్రభాష కపారమైన సేవ యొనరించెను. ఆయన పలువురు పండితులను జేరఁదీసి వారిచేఁ దాళపత్రి

రూపమున నుండిన కొన్ని ప్రాచీన గ్రంథములను బరిష్కరింపఁజేసి, వానికి వ్యాఖ్యానములు వ్రాయించెను. వారి తోడ్పాటుతోడనే తా నొక ఆంధ్రాంగ్ల నిఘంటువును గూడ నిర్మించెను. వేమన తన కభిమాన కవి యగుటచే నాయన యతని పద్యములు కొన్ని సేకరించి, వాని నాంగ్ల పరివర్తనములతో ముద్రింపించెను. చిన్నయసూరియు, బ్రౌనుదొరయుఁ గావించిన కృషి యానాఁ డాంధ్రభాషాభివృద్ధి కెంతయో తోడ్పడె ననుటలో సందేహము లేదు.

చిన్నయసూరి రచించిన బాలవ్యాకరణమునకుఁ గ్రమముగా దేశమున నఖండమైన వ్యాప్తి చేకూరెను. దాని కాయన నిర్వహించుచుండిన యుద్యోగమును, దానిని రచించుటలో నాయన ప్రదర్శించిన యసమాన కౌశలమును హేతువు లని చెప్పవచ్చును. ఆయన ప్రమాణీకరించిన భాష ననుసరించి పలువురు పండితులు ప్రాచీనసంప్రదాయాను సారముగా రచనలు చేయ నారంభించిరి. అందలి వస్తువు ప్రాయికముగాఁ బౌరాణికమే. నన్నయ భాస్కర పోతనాదు లేనాఁడో రచించిన భారత భాగవత రామాయణములను, వారు విడిచిన యితర పురాణములను బండితులు మరలఁ జేపట్టిరి. వారు మూలము నాధారముగాఁ గొని స్వతంత్ర రచనలుగా వెలయించినవానినే వీరు యథాతథముగా ననువదింప నారంభించిరి. అట్టి వానిలో కీ. శే. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారు రచించిన శ్రీకృష్ణ భారతము, కీ. శే. వావిలికొలను సుబ్బారావు గారి ఆంధ్రవాల్మీకి రామాయణము, కీ. శే. జనమంచి శేషాద్రిశర్మగారి జనమంచి రామాయణ బ్రహ్మాండ పురాణములు పేర్కొనఁదగినవి. ఈ పురాణముల యాంధ్రీకరణముతోపాటు వేఱొకవైపున సంస్కృత నాటకముల యాంధ్రీకరణము కూడ సాగినది. పురాణము, ప్రబంధము, శతకము, నాటకము మున్నగు ప్రాచీన సాహిత్య ప్రక్రియ లన్నియు నీ కాలమునఁ బునరుద్ధరింపఁబడి, తండోపతండములుగా వెలసినవి.

అప్పటి భూస్వాములును, ధనస్వాములును, కవిపండితులను యథోచితముగాఁ బోషించి, వాఙ్మయాభివృద్ధికి దోహద మొనరించిరి.

ప్రాచీనమార్గము ననుసరించి కవిత చెప్పిన మహాకవులలో మొదటఁ బేర్కొనఁదగినవారాంధ్ర ప్రభుత్వాస్థాన కవులయిన శ్రీ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారు (1866 - 1961). వీరు శతాధిక గ్రంథకర్తలు. భారత భాగవత రామాయణముల నొక్క చేతిమీదుగాఁ నాంధ్రీకరింపఁ జాలుట యనన్య సాధ్యమైన వీరి యసమాన ప్రజ్ఞకుఁ దార్కాణము. వీరికి శ్రీనాథుఁ డభిమానకవి. శ్రీనాథునివలె వీరును కవిసార్వభౌమ బిరుదమును, కనకాభిషేక గౌరవమును, కవి గండపెండేరమును బడయఁజాలిరి. కృషికిఁ దగినంత జనాదరణయు వీరికి రాలేదనుట విచారహేతువైన విషయము. ఆంధ్రీకృత రామాయణములలో కీ. శే. వావిలికొలను సుబ్బారావుగారి ఆంధ్రవాల్మీకి రామాయణమున కధికమైన ప్రచార మున్నది. వారు వాల్మీకి రామాయణమును మథించి మంథర మను విపులవ్యాఖ్యానమును గూడఁ బ్రచురించిరి. శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు కూడ రామాయణము, బ్రహ్మాండ పురాణము, లలితోపాఖ్యానము, తాండవకృష్ణ భాగవతము మున్నగు బహుగ్రంథములు రచించిరి కాని వానికిసైత మాంధ్రదేశమున నంతగా నాదర ప్రచారములు కానరాకున్నవి.

ప్రాచీన మార్గము నవలంబించియుఁ దమ సహజ ప్రసన్నమయిన శైలిచేఁ గవిత్వమునకుఁ బ్రజాదరము సంపాదింపఁ జాలినవారు శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులు. (దివాకర్ల తిరుపతిశాస్త్రిగారు 1871 – 1919; చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు 1870 – 1950). వీరు రచించిన శతాధిక కృతులేకాక వీరు కావించిన శతావధానాష్టావధానములు, ఆశుకవితా ప్రదర్శనములు కూడ సామాన్యప్రజలలో నపారమైన కవితాభిరుచిని గలిగించినవి. ఆంధ్రకవితను రాజప్రాసాదముల నుండి ప్రజాగృహాంగణములకుఁ గొనితెచ్చినవారు శ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులు ఆనాఁడు

వీరి యవధాన పద్యములు, చాటువులు తెలుఁగువారి నోట నే చోటఁ గాంచినను వినవచ్చుచుండెడివి. వీరి పాండవ నాటకములు దేశమం దంతటను బ్రదర్శింపఁబడి, ప్రజాదరముపొందినవి. వీరి దేవీభాగవతము, శ్రవణానందము, బుద్ధచరిత్రము పండిత పామర జనరంజకములై మించినవి. వీరి గీరతము, నానారాజ సందర్శనము క్రొత్త పుంతలు త్రొక్కిన రసవద్రచనలు. తరువాతి కాలమున(1910 నుండి నేఁటి వఱకు) కవిత రచించిన వారందఱును వీరికిఁ బ్రత్యక్షముగనో, పరోక్షముగనో శిష్యులైనవారే. నేఁటి వఱకును "చెళ్ళపిళ్ళ వెంకన గురువంచుఁ జెప్పు కొనఁగా నది గొప్ప తెలుంగునాడునన్." "శ్రీ తిరుపతి వేంకటేశ్వరుల వాణి ప్రాచీన కవితకు భరతవాక్యము, నవీన కవితకు నాందీవాక్యము" అన్న సూక్తి సత్యసమ్మతమైనది.

ఈ యుగమున చెప్పుకోఁ దగిన పండితకవు లింకను బలువురు గలరు. కీ. శే. కొక్కొండ వేంకటరత్నం పంతులుగారును (బిల్వేశ్వ రీయము). వడ్డాది సుబ్బారాయుఁడుగారును (భక్త చింతామణి), దాసు శ్రీరామకవియు (దేవీభాగవతము), శ్రీ ముదిగొండ నాగవీరయ్యశాస్త్రి గారును (శివపురాణము), శ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రిగారును (గర్గ భాగవతము), కీ. శే. పిసుపాటి చిదంబరశాస్త్రిగారును (పద్మ పురాణము), కీ. శే. వేంకటరామకృష్ణ కవులును (కథాసరిత్సాగరము), శ్రీ అల్లంరాజు రంగశాయి, మేడేపల్లి వేంకటరమణాచార్యులు, వేదము వేంకటరాయశాస్త్రి, మల్లాది సూర్యనారాయణశాస్త్రి (ఆంధ్ర భవిష్య పురాణము), ప్రభృతులును వారిలో ముఖ్యులు. కీ. శే. కందుకూరి వీరేశ లింగం పంతులుగారు కూడఁ దొలుతఁ బ్రాచీన పద్ధతిని గవిత్వము చెప్పిన వారే యయ్యుఁ దరువాతఁ దమ దృక్పథము మార్చుకొని పద్యములను గాక, గద్యకావ్యములనే యధికముగా వ్రాసి గద్య తిక్కన యను సార్థక మైన బిరుదము వహించిరి.

ఆధునికాంధ్రవాఙ్మయమున శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులు గారికిఁ బ్రత్యేకస్థాన మున్నది. (1848 - 1919). నవయుగ భానుఁడని యాయన గన్న ప్రఖ్యాతి సార్థకమైనది. వారు సంస్కృతాంధ్రాంగ్లభాష లతో మంచి పరిచయము గలవారు. ప్రౌఢకావ్యములు వ్రాయఁగల దక్షులు. అయినను బ్రజాసామాన్యము నందుఁ బ్రచారము సాగించుటకుఁ బ్రౌఢమైన కవిత్వముకంటె సరళమైన గద్యమే శక్తిమంతమగు సాధన మగునని తలంచి వారు గద్యమును జేపట్టిరి. తొలుత వారు చిన్నయసూరి నీతిచంద్రికనే యొరవడిగాఁ గైకొని, ప్రౌఢమైన శైలి నవలంబించినను గ్రమక్రమముగా సరళము, సుబోధమునైన శైలి నాదరించి యనేక గ్రంథములు రచించిరి. తిరుపతి వేంకటేశ్వర కవులు పద్యమున సాధించిన సారళ్యము నాయన గద్యమున కలవఱిచి రని చెప్పవచ్చును. నవల, కథ, ప్రహసనము, నాటకము, విమర్శ, స్వీయచరిత్రము మున్నగు పెక్కు సాహిత్య ప్రక్రియల నాంధ్రమున మొదటఁ బ్రవేశపెట్టినవారు పంతులుగారే. వారు సంస్కరణవాదులు. మత సాంఘిక సారస్వతాది సర్వరంగములందును సంస్కరణ మావశ్యక మని తలంచి వారు ప్రజలలోఁ బాదుకొనిపోయిన పెక్కు మూఢ విశ్వాసములను నిర్మూలింప సారస్వత మును సాధనముగా నుపయోగింప నుద్యమించిరి. విజ్ఞానము, వికాసము, స్వాతంత్ర్యము, సర్వమానవులకును సహజస్వత్వము లని యాయన యాశయము. సంప్రదాయము విడువని నవ్యత సాహిత్యమునం దాయన లక్ష్యము. ఆయన శాకుంత లానువాదము, రాజశేఖర చరిత్ర యను నవల. ఆంధ్రకవుల చరిత్ర, స్వీయ చరిత్ర, ప్రహసనములు, వ్యాసములు ఆ రోజులలోఁ దెలుఁగునకుఁ గలిగించిన యభ్యుదయ మింతింతనరానిది.

శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవుల వలెనే ప్రబంధాధునిక యుగ ములకు నడుమ నిలిచి సంప్రదాయమును విడువకయే నూతన కవిత్వము చెప్పినవారు శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు. వారి యేకాంత సేవ

నవకవితా యుగమునకు వైతాళికీయము నాలపించినదని చెప్పవచ్చును. వీరి రచనలలో భక్తిభావ మెక్కువగా స్ఫురించును. అదియే తరువాత నొక విధముగా మర్మకవిత్వమునకు దారిచూపినది.

సంప్రదాయానురక్తులైన కవిపండితు లీ విధముగాఁ బ్రాచీన కవులనే మేలుబంతిగా గ్రహించి రచనలు సాగించుచుండ నాంగ్లవిద్యాభ్యాసము కావించి, యాంగ్ల మహాకవులైన కీట్సు, షెల్లీ, వర్డ్సువర్తు మున్నగువారి రచనలచేఁ బ్రభావితులైన యువకులు వారి యడుగుజాడల ననుసరించి నూత్నకవితా మార్గముల నవలంబింపఁ దొడంగిరి. శ్రీ వీరేశలింగంపంతులుగారు రచించిన సరస్వతీ నారద సంభాషణమను ఖండకావ్యమును బరికించినచో నంతకుఁ బూర్వముండిన కవిత్వముయొక్క యథార్థ స్వరూపము గోచరించును. దానినిబట్టి సాహిత్యమున నూత్నకవితా మార్గము నన్వేషింపవలసిన యావశ్యకమును వీరేశలింగము పంతులుగా రెంత గాఢముగా గుర్తించిరో తెలియవచ్చును. కాని వారిదృష్టి పద్యమునుండి గద్యమునకు మరలుటచే నా కార్యము నాయనకాక యితరులు కావించుట సంభవించినది.

ఈ కాలమున నాంధ్రదేశమున రాజకీయ సాంఘిక సారస్వత రంగములందు వివిధములైన యుద్యమములు బయలుదేఱి, వివిధములైన కవితా ప్రక్రియలకు దారి చూపినవి. వానిలో నాంగ్లభాషాభ్యాసమునకు ఫలితముగా నేర్పడిన కాల్పనికోద్యమమును ముందు పేర్కొనవలయును. దీనినే భావకవితోద్యమ మనియుఁ జెప్పుచుందురు. దీని ప్రభావమున సృజింపఁబడిన కవిత్వమును లఘుకావ్యములు, ఖండకావ్యములు, ఆత్మాశ్రయ కవిత్వము, ప్రకృతి కవిత్వము, మర్మకవిత్వము అని యైదు విధములుగా వింగడింపవచ్చును. లఘుకావ్యములు కథావలంబనము కలవయ్యును అనవసర వర్ణనములకుఁ దావీయక నూతన ప్రణయ సిద్ధాంతమునకుఁ బ్రాధాన్య మొసంగుచు వ్రాయఁబడిన చిన్న కావ్యములు. ఇవి పరిమాణమునఁ బ్రబంధము లంత పెద్దవి కాకపోయినను

సమగ్రరూపములైనట్టివే. ఖండకావ్యములు వస్త్వైక దేశవర్ణనముతోఁ గూడి పరిమిత స్వరూపములైన కావ్యభాగములు. ఇందు సమగ్రమైన కథ కానఁబడదు. ఏదో యొక సన్నివేశమునో, ఘట్టమునో గ్రహించి కవి యా విషయమునఁ దనకుఁగల భావములను వెల్లడించును. దేశమున బయలుదేఱిన వివిధ పత్రికలలోఁ దమ పద్యములను బ్రచురింపవలె నను కవుల యుత్సాహమునకు ఫలితముగా వెలువడినట్టి వివి. ఆంగ్లమునఁగూడ నిట్టి ఖండకావ్యములు పెక్కుఁ గలవు. ఆత్మభావములను, మనస్తత్త్వమును వివరించు కవిత ఆత్మాశ్రియ కవిత్వము. ప్రకృతి సౌందర్యమును, జానపదజీవితమును వర్ణించు కవిత ప్రకృతి కవిత్వము. మర్మకవిత్వముఁ గొంత గూఢత్వము, తత్త్వజిజ్ఞాస గోచరించును. భావకవితా లత యీ యైదు విధములైన శాఖలతో వర్ధిల్లి యీ కాలమున దేశము నల్గడల వ్యాప్తిఁగాంచినది.

క్రీ. శ. 1910 ప్రాంతమున క్రొత్త ప్రాతల మేలుకలయిక క్రొమ్మెఱుంగులు చిమ్మ కీ. శే. గురుజాడ అప్పారావుగారు క్రొత్త ఛందస్సులో, క్రొత్త భాషలో, క్రొత్త పద్ధతిలో సరళము, మధురము, చైతన్యవంతము నగు విశుద్ధకంఠముతో భావకవితకుఁ బ్రస్థాన భేరి మ్రోయించిరి. అదే సమయమున శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు లలిత యను లఘుకావ్యమును రచించిరి. తరువాత తృణకంకణము ప్రకటింపఁబడినది. దాని పీఠికలో ఆయనయే యది వస్తువిస్తృతి లేని భావప్రధానమయిన కావ్య మని సూచించిరి. శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు దానికి భావకవిత్వ మని నామకరణము గావించిరి. 1914 వ సంవత్సరము ప్రాంతమున శ్రీ అబ్బూరి రామకృష్ణారావుగారు కలకత్తా నుండి వంగసాహిత్య సౌరభములు సంతరించుకొనివచ్చి కొన్ని ఖండకావ్యములు ప్రచురించిరి. శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు శాంతినికేతనమున కేగి రవీంద్రునికడ నాంగ్ల, వంగ సాహిత్యము లభ్యసించి క్రొత్త రచనలు ప్రారంభించిరి. వీరి రచనయందు శబ్ద

మాధుర్యము, అర్థ ప్రసన్నత, సంప్రదాయ పక్షపాతము గోచరించును. దేశభక్తి, ఆత్మ సౌందర్యము, ఆధ్యాత్మిక ప్రేమ యీయన కభిమాన విషయములు. శ్రీ దువ్వూరి రామిరెడ్డిగారు కూడ వీరివలెనే కొన్ని లఘుకావ్యములు వ్రాసి ప్రకటించిరి.

క్రీ. శ. 1917 లో శ్రీ శివశంకరశాస్త్రిగారు, చింతా దీక్షితులు గారు మున్నగు నవ్యసాహిత్యోపాసకులు సాహితీ సమితిని స్థాపించిరి. శ్రీ శివశంకరశాస్త్రిగారు రసికులైన పండితులు; సంస్కృత ప్రాకృతాది బహుభాషాకోవిదులు. ప్రాచీనత విడువక నవీనత నాహ్వానించిన సమన్వయ శీలురు. వీరి హృదయేశ్వరి లోపల నవ్యత, వెలుపల ప్రాచీనత గల చక్కని కావ్యసంపుటి. స్త్రీ సంసార తరణోపాయ మనియు, సర్వమును అంబా స్వరూప మనియు నీయన భావము. నవ్యకవులకుఁ బెక్కు విధముల నండదండయై, వారిని గావ్యరచనకుఁ బ్రోత్సహించిన మనీషి యీయన.

క్రీ. శ. 1922 లో నవ్యకవితా ప్రచారము కొఱకు సాహితి యను పత్రిక నెలకొల్పఁబడెను. అందును అప్పటి యితర పత్రికలందును బలువురు నవకవులు రచించిన ఖండకావ్యము లనేకములు ప్రచురింపఁ బడినవి. తరువాత భారతి మున్నగు పత్రికలలోఁ బ్రచురింపఁబడిన ఖండ కావ్యములు పెక్కు కాలక్రమమున ఖండకావ్య సంపుటములుగా ముద్రింపఁబడినవి. అట్టివానిలో శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారును, జాషువా గారును రచించిన ఖండకావ్యములు ప్రసిద్ధములైనవి. కీ. శే. బసవరాజు అప్పారావుగారు నవ్యకవులలో మొదటి పదకర్త. ప్రేమ, వేదన, నిరాశ యను భావము లీయన కావ్యములలో నిండారియుండును. "ప్రేమించు ప్రేమకై" యని యీయన యుపదేశము. ఈయన రచించిన గేయములు పెక్కు జనసామాన్యమున మిక్కిలి వ్యాప్తి చెందినవి.

శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారీ కాలముననే సాహితీసమితి సభ్యులై, సాహితిలోఁ బద్యములు ప్రకటింప నారంభించిరి. పద్యమునం దైనను, పాటయందైనను ఈయన మంచి నగిషీ పనివాఁడు. ఆత్మాశ్రియమైన భావకవిత్వమున కీయన రచన విశుద్ధమైన యుదాహరణ మనవచ్చును. ప్రేమసౌందర్యము లీయన రచనకు జీవాతువులు. అతిలోకమైన సౌందర్యము నాదర్శముగఁ గొని దానికొఱకై తహతహపడి తపించిన కవిశేఖరుఁ డీయన. ఈయన యేడుపును గూడఁ గళగా దిద్ది, తననాఁటి యువక కవులకు గురుస్థానమై విలసిల్లినాఁడు. ప్రథమ ప్రపంచ సంగ్రామము వలనఁ గలిగిన విధ్వంసము ప్రపంచమం దొక విషాద వాతావరణము సృష్టించినది. యాంత్రిక నాగరికతా వ్యామోహితులకు యంత్రముల రాక్షస స్వరూపము గోచరించినది. లోకమంతయు శోక నిరాశా వ్యాప్తమైపోయినది. ఈ నిరాశ కవుల వాక్కులందుఁ గూడఁ బ్రతిధ్వనించినది లోకమున లభింపని యేవో సుఖానందములు కవుల యన్వేషణమునకు విషయములైనవి. వారు వాస్తవ జగత్తును వీడి, కల్పనా జగత్తున జీవింపసాగిరి. కృష్ణశాస్త్రి గారి కృష్ణపక్షము నిరాశకును, ప్రవాసము – ఊర్వశి కల్పనాజగత్తునకును బ్రతిబింబములు. శోకమునందే యానందము నర్థించి సిద్ధి పొందిన కవితా తపస్వి శ్రీ కృష్ణశాస్త్రి పలుకులలో, భావనలో, సర్వములో నాయన కవి యనిపించుకొన్నాఁడు. సాంఘిక సాహిత్య శృంఖలలను ఛేదించి, వ్యక్తికి సుఖశాంతులు ప్రసాదింపలేని సంఘముపై తిరుగుబాటు చేసినాఁ డాయన. నిరాశా నిస్పృహలకుఁ దావలమైన సంఘమును దిరస్కరించి తన సుఖ దుఃఖములనే కావ్య వస్తువులు కావించుకొని యాయన. “నేను శోకభీకర తిమిర లోకైకపతి” నని యొకమాఱు, “నాలోన నేఁడు బృందావనము విరిసిన”దని యొకమాఱు ముక్తకంఠముతో గానము చేసినాఁడు. శ్రీ వేదుల సత్యనారాయణ శాస్త్రిగారీ కాలముననే సాహితీసమితి యందుఁ బ్రవేశించినారు.

ఆయన కాళిదాసాదుల వాఙ్మాధుర్యమును నిండుగా సంతరించుకొన్న పండితుఁడు. కృష్ణశాస్త్రిగారి యాత్మాశ్రియ కవిత్వ మీయన నధిక ముగా నాకర్షించినది. ఈయన వృత్తములపై నమితమైన ప్రాభవము గలవాఁడు. ఎట్టి క్లిష్టభావమునైన మిక్కిలి ప్రసన్నముగా వ్యక్తము చేయఁగల దట్ట. భగవంతుని గుఱించియు, స్త్రీని గుఱించియు నీయన పొందిన వేదన దీపావళిలోఁ గాననగును. శ్రీ నాయని సుబ్బారావుగారి సౌభద్రుని ప్రణయయాత్ర కూడ నీ తెగకుఁ జెందినచే.

1926 లో విశాఖపట్టణమున కవితాసమితి ప్రారంభింపఁబడినది. శ్రీ పురిపండా అప్పలస్వామి, పూడిపెద్ది వేంకటరమణయ్య, తురగా వేంకట రామయ్య, శ్రీరంగం శ్రీనివాసరావు మున్నగువా రీ సమితి సభ్యులు. వీరందఱును శ్రీ కృష్ణశాస్త్రిగారి ప్రభావమున కెక్కువగా లోఁబడినవారే. శ్రీనివాసరావు పటుత్వముగల కవి. క్రమముగాఁ దా నొక నూత్నదృష్టి నలవరించుకొని యాయన నవప్రపంచ నిర్మాణము నకై యుఱుకులు పెట్టినాఁడు. ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతర యువ కవుల కీయన గురుస్థానము.

క్రీ. శ. 1915 లో శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు, కాటూరి వేంకటేశ్వరరావుగారు కలసి జంటకవిత చెప్పనారంభించిరి. తమ గురువు లగు శ్రీ తిరుపతి వేంకటేశ్వరుల యవధాన పద్యములచేఁ బ్రేరితులై వీరు ప్రకృతిలోఁ దమ్మాకర్షించిన ప్రశస్యాంశమును ఖండకావ్యములలోఁ జిత్రించిరి. ప్రకృతి కవితకు వీరే ప్రత్యములని చెప్పవచ్చును. "కపురంపుం బలుకుల్ తుషార జలముల్, కల్వల్, పికధ్వాన, మచ్చపు బంగారము, పూవుఁ దేనియలు" మున్నగు వీరి కవితా సామగ్రి యానాఁటికి సరి క్రొత్తది. గురువుల సరళప్రసన్న శైలిని బుడికి పుచ్చుకొని, వారి భావములకు లోతు, భాషకు సంతిపత్త, యలవఱిచి వీరు చక్కని ఖండకావ్యములు రచించిరి. వీరి తొలకరి నాఁడు సాహిత్య ప్రియుల హృదయ కేదారము లందుఁ గ్రొత్త యానందములు కదళింపఁజేసినది.

వీరి మార్గము నందుకొని శ్రీ దువ్వూరి రామిరెడ్డిగారు కర్షక జీవితమును జిత్రించుచుఁ జక్కని కావ్యములు రచించినారు. రమ్యమైన శబ్దము, శుద్ధమైన భావము, స్పష్టమైన యర్థవ్యక్తి వీరి రచన యందలి లక్షణములు. వీరి కృషీవలుఁడు దేశమున మంచి ప్రతిష్ఠ నార్జించినది. దానికిని పాశ్చాత్యుల (Pastoral Poetry) కిని చాల సాదృశ్యమున్నది.

ఇదే సమయమున శ్రీ కవికొండల వేంకటరావుగారు, శ్రీ అడవి బాపిరాజుగారు జానపద గీతములు వ్రాయనారంభించిరి. కర్షక కార్మిక జీవితమును గావ్యవస్తువులుగా స్వీకరించిన శ్రీ వేంకటరావుగారు వారి వేడుకలు, వినోదములు, కష్టములు, సుఖములు చిత్రించుచుఁ జక్కని ఖండ కావ్యములు రచించిరి. వీరి ఛందస్సులం దపారమైన వైవిధ్యము, స్వేచ్ఛ గోచరించును. "జానపద గీతములకంటె స్వైరమగుచు" నని యాయన తన గీతము లందలి యనియత గతిని వర్ణించుకొన్నాఁడు. ప్రపంచమున నీయన దృష్టి నాకర్షింపని వస్తువులేదు. శివరాత్రి ప్రతిభను గడ్డిపరక నాట్యమును నొకే విధమగు నుదాత్త దృష్టితో దర్శింపఁగల భావుకుఁ డీయన. ప్రాఁతవృత్తములలోఁ గ్రొత్త విఱుపులు, క్రొత్త ఛందములలో వింత నడకలు ప్రదర్శించు నేర్పరి. శ్రీ బాపిరాజుగారు కవి, గాయకుఁడు, చిత్రకారుఁడు. మూఁడు కళలను ముద్దచేసి యీయన యద్భుతములైన గేయములు రచించినాఁడు. గానములో స్థాయిని చేరేచి, కవితలో భావమును బోషించి, చిత్రములో రూపమును నిరూపించి సంపూర్ణమైన కళాస్వరూపమును దయారు చేసినాఁ డాయన. వాక్కున కందని రూపమును జిత్రములోఁ, జిత్రమున కందని భావమును వాక్కులోఁ బట్టి యీయఁగల నేర్పాయనకు సహజసిద్ధము. ఈయన "వఱద-గోదావరి" యద్భుతమైన ఖండకావ్యము. పై యిరువురు కవులందును కూడ్లేరి దొరగారి ప్రభావ మెక్కువగాఁ గానఁబడును.

పాశ్చాత్యుల మిస్టిక్ పోయిట్రీ ననుకరించి యువక కవులు కొందఱు తెలుఁగునఁ గూడ మర్మకవిత్వమును సాగించిరి. ఇందు

గూఢత తత్త్వజిజ్ఞాస గోచరించును. శ్రీ దువ్వూరి రామిరెడ్డిగారిట్టి కవిత్వ మునకు మార్గదర్శకులు. శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావుగారు, కొంపెల్లి జనార్దనరావుగారు కొంత మర్మ కవిత్వమును వెలయించిరి. శ్రీ విశ్వేశ్వర రావుగారి కవితపై రవీంద్రుని ప్రభావము పుష్కలముగా గోచరించును.

కీ. శే. కందుకూరి వీరేశలింగము పంతులుగారు మానవతా వాదులు. వారు తమ కాలమును, గవితను, రచనలను మానవోద్ధరణము కొఱకే వినియోగించిరి. వీరి భావములపై రాజా రామమోహనరాయల సిద్ధాంతముల ప్రభావము మెండుగాఁ గలదు. స్త్రీ జనోద్ధరణమునకును సంఘ సంస్కరణమునకును వారు కావించిన కృషి యపారమైనది. శ్రీ గురుజాడ అప్పారావుగారి కన్యాశుల్కమునందే కాక "పుత్తడి బొమ్మా పూర్ణమ్మా" మున్నగు ఖండకావ్యములలోఁ గూడ సంస్కరణాభి లాష గోచరించును. జాతీయోద్యమము బలపడిన పిమ్మట నహింసా సత్య వాదియైన గాంధిజీ సిద్ధాంతములు దేశమున విశేష ప్రచారను పొందినవి. ఆయన సిద్ధాంతములకును గౌతమ బుద్ధుని సిద్ధాంతములకును గల సాదృశ్యము ప్రజలయొక్కయుఁ, గవులయొక్కయు దృష్టిని బుద్ధుని మీఁదికిఁ బ్రసరింపఁ జేసినది. కవులు కొందఱు గౌతమ బుద్ధుని జీవి తమును, గాంధీజీ జీవితమును, హరిజనోద్ధరణమును వస్తువులుగా గ్రహించి కావ్యములను ఖండకావ్యములను రచించిరి. గౌతమ బుద్ధుని జీవితమును వస్తువుగా గ్రహించి వ్రాయఁబడిన ప్రశస్త కావ్యములలో శ్రీ పింగళి కాటూరి కవులు రచించిన సౌందరనందము తలమానికమని చెప్పఁదగినది. గంభీరములైన భావములందును, ప్రసన్నమైన శైలియందును, ఉపదేశ సామర్థ్యమునందును దీనితో సాటిచెప్పఁదగిన కావ్యము లెన్నో లేవు. ఈ కావ్యము పలువురు యువకవుల హృదయముల నాకర్షించి వారిని గావ్య రచనోన్ముఖులఁ గావించినది. అట్టివారిలో శ్రీ కొడవంటి బ్రహ్మాజీరావు గారు, ముదివర్తి కొండమాచార్యులుగారు ముఖ్యులు. శ్రీ జంధ్యాల

పాపయ్యశాస్త్రిగారి కరుణశ్రీ బుద్ధుని జీవితమును వర్ణించు కావ్యమే. శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు గాంధీజీ జీవితమును బద్యకావ్యముగా సంతరించిరి. శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారి జాతకకథాగుచ్ఛము కూడ నీ తెగకుఁ జెందిన కావ్యమే. ఈ కాలమున హరిజనోద్ధరణము వస్తువుఁగా వ్రాయఁబడిన ఖండకావ్యము లనేకము లున్నవి. వానిలో శ్రీ జాషువాగారి రచనలు పేర్కొనఁ దగినవి.

ఈ కాలమునఁ బ్రచారముగాంచిన యుద్యమములలో శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారి వ్యావహారిక భాషోద్యమ మొకటి. శ్రీ పంతులుగారి పాండిత్య మపారమైనది. వారు తెలుఁగునఁ బ్రసిద్ధములైన కావ్యము లన్నియుఁ బఠించి ప్రతిక్షణపరివర్తమాన మగుచున్న జీవద్భాషలో గ్రాంథికమే వ్రాయుదునని కంకణము కట్టుకొని కూర్చుండుట వ్యర్థప్రయత్న మనియు, నిత్య వ్యవహారమున నుండు ప్రయోగములు జ్ఞాతముగనో యజ్ఞాతముగనో కవుల రచనలందుఁ జొరక మానవనియు, నందుచే శిష్ట వ్యవహార సిద్ధమైన భాషనే వాడుట యుక్తమనియు, వాదించి పలువురిచేఁ దమ వాదము నంగీకరింపఁ జేసిరి. ఆ యుద్యమమునకు ఫలితముగాఁ బలువురు యువకులు వ్యవహార భాషలో రచనలు సాగింప మొదలిడిరి. కవితలోఁ గూడ నిట్టి భాషను వాడిన వారిలో శ్రీ గురుజాడ అప్పారావు పంతులుగారు మొదటివారు వారి రచన లన్నియు శిష్ట వ్యవహారమున వ్రాయఁబడినవే. తరువాత గేయములు వ్రాసిన వారిలోఁ బలువురు వ్యావహారిక భాషనే గ్రహించిరి. కీ. శే. నండూరి వెంకట సుబ్బారావుగారి యెంకి పాటలు గిడుగు వారి వాదమున కింతింత రాని బలము చేకూర్చినవి. ఆ కాలమున నీ పాట లాంధ్రకవితాప్రపంచమునఁ బెద్ద దుమారము రేపినవి. జానపద జీవితమును, జానపద భాషలో, జానపదచ్ఛందస్సులలోఁ జిత్రించి శ్రీ సుబ్బారావుగారు గొప్ప సాహిత్య విప్లవమునకు నాయకులైరి. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

గారి కిన్నెరసాని పాటలు కూడ వ్యావహారిక భాషలో వ్రాయఁబడి నట్టివే. శ్రీ గిడుగు సీతాపతిగారు భారతీశతకమును వ్యావహారిక భాషలో రచించి యీ భాష పదములకు గేయములకు మాత్రమే కాక పద్యములకుఁ గూడఁ దగియుండునని నిరూపించిరి. ఈ వాదము బయలుదేఱిన తరువాత వెలువడిన కథలు, నవలలు, నాటికలు, వ్యాసములు పెక్కు వ్యావహారిక భాషా రచితములే యగుట యీ వాదమునకుఁ గలిగిన యాదరమునకుఁ దార్కాణము.

క్రీ. శ. 1857 వ సంవత్సరమున ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామము జరిగినప్పటి నుండియు దేశమునఁ బరపరిపాలము నెడ వైముఖ్యము జనించినది. ప్రజలలో స్వాతంత్ర్య వాంఛ పెరిగినది. తిలక్ మున్నగు జాతీయ నాయకులచే నారంభింపఁబడిన జాతీయోద్యమము దానికి దోహద మొసంగినది. కవులు పరప్రభుత్వమును నిరసించుచు స్వాతంత్ర్యవాంఛను రగుల్కొల్పు రచనలు కావింప మొదలిడిరి. శ్రీ గరిమెళ్ళ సత్యనారాయణగారి "మా కొద్దీ తెల్లదొరతనము", "దండాలండోయ్ బాబు దండాలండోయ్" మున్నగు గేయము లీ కాలమున రచింపఁబడినవే. శ్రీ గురుజాడ అప్పారావుగారు, రాయప్రోలు సుబ్బారావుగారు రచించిన పెక్కు రచనలు దేశభక్తిని రగుల్కొల్పి ప్రజలందు స్వాతంత్ర్యాభిమానమును జెలరేచినవని. అందుచే భారతదేశ స్వాతంత్ర్య సంపాదమునకు నాయకులొనరించిన కృషితోపాటు కవుల రచనములును గొంతవఱకుఁ దోడ్పడినవి చెప్పవచ్చును. శ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంతకవిగారి స్వరాజ్య రథము మున్నగు రచన లీ సందర్భమునఁ బేర్కొనఁ దగినవి.

ఒకవంక దేశ ప్రజలలో స్వాతంత్ర్యవాంఛ చెలరేఁగు చుండ నాంధ్రులలోఁ బ్రత్యేక రాష్ట్రవాంఛ ప్రబలఁ జొచ్చినది. శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారి "అమరావతీ విశ్వవిద్యాలయమున" మున్నగు పద్యములు, విశ్వనాథవారి ఆంధ్ర పౌరుషము, ఆంధ్ర ప్రశస్తి మున్నగు రచనలు, శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారి రాష్ట్రగానము,

కీ. శే. కొడాలి సుబ్బారావుగారి హంపీ క్షేత్రము ఆంధ్రాభిమానము పెంపొందుట కనేక విధములఁ దోడ్పడిన దనుటలో నతిశయోక్తి లేదు. ఈ సందర్భమున తెలంగాణా విముక్తికై దాశరథి మున్నగు కవులు రచించిన ఖండకావ్యములు పేర్కొనఁ దగినవి.

ఈ విధముగా జాతీయ రాష్ట్రోద్యమములు రెండును సాగు చుండఁగాఁ గొందఱు కవులు జాతీయ మహాపురుషుల చరిత్రలను వస్తువులుగా గ్రహించి యుద్గ్రంథములను రచించిరి. అట్టి వానిలో శ్రీ దుర్భాక రాజశేఖర శతావధానిగారి రాణాప్రతాపసింహ చరిత్రను, శ్రీ గడియారం వేంకట శేషశాస్త్రిగారి శివభారతమును ముందు పేర్కొన వలయును. ఈ రెండు రెండే జాతీయ భావములతోఁ దొణికిసలాడుచు రస భావాలంకార పోషణమందును భాషా ప్రయోగమందును బూర్వ కావ్యముల కెందును దీసిపోని యుదాత్త రచనలు. వీనికి గుణమునకుఁ దగిన యాదరము దేశమున లభించుట ముదావహమైన విషయము. శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారి విజయశ్రీకూడ భారత కథావస్తుకము వలెనే కానిపించినను దత్కాల భారత దేశ పరిస్థితులను వ్యంగ్యముగాఁ జిత్రించుచు జాతీయ భావోజ్జృంభణమున కెన్నియో విధములఁ బెంపు చేకూర్చినది. ఇటీవల శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు రచించిన యాంధ్ర పురాణముకూడ భాషాభావములలో నెంతయుఁ బ్రశస్తి వహించి పూర్వాంధ్ర వైభవ విశేషములను రసవన్మార్గమునఁ బ్రచారము కావించి యున్నది.

ఆధునిక కవితా ప్రపంచమునకు మూల పురుషులైన కొందఱు కవులను గుఱించియు, వారికి దోహదము చేకూర్చిన యుద్యమములను గూర్చియు దిఙ్మాత్రముగఁ బరిశీలించితిమి. ఆంధ్రవాఙ్మయముననతిప్రాచీన కాలము నుండియు భావ కవిత్వము యొక్క ఛాయలు కలవు. పూర్వ కవుల చాటువులను శతకములను ఇంచుమించుగా భావ కవిత్వ మన వచ్చును. శ్రీ తిరుపతి వేంకట కవుల యవధాన పద్యములు పెక్కు

భావకావ్యములే. కాని వీనిలో లోతు తక్కువ. "ఎదలోపలి యెదలో నెమ్మదిలో జీవిత రహస్యమార్గమ్ములలో" నుండి పుట్టినది భావకవిత. దీని నొక ప్రత్యేక మార్గముగా ననుష్ఠించినవారు నవ్యకవులే. కనుకం దెనుఁగు సారస్వతమునకు సంబంధించినంతవఱకు భావకవిత యొక నూతన ప్రక్రియ యనియు నీ యుగము యొక్క విలక్షణత యనియు నంగీకరింపక తప్పదు.

ఆంగ్ల సాహిత్యమునం దీ కవిత షేక్స్పియరు నాఁటి నుండియు విశేష ప్రచారమునందున్నది. దీనికి లక్షణ నిర్దేశము కూడ జరిగినది. పాశ్చాత్యులు దీనిని లిరిక్ అనిరి. లైర్ అనునది యొక పాశ్చాత్య జంత్ర విశేషము. దానిపై గానము చేయుట కనువుగా వ్రాయఁబడినవి లిరిక్కులు. అవి ప్రాయికముగా గాన యోగ్యములు. ఈ తలంపు తోడనే శ్రీ దువ్వూరి రామిరెడ్డిగారు ఆంధ్రభాష యందలి యీ జాతి కవితను గీతకవిత యనిరి. కాని పాశ్చాత్యుల లిరిక్కుల తత్త్వమును బరిశీలించినప్పుడు గీతకవిత్వమను పదముకంటె భావకవిత్వమను పదమే లిరిక్కునకు సమర్థమైన సమానార్థకముగ గోచరించుచున్నది. ఇందు భావములో, భావనలో, భాషలో, పరిభాషలో నొక విలక్షణత గోచరించుచున్నది. భావకవితా ప్రపంచమునం దేజోమూర్తులుగా గోచరించువారి కావ్యములే మన కుపాదేయములు.

భావకవులు స్వేచ్ఛాప్రియులు. క్రీ. శ. 18, 19 శతాబ్దు లందలి కొందఱు కవులు నియమదాస్యముపైఁ దిరుగుబాటుగా రచించిన భావ కవిత యందుండు నియమోల్లంఘనమును మనము నవ చైతన్యోదయ ముగా స్వీకరింపవలెనేకాని నియమ పరిజ్ఞాన శూన్యతగా నిరసింపరాదు. ఛందస్సు లక్షణానుగుణముగా నుండవలె ననుటకంటె భావాను గుణముగా నుండవలె ననుట భావకవులకు సమ్మతము. నిర్దోషత్వము కంటె సజీవత్వము వీరికిఁ బ్రియతరము.

పరంపరాగతములైన ప్రాఁత యుపమానములనే యుప యోగించుట యలసత్వమును సూచించును. ఉపమాన ధర్మములను గవి స్వయముగా ననుభవించి ప్రయోగించినప్పుడే యుపమానములు సజీవములగును. సజీవత కొఱకై భావకవులు కొన్ని యెడల సంప్రదాయ విరుద్ధములైన యుపమానములను గ్రహించుట కలదు. "ఆమె కన్నులలో ననంతాంబరంపు నీలినీడలు కలవు", "వెండిలాంతరు వెలిగించి వెడలె రజని", "ఆకాశపు టెడారిలో కాళ్ళు తెగిన ఒంటరి ఒంటె లాగుంది జాబిల్లి" ఇత్యాదులు సరిక్రొత్తవైన సజీవోపమలు.

లోకమున మానవులే భాషలోఁ బరస్పరము కష్ట సుఖములు చెప్పుకొందురో యా భాషకు సాధ్యమైనంత సన్నిహితమగు భాషలోఁ గావ్యము రచింపవలెననుట నవ్యుల సిద్ధాంతము. భావకావ్య మనఁగాఁ గవికిని సహృదయునికిని నడుమ నడచిన యొక యుదాత్తమైన సంభాషణ. వ్యర్థ పదములు, అప్రసిద్ధ పదములు, ప్రాఁత మాటలు కావ్యసౌందర్య మును భంజించును. సజీవమగు శబ్దమే కవి భావమును వ్యక్తము చేయఁగలదు. కావ్యవస్తువు విషయమందును నవ్యులు నియమము నంగీ కరింపరు. కవి నుత్తేజపఱచి భావావిష్టునిఁ గావించు ప్రత్యంశమును గావ్యమునకు వస్తువు కాఁదగినదేయని భావకవులు భావించిరి. కవిత్వము యొక్క యుదాత్తత వస్తువునందుఁ గాక కవియందే యుండును.

కవిత్వమున సహృదయుఁ డపేక్షించు మాధుర్యమునకు శబ్దార్థ ములు రెండును సమాన పోషకములు. కనుక సుకుమారములైన భావములను సుకుమారములైన పదములలో శ్రుతి మధురములగు ఛందస్సులలోఁ బొదుగవలెనని నవ్యులలోఁ బలువురి యాశయము. రాయప్రోలు, కృష్ణశాస్త్రి, వేదుల, పింగళి, కాటూరి కవులు ఈ తెగ వారిలో ముఖ్యులు. పదబంధచ్ఛందో మార్గములు రసానుగుణముగ నుండవలెనను వారిలో శ్రీ విశ్వనాథ, శ్రీశ్రీ మున్నగువారు ముఖ్యులు.

మహాకావ్యములందు వస్తువిస్తృతి వలన బంధశైథిల్యము క్షంతవ్యమగును. భావకావ్యములు మిక్కిలి చిన్నవగుటచే వీని బంధమున శైథిల్యము లవమైనను సహ్యము కాఁజాలదు.

సాధనయందలి చైతన్యము సిద్ధియం దుండదు. భావకవితయందుఁ బ్రాయికముగాఁ బ్రేమసాధనయే కాని సిద్ధి గోచరింపదు. భావకవులారాధించు ప్రేమకాని సౌందర్యముకాని లౌకికము కాదు. అతీంద్రియములైన ప్రేమ సౌందర్యముల నందుకొనుటకు భావకవులు సాధన చేయుదురు. వీరు స్త్రీయందు మాతృత్వమును, సఖీత్వమును, దేవీత్వమును దర్శించుచున్నారు. ఆదర్శ మత్యున్నతమై సులభము కానందున భావకవి కరుణమునందే శృంగారము ననుభవించుచున్నాఁడు. అతఁడు నిరాశయందే యాశను, అతృప్తియందే తృప్తిని దర్శించుచున్నాఁడు. అయోగవియోగ శృంగారములే భావకవులకుఁ బ్రియతరములైనవి.

భావకావ్యములం దపారమైన విషయ వైవిధ్యమును విషయానుగుణమైన ఛందో వైవిధ్యమును గలవు. ఆధునిక జీవితమందలి బహుముఖత్వము క్లిష్టత దీనికిఁ గారణములు. అంతర్ముఖుఁడైన కవికిఁ దన జీవితమునఁ గావ్యత్వము నపేక్షించు నంశములు పెక్కు గోచరించుచున్నవి. నిత్యజీవితమునఁ గవి ఎన్నో సమస్య లెదుర్కొనుచున్నవి. కవి వీని యెడ నుదాసీనుఁడు కాఁజాలఁడు. నేఁడు రాజకీయ సాంఘిక సాంస్కృతి కార్థికరంగములందుఁ బెక్కు మార్పులు శీఘ్రగతిని జరిగి పోవుచున్నవి. వర్తమాన మంతయు క్షోభా ఘూర్ణితమై యున్నది. భవిష్యత్తెట్లుండునో తెలియదు ఖండ ఖండాంతరములకు, మతమతాంతరములకు, విజ్ఞాన విజ్ఞానాంతరములకు సన్నికర్షము సంభవించినది. ప్రత్యేక సంస్కృతులు రూపు మాసి పోవుచున్నవి. విశ్వైక సంస్కృతి మాత్రమింకను రూపొంది యుండలేదు. వ్యత్యస్త యతిప్రాసములతో, విషమ పాదములతో వ్రాయఁబడిన భావగీతములు బహిరంతరముల విజృంభించుచున్న విప్లవమును జాటుచున్నవి. కవులింతదనుక సాధించిన

మహోగ్రమున్నను లేకపోయినను బూర్వమెన్నఁడును లేని చైతన్యోత్సాహములు వీరి రచనలో నిండారియున్న వనుట నిర్వివాదము.

విశ్వమందలి యీ సంక్షోభము క్రొత్తసృష్టికై పుడమి తల్లి పడు ప్రసవ వేదన యని శ్రీ శ్రీ నుడువుచున్నాఁడు. అనేక శతాబ్దులై యీ జాతినుండి చైతన్యస్ఫూర్తి తొలఁగి పోయినది. నేఁటికి మరల నుజ్జీవితమైన చైతన్యప్రతిభ జీర్ణమైన దేహమును వదలి నూతన దేహమును గాంక్షించుచున్నది. భావనూతనము సంస్థాపితము కావించి యువకవులు భవిష్యత్తున కభిముఖముగా యాత్రసాగించినారు. ఈ కల్లోలమునందే నవకవులలో నవ కవియైన శ్రీ శ్రీ భవిష్యద్దర్శనము కావించి యానందోన్మత్తుఁడై

మరో ప్రపంచం మరో ప్రపంచం
మరో ప్రపంచం పిలిచింది
పదండి ముందుకు పదండి త్రోసుకు
పోదాం పోదాం పైపైకి

అని యువకులకు మార్గదర్శియై యెలుఁగెత్తి యఱచినాఁడు. ఉద్రిక్తులైన యువకులకు సన్నిహిత భవిష్యత్తులో

అగ్ని కిరీటపు నిగనిగలు
ఎఱ్ఱబావుటా ధగధగలు
హోమజ్వాలల భుగభుగలు

గోచరించినవి. కాని వీటికంటె విశాలము గంభీరము ప్రసన్నము నగు దృష్టితో సుదూర భవిష్యత్తును జూడఁగలిగిన పరిణతకవి దువ్వూరి రామిరెడ్డి

స్యందనాసీనయగు దేవి శాంతి శాంతి
యనుచు మంజులగానమ్ము

చేయుట నాలకించినాఁడు.

ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతరము వర్ధిల్లిన భావకవితనే అభ్యుదయ కవితయను పేర వ్యవహరించుట పరిపాటి యైనది. భావకవు లూహా ప్రపంచమున దర్శించిన శాంతి సుఖ సమత్వాదులను సంఘమునఁ బ్రత్యక్షము చేయుటకై కవితాసాధన కావలె నను వాదము బయలుదేఱినది. కవి యొక స్వతంత్ర వ్యక్తియనియు, నతఁడు తన యానందము కొఱకు గానము చేసికొనుననియు భావకవులు వాదించిరి. కవి సంఘమునం దొక వ్యక్తి మాత్రమే యనియు, నతఁడు సంఘమునకు దూరముగా బ్రతుకఁ జాలఁడనియు, నతఁడు తన కవితా శక్తిని సంఘాభ్యుదయమునకై వినియోగించి తీరవలెననియు నభ్యుదయ కవుల వాదము. ఇట్లు ప్రథమ సంగ్రామానంతరము విజృంభించిన వ్యక్తి వాదము ద్వితీయ సంగ్రామానంతరము సమాజవాదముగాఁ బరిణమించినది. కవితకుఁ గేవల మానందమొక్కటే ప్రయోజనము కాదనియు, నది సమాజాభ్యుదయమునకుఁ గూడఁ దోడ్పడ వలెననియు, నభిప్రాయము ప్రబలినది. సామ్రాజ్యవాదము ధనిక వాదము సమాజ క్షేమమునకు విరోధులు. కావున ద్వితీయ సంగ్రామానంతర కవులు సర్వతోముఖ సమానత్వము నర్థించి సామ్రాజ్య ధనిక వాదులకు వినాశగీతములు పాడఁ దొడఁగిరి. ప్రపంచమందలి కర్షక కార్మికుల కడగండ్లు, ధనికుల దౌష్ట్యములు, వీరి కవితా సామగ్రి యయ్యెను. తొలి భావకవుల ప్రేమకరుణ రసముల స్థానమున రౌద్ర బీభత్స భయానకములు నెలకొల్పఁబడినవి. కవిత కంకాళమయము, రక్తమాంస పూరితము, శ్మశాన సదృశము నైనది. ఊహాసౌందర్యమును ఊహా సమత్వమును జూచి తృప్తి నందుట భీరుత్వము. సమాజమునందు వానిని బ్రతిష్ఠించుట వీరత్వము. ఈ జాతి కవులకు నాయకుఁడు శ్రీరంగం శ్రీనివాసరావు. ఈయన ప్రతిభా వ్యుత్పత్తులు విశిష్టములైనవి. ఈయన కవిత నవ్యతామూర్తి. ఈయన మార్గమున నడచినవారు నారాయణబాబు, ఆరుద్ర, దాశరథి, కాళోజీ నారాయణరావు, పఠాభి మొదలైనవారు. ఈ కాలపుఁ గవుల యంతరంగములోఁ బ్రచండమైన సంక్షోభము

గోచరించును. తొలి భావకవులు సృజించిన సుందరరూపము లన్నియు విధ్వంసము చేయఁబడినవి. స్వేచ్ఛ స్వైరతగాఁ బరిణమించినది. సర్వత్ర విశృంఖలత్వము తాండవించినది. ద్వితీయ సంగ్రామానంతర కవి యొక యుద్ధ భటునివలె గోచరించును. సర్వమును విఱుగఁ ద్రొక్కుకొనుచు ముందుకు సాగిపోవుటయే యతని పని. కవితలో బహిరంత సౌందర్యములు మృగ్యము లైనవి. దానికొక స్థిరమైన మార్గములేదు, ఒక్కొక్క కవి కొక్కొక్క "ఇజమ్" బయలు దేఱినది. విధ్వంసాత్మకమైన డాడాయిజమ్, ఉన్మాదాత్మకమైన సర్రియలిజమ్ తలయెత్తినవి. కాని వీని కంతగాఁ బ్రజాదరము కలిగినట్లు తోఁపదు. ఈ పొంగు కొంత కొంత చల్లారుచున్న సూచనలు కనిపించుచున్నవి.

ఆధునిక కాలమున వివిధోద్యమములచేఁ బ్రేరితములై వివిధకవితా ప్రక్రియలు కొనసాగుచుండఁ బ్రాచీన సంప్రదాయమును బూర్తిగా విడువఁ జాలక నవీన భావపూరితులైన కవులు కొందఱు "నూతనముం బ్రాగ్గుణ సమ్మితమ్ము" నగు కవిత చెప్పఁ దొడంగిరి. భావములందుఁ గొంత నూతనత్వము కానిపించినను భాషాచ్ఛందో రీతులందు వీరిలో సంప్రదాయాభిమానము గోచరించుచునే యుండును. వీరికిఁ బ్రాచీన మహాకవుల యెడ గౌరవము; నవీన కవుల యెడ వాత్సల్యము. రాయప్రోలు, తుమ్మల, గడియారం శేషశాస్త్రి, రాజశేఖర శతావధాని, జంధ్యాల పాపయ్యశాస్త్రి, సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి, మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి, దాశరథి. నారాయణరెడ్డి మున్నగువారీ కోవకుఁ జెందినవారే. వీరిలోఁ గొందఱియందు నవీనతాభిమానమును గొందఱి యందుఁ బ్రాచీనాతాభిమానమును ములు చూపుచుండును. ఈ తెగకుఁ జెందిన కవులలో గౌరీశంకర శిఖరమువలె నిల్చి, ప్రతిభా పాండిత్యములకుఁ బట్టుఁగొమ్మలై, వివిధ ప్రక్రియలలో వివిధ కావ్యములు రచించి, పలువురాధునిక కవులకు గురుపీఠమై యొప్పువారు కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు, బసవరాజు

అప్పారావుగా రన్నట్టు లాయన పట్టినదెల్ల బంగారము చేయఁగలమహాకవి. ప్రేమ, దేశభక్తి, సనాతన ధర్మ పక్షపాతము ఈయన రచనలకు మూల కందములు. భాషలో, భావములో, ఛందస్సులో విపరీతమైన వైలక్షణ్యము సాధించిన ప్రతిభా సంపన్నుఁ డీయన. గాంభీర్యము, ఉదాత్తత, ఔచిత్యము ఏకత్రి పురంజీభవించిన మహనీయ మూర్తి యీయన కవిత. ఈయన నవలలు, నాటకములు, కథలు, విమర్శలు, గేయములు, ఖండకావ్యములు, మహాకావ్య ములు అతిసమర్థతతో నిర్వహింపఁ జాలిన ధీశాలి. శ్రీమద్రామాయణ కల్పవృక్షము వీరి కవితాభావము లన్నియు నక్షరాకృతి వహించిన యుత్తమ కావ్యము.

ఈ విధముగా నాధునిక కాలమునఁ బ్రతిభావంతులైన కవులు పలువురు నూతన ప్రక్రియలు చేపట్టి పలువిధములఁ బాటుపడి యుండిరి. వానిలోఁ గొన్ని స్వల్పకాలము మాత్రము నిల్చి సడలిపోయినవి. కొన్ని యిప్పటికిని గొన యూపిరితోఁ గొనసాగుచునే యున్నవి. నూతన మార్గము లెన్ని వచ్చినను బ్రాచీన విధానము నవలంబించువారు చెక్కు చెదరక పూర్వకవి క్షుణ్ణమైన ప్రశస్త మార్గము నవలంబించి బహు సంఖ్యాకములైన కావ్యములను సృజించుచునే యున్నారు. కాళిదాసు చెప్పినట్లు ప్రాఁతదైనంత మాత్రమునఁ బ్రతి కావ్యము సాధువు, కాఁజాలదు. నవీనమైనంత మాత్రమున నవద్యమని దేనిని నిరసింపరాదు బుద్ధిమంతులు బాగుగాఁ బరిశీలించి యుత్తమము, కల్యాణ కారణమునైన పద్ధతి నాదరింపవలయును. అదియే ప్రశస్తమై యుజ్జ్వలమైన భవిష్యత్తును నిర్మింపఁ జాలును.

---

# ఆంధ్రవాఙ్మయ చరిత్రము

## శతకములు

శతకము లన్ని వాఙ్మయములందు నున్నప్పటికిని ఆంధ్రమున వానికిఁ బ్రత్యేక స్థానమున్నది. వాని సంఖ్య యం దైదువందలకు మించి యుండునని పండిత వంగూరి సుబ్బారావుగారు తెల్పియున్నారు. ఇందుఁ గొన్ని యింకను అముద్రితములుగానే యుండిపోయినవి. పూర్వము కవులు ప్రౌఢములైన రచనలు చేయుటకు ముందు భగవదనుగ్రహ ప్రాప్తికొఱకును, గవితా సృజనాభ్యాసము కొఱకును శతకములు వ్రాయుచుండిరి. క్రీ. శ. 12 వ శతాబ్ది నుండి నేఁటి వఱకును ఆంధ్రమున శతక రచన సాగుచునే యున్నది.

శతకమను పేరే యది నూఱు పద్యములతోఁ గూడిన గ్రంథమని తెల్పుచున్నది. కాని పెక్కు శతకములలో నూట యెనిమిది పద్యముల వఱకుఁ గానవచ్చుచుండును. భగవన్నామ స్తోత్రములందు సహస్రమో అష్టోత్తర శతమో నామములుండుట పరిపాటి యగుటచే శతకములు కూడ నష్టోత్తర శతపద్య పరిమితములై యుండుట సంభవించినట్లు తోఁచుచున్నది. నూటికిఁ దక్కువ సంఖ్యగల పద్యములతోఁ గూడిన రచనలును గొన్ని కానవచ్చుచున్నవి. వానిలో పంచరత్నములు, నవరత్నములు, తారావళులు, అక్షరమాలలు ముఖ్యములైనవి. గ్రహములు తొమ్మిది. రాసులు పండ్రెండు. నక్షత్రము లిరువదియేడు, ఈ సంఖ్యలతోఁ గల సంబంధమునుబట్టి కూడ శతకములందలి పద్యముల సంఖ్య నూటయెనిమిదిగా స్థిరపడి యుండును. సంస్కృత ప్రాకృతములందు త్రిశతులు, పంచశతులు, సప్తశతులు, సహస్రములు కూడఁ గలవు.

శతకములు ప్రాయికముగా భగవన్నుతి పూర్వకములైన గ్రంథములు. ఇట్టి స్తోత్రములు ఋగ్వేద కాలమునుండియు గోచరించును.

ఋగ్వేదము నింద్రాగ్ని రవివరుణాది దేవతల స్తోత్రముల సముచ్చయ మని చెప్పవచ్చును. లౌకిక సంస్కృతమున మయూరుని సూర్యశతకము, భర్తృహరి సుభాషిత త్రిశతి మున్నగు శతకములు కానవచ్చుచున్నవి. శ్రీ శంకరాచార్య స్వాములవారి శివానందలహరి వంటి స్తోత్ర గ్రంథ ములనుగూడ శతకములుగానే పరిగణింప వచ్చును. ఇవిగాక సంస్కృత మున సహస్రనామ స్తోత్రములు, అష్టోత్తర శతనామ స్తోత్రములు పెక్కు గలవు. ప్రాకృతమున హాలుఁడు సంకలించిన గాథా సప్తశతి యేడు శతకముల సమాహారమని చెప్పఁ దగియున్నది. ఇదిగాక యవదాన శతకమను వేరొక నామముకూడఁ బ్రాకృతమున వినవచ్చుచున్నది. ఇట్లే తమిళ కన్నడములందును, ఆంగ్లమునందును గూడ శతకములు, శతకప్రాయములునైన రచనలు పెక్కు కనవచ్చుచున్నవి. కాని శతక వాఙ్మయమాంధ్రమునఁ బెంపొందినట్లుగా మఱి యే యితర వాఙ్మయ మందును బెంపొందియుండ లేదని విమర్శకు లభిప్రాయ పడుచున్నారు.

శతకములు భగవన్నుతి ప్రధానములైన గ్రంథములని యిది వఱకుఁ జెప్పఁబడినది. ఇందు వందకాని నూటయెనిమిదికాని పద్యము లుండును. ఈ పద్యముల చివర సమానమైన మకుటము కానవచ్చును. ఈ మకుటములు ప్రాయికముగా భగవత్సంబోధన రూపములై యుండును. సంస్కృత శతకములందు మకుట నియమము కానరాదు. శతకములు సాధారణముగా నొకే ఛందమున వ్రాయఁబడుచుండును. సంస్కృత కావ్యములం దొక్కొక్క సర్గమున నొక్కొక్క వృత్త భేదము గ్రహింపఁబడుచుండు నాచారము కలదు. సర్గాంతమున మాత్ర మొండు రెండు భిన్న వృత్తములు వ్రాయఁబడుచుండును. తెలుఁగున కందరామాయణము అని గీతరామాయణము అని కొన్ని రచనలు గలవు. కాని యందలి కావ్యములలోని యాశ్వాసములు వివిధ పద్య వృత్త మయములై యుండుటయే తఱుచు. కావ్యములందువలె శతకములలో నందలి పద్యములన్నిటికిని సంబంధము సమకూర్చు కథాసూత్రము

కానరాదు. అందలి పద్యములు వేనికవే స్వతంత్రములు. అందుచే వీనిని ముక్తక కావ్యములని చెప్పవచ్చును. వస్త్వైక్యము లేమిచే నిందు రసపాత్ర పోషణమున కవకాశ మంతగాఁ గానరాదు. కాని శృంగార భక్తి హాస్యరస ప్రధానములైన శతకములు కొన్ని లేకపోలేదు. శతకములు సాధారణముగా గ్రంథకర్త యాత్మభావములను బ్రకటించు నవిగా నుండును. అతఁ డందు దోషములు మన్నించి, యాపదలు నివారించి, తన్ను రక్షింపవలెనని భగవంతునిఁ బ్రార్థించును. ఆత్మ పరిశీలనము చేసికొని గత జీవిత దోషములు స్మృతికి వచ్చుటచేఁ బశ్చాత్తాపము నొందును. తన మనస్సు నాకర్షించిన వేల్పు గుణ గణములను, మహిమానుభావములను వర్ణించును. ఈ విధముగా శతక ములు పెక్కాత్మాశ్రియ కవితా జాతికిఁ జెంది యుండును. అవి కవులు నిజ హృదయాంతరాళములను భగవంతునికి బయల్పఱుచుటకై చేయు సంభాషణలు. కొన్ని శతకములలోఁ గవులు ప్రసక్తాను ప్రసక్తముగాఁ దమనాఁటి సాంఘికాది పరిస్థితులను వర్ణింతురు. కొందఱు కవులు భాగవత రామాయణ కథా సంగ్రహములను శతక రూపమునఁ జెప్పియుండిరి కాని యట్టి వాని సంఖ్య చాల తక్కువ. కొందఱు శతకముల మూల మున నీతి ధర్మ తత్త్వములను బ్రపంచించి యుండిరి.

నన్నయకుఁ బూర్వమాంధ్రమున దేశిమార్గమునకుఁ జెందిన కవిత్వ ముండెనని విమర్శకులు తలంచుచున్నారు. దాని స్వరూప మిద మిత్థమని నిర్ణయించుట కాధారములులేవు. ఆంధ్రమున మనకు లభ్యము లగుచున్న కావ్యములలో మొదటిది నన్నయభట్టారకుని యాంధ్ర భారతము. అందలి యాది పర్వమున నుదంకుఁడు నాగరాజులను స్తుతించు సందర్భమున "మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్" అను ప్రార్థనతోఁ గూడిన మూఁడు పద్యములు కానవచ్చుచున్నవి. ఇవి శతక పద్యములను బోలి యున్నవి. అట్లే నన్నిచోడుఁడు కుమార సంభవమున రెండుచోట్ల స్తుతిపూర్వకములై శతక పద్యములను

దలపించు పద్యములు రచించియుండెను. అందు దారిద్ర్యవిద్రావణా అను మకుటము గల పద్యములు ప్రసిద్ధములైనవి. శైవమతాచార్యుడైన మల్లికార్జున పండితారాధ్యుఁడు "అజా, రుద్రా, శివా" అను మకుటములు గల పద్యములు నాలుగైదు వందలు వ్రాసి వానికి శివతత్త్వసారమని పేరు పెట్టెను. శతకమను పేరులేకున్నను ఈ పద్యములు సర్వవిధముల శతక పద్యములనే పోలియున్నవి. పాల్కురికి సోమనాథుఁడు పండితుఁడు రచించిన గ్రంథములు పేర్కొనుచు. "శతకంబు శివతత్త్వసారము దీపకళిక" అని వ్రాసి యుండెను. విమర్శకు లిందలి శతకమను మాటను శివతత్త్వ సారమునకు విశేషణముగనే గ్రహించుచున్నారు. మఱి కొంద అవి రెండు గ్రంథముల పేర్లనియుఁ బండితుఁడు శివతత్త్వసారముకాక శ్రీగిరిమల్లికార్జున శతకమొండు రచించెననియుఁ జెప్పుచున్నారు. ఎట్లయినను దెలుఁగున మల్లికార్జున పండితారాధ్యుఁడే ప్రథమ శతక కర్తయని చెప్పనొప్పును. పాల్కురికి సోమనాథుఁడు రచించిన వృషాధిప శతకము సర్వలక్షణ సంపన్నమైన శతకమే. తరువాతఁ బలువురు కవులు తమ యిష్ట దైవతముల సంబోధించుచుఁ బెక్కు శతకములు రచించియున్నారు. ఉదాహరణాదులగు దేశిప్రక్రియల నాంధ్రమునఁ బ్రవేశ పెట్టిన శైవ కవులే యీ శతకములను గూడ రచింప నారంభించుట గమనింపఁ దగియున్నది.

సంస్కృత లాక్షణికులు శతకములను క్షుద్ర కావ్యములుగాఁ బరిగణించి యుండిరి. ఇచ్చట క్షుద్రశబ్దము నీచార్థమునఁ గాక యల్పార్థమున వాడఁబడినది. క్షుద్ర కావ్య మనఁగాఁ జిన్న కావ్యమని యర్థము.

ఆంధ్రవాఙ్మయ మందలి శతకములను నీతిశతకములు, భక్తిశతకములు, వ్యాజస్తుతి శతకములు, వేదాంత శతకములు అని నాలుగు విధములుగా విభజింప వచ్చును. నీతి శతకములు, సర్వజన హితకరములైన నీతులతోఁ గూడి చదువువారి ప్రవర్తనమును జక్కఁ జేయుటకుఁ దోడ్పడుచుండును. భక్తి శతకములలోఁ గవులకుఁ దమ యిలువేల్పుల

పైఁగల హార్దమైన భక్తి జాలువాఱుచుండును. వ్యాజస్తుతి శతకములు నిందావ్యాజమున నా యా దేవతల మహిమానుభావములను వర్ణించు చుండును. ఇట్టి వానికిఁ బోతన భాగవతాది గ్రంథములలో నుదాహరణ ములు కానవచ్చును. దేవనిందకులు విష్ణువును దూఱునప్పుడు పోతన సాధారణముగా నీ వ్యాజస్తుతినే యాశ్రయించుచుండును. వేదాంత శతక ములు తత్త్వవేదాంతమయములై దుర్గ్రహములైన వేద వేదాంతముల సారమును ముముక్షువులకు సులభముగా నందఁజేయుచుండును.

## నీతి శతకములు

నీతిశతకము లందలి నీతులు మానవ సంఘము నందలి వివిధ వ్యక్తు లకు సంబంధించియుండును. ఇవి పూర్వగ్రంథములను లోకానుభవమును ఆధారముగాఁ జేసికొని రచింపఁబడినట్టివి. ఇందు రాజనీతి, గృహనీతి, లోకనీతి, ప్రవృత్తినీతి ముఖ్యములైనవి. నీతిశతకములలోఁ గాలమును బట్టియు గుణవిశేషమును బట్టియు నగ్రగణ్యమైనది సుమతిశతకము. ఇందన్నియుఁ గంద పద్యములే. క్రీ. శ. 13వ శతాబ్ది యందలి బద్దెన యను భద్రభూపాలుఁ డీ శతకమును రచించెనని ప్రతీతి. కూచిమంచి తిమ్మకవి వేములవాడ భీమకవి యొక సుమతి శతకమును రచించెనని చెప్పి యున్నాఁడు. ఆ సుమతి శతకము ప్రసిద్ధమైన యీ శతకమగునో కాదో తెలియదు. సుమతి యను పేరు గల జైనముని యొకఁ డాత్మ సంబోధన పరముగా నీ శతకమును రచించి యుండెనని కీ. శే. వంగూరి సుబ్బారావు గారూహించి యున్నారు. ఇందు రాజనీతి, లోకనీతి, గృహనీతి సులభ సుందరమై సర్వజనసుబోధమైన శైలిలో స్పష్టముగాఁ జెప్పఁబడి యున్నవి. ఈ శతకము రచించిన కవి యెవ్వరైనను అతని లోకానుభవ మమేయమని చెప్పవచ్చును. ఆంధ్రమున నక్షరాస్యులైన వారీ శతకమునందలి యొండు రెండు పద్యములనైన నెఱుంగకుండరు.

తాళ్ళపాక అన్నమాచార్యుల కుమారుఁడైన పెదతిరుమలాచార్యుఁడు క్రీ. శ. 16 వ శతాబ్ది పూర్వార్ధమున వేంకటేశ్వర శతకమును రచించియుండెను. ఇందన్నియు సీసపద్యములు. ఇది భక్తి ప్రధానమైన శతకమే యైనను బ్రసక్తానుసక్తముగా నిందు లోకనీతి రాజనీతులుకూడ వివరింపఁబడినవి. ఇది సరళ సుందరమైన శైలితోఁ గూడి నీతి ప్రపంచమునఁ దరువాత వెలసినఁ బెక్కు శతకములకు మార్గదర్శకమైనది.

శరభాంకలింగ శతకమున శివభక్తుల ప్రశంస తోపాటు జనహితకరములగు పెక్కు నీతులుకూడ వివరింపఁబడినవి. దీనిని రచించిన కవి యెవ్వరో తెలియదు. క్రీ.శ. 16వ శతాబ్ది యందలి లింగమగుంట తిమ్మకవి సులక్షణ సారములో శరభాంకుని చాటుధార యొకటి యుదాహరింపఁబడి యుండుటచే నా శరభాంకుఁడే యీ శతకకర్తయై యుండుననియు, నీ శతకము క్రీ. శ. 16వ శతాబ్దికిఁ బూర్వమే రచింపఁబడి యుండుననియు శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనముగారు రూహించుచున్నారు. ఈ కవి శివభక్తుఁడు. ఇతఁడు తననాఁడు జనులలో వ్యాపించి యుండిన మూఢ విశ్వాసముల నిందు హేళన చేసియున్నాఁడు.

సుమతి శతకము వలెనే యాంధ్రదేశమున విశేష ప్రచారము నందిన మఱియొక నీతిశతకము భాస్కర శతకము. మారద వెంకయ్య యను కవి దీనిని రచించెనని చెప్పుదురు. ఇందలి పద్యములు కొన్ని అప్పకవీయమున నుదాహృతములై యుండుటచే నిది క్రీ. శ. 17 వ శతాబ్దికి పూర్వమే రచింపఁబడినదని చెప్పవచ్చును. ఇందుఁ బ్రతి పద్యము నందు నొక నీతియు దానికి లోక దృష్టాంతమును జెప్పఁబడి యుండును. ఇందలి దృష్టాంతములు మిక్కిలి సరసములై కవి లోకానుభవమును వ్యక్తము చేయుచున్నవి. ఇందుశైలి సులభమయ్యు మిక్కిలి శక్తిమంతమై యొప్పారుచుండును.

చంద్రశేఖర శతకము నీతిహాస్య సమ్మిళితమై యున్నది. ఇది యత్కర్తృకమో తెలియదు. మంగళగిరి పానకాలస్వామి జాతరలో జరుగు సామాన్య జనుల ప్రసంగము లిందు హాస్యధోరణి ననుకరింపఁబడియున్నవి. కవి యిం దనాగరికుల సంభాషణములను వారి భాషలోనే వర్ణించు విధానము నవ్వు పుట్టించుచున్నది. లోభులను స్వార్థపరులను ఈ కవి మిక్కిలిగాఁ దెగడి యున్నాఁడు.

వరాహగిరి కొండ రాజామాత్యుఁడు రచించిన జగన్నాయక శతకముకూడ భాస్కర శతకము వలెనే నీతులతోడను దృష్టాంతములతోడను గూడి హృద్యమై యున్నది. అందలి శైలి సరసమై మిక్కిలి సులభముగా నుండును. ఈ శతకము వరాహగిరి జగన్నాథస్వామి కంకితము చేయఁబడుటచే నేతత్కర్త విశాఖపట్టణ మండలము వాఁడై యుండునని తోఁచుచున్నది.

కవిసార్వభౌముఁడై బహు కావ్యములు రచించిన కూచిమంచి తిమ్మకవి పిఠాపురమునందలి కుక్కుటేశ్వరస్వామి కంకితముగా కుక్కుటేశ్వర శతకము రచించెను. అడ్లే తిట్టుకవి యని ప్రసిద్ధి నందిన అడిదము సూరకవి రామలింగేశ శతకమును రచించెను. సీస పద్యమయములైన ఈ రెండు శతకములందును జక్కని నీతులు వివరింపఁబడినవి. దురాత్ములై భోగలాలసతోఁ గాలము పుచ్చు ధనికులయు, భూపతులయుఁ బ్రవృత్తు లిందు నిరసింపఁబడినవి. విజయనగర సంస్థానాధీశుఁడగు రెండవ విజయ రామరాజు చిన్నవాఁడగుటచే నతని పక్షమున రాజ్యవ్యవహారములు సాగించుచుండిన సీతారామరాజు దుష్టుఁడై దేవబ్రాహ్మణకవి ప్రభృతులకు విరుద్ధముగా వ్యవహరించి యుండుటచే నతనికి సదుపదేశము చేయుటకై సూరకవి రామలింగేశ శతకము రచించెనని చెప్పుదురు.

ఆధునికములైన కుమార శతకమును, కుమారీ శతకమును గూడఁ బాఠశాలలలో మిక్కిలి ప్రచారము నందుచున్నవి. ఇందు బాల

బాలికలు నేర్వఁదగిన నీతులుసులభశైలిలో వివరింపఁబడి యున్నవి. కుమార శతకకర్త అయ్యనకోట పార్థసారథిసెట్టి యను కులాల కులసంజాతుఁడు. కుమారీ శతకమును రచించినవాఁడు వేంకట నరసింహకవి. శతకము శ్రేయుద్దేశముతో రచింపఁబడినదైనను అందెడ నెడఁ గొన్ని నీతులు కూడఁ జెప్పఁబడుచునే యుండును. ప్రసిద్ధుఁడైన వేమనయోగి రచించిన "విశ్వదాభిరామ వినురవేమ" యను మకుటముతోఁ గూడిన పద్యములలోఁ బెక్కు నీతి ప్రధానములైనట్టివే. ఈతఁడు రచించిన పద్యములు కొన్ని సహస్రము లున్నవి. వానియందు వివరింపఁబడిన విషయమందుఁగూడ నధికమైన వైవిధ్యమున్నది.

## భక్తి శతకములు

ఆంధ్రమునందలి భగవన్నుతి పూర్వకములైన పెక్కు శతకములను భక్తిశతకములనియే చెప్పవచ్చును. ఇట్టి శతకములలో "బసవా బసవా బసవా వృషాధిపా" యను మకుటముతో శైవ కవిసార్వభౌముఁడైన పాల్కురికి సోమనాథుఁడు రచించిన వృషాధిప శతకము మొట్టమొదటిది ఇందు కవికి బసవేశ్వరునందుఁ గల భక్తియు, వివిధ భాషా పరిజ్ఞానమును వెల్లడి చేయఁబడినవి. ఈ శతకము శైవమత ప్రచారమునఁ బేరొందిన పలువురు భక్తుల చరిత్రలను బ్రస్తుతించుచున్నది. ఇందెడ నెడ మతాంతర నిరసనముకూడఁ గానవచ్చును. ఇందు వృత్తరచనమున సోమనాథునికిఁ గల నేర్పును, అతనికి సహజమైన ధారాళ శైలియు సర్వతోముఖముగా గోచరించును. ఆంధ్రమున సమగ్ర శతక లక్షణములతోఁ గూడిన తొలి శతక మిదియే. పాల్కురికి సోమనాథుఁడు చెన్నమల్లు సీసములను పేర ముప్పదిరెండు సీసములు రచించెను. వీని సంఖ్య వందకుఁ దక్కువగా నున్నను ఇవియు శతక పద్యముల వలెనే యున్నవని చెప్పవచ్చును. ఇందు వీరశైవ సిద్ధాంతము చక్కఁగా వివరింపఁబడినది. మత విషయమున సోమనకుఁ గల యావేశ మీ పద్యముల కత్యధికమైన వేగము చేకూర్చినది.

కొంచె మించు మించుగా పాల్కురికి సోమనాథునికి సమకాలికుఁడని చెప్పఁదగిన యథావాక్కుల అన్నమయ్య క్రీ. శ. 1242 లో సర్వేశ్వర శతకము రచించెను. ఇతఁడును శివకవియే. ఇతఁడు గోదావరీ మండలములోని పట్టిసపు గ్రామమునందలి వీరభద్రస్వామి భక్తుఁడని చెప్పుదురు. ఈతని కవిత్వము రసాలంకార భావ పరిపుష్టమై, ధారా శుద్ధి కలిగి, మిక్కిలి హృద్యముగా నుండును. ఈ శతకమున శివభక్తి మహాత్త్వ మగ్గడింపఁబడినది.

జక్కన తన విక్రమార్క చరిత్ర కృతి నందిన వెన్నెలకంటి సిద్ధన మంత్రి వంశమును వర్ణించుచు నాతని తండ్రియైన జన్నమంత్రి (క్రీ. శ. 15వ శతాబ్ది) "పరమ హృద్యంబైన పద్య శతంబుచే దేవకీ తనయు విధేయుఁ జేసె" నని వ్రాసియుండెను. ఈతఁడు వ్రాసిన యీ శతక మేదో చెప్పుటకు వీలులేదు. కాని దేవకీ నందన శతకమను పేర భక్తి రసభరితమైన యుత్తమ శతక మొక్కటి కనవచ్చుటచే నదే యీతఁడు రచించిన శతకమని యూహింపఁబడినది. దేవకీనందన శతకము కృష్ణుని గుణగణములను, శిష్ట రక్షణ దుష్ట శిక్షణములను జక్కఁగా వర్ణించు చున్నది. ఇందలి శైలి సమాస భూయిష్ఠమయ్యు నక్లిష్టమై మనోహర ముగా నుండును.

క్రీ. శ. 16 వ శతాబ్ది ప్రారంభమున నుండిన వెల్లంకి తాతంభట్టు తన కవి లోకచింతామణిలో నారాయణ శతకము నుండి యొక పద్యము నుదాహరించెను. దీనినిబట్టి యది క్రీ. శ. 16 వ శతాబ్దికి ముందే వ్రాయఁ బడి యుండినట్లు తెలియుచున్నది. కాని దాని కర్తను గూర్చి యేమియుఁ దెలియుట లేదు. దీనిని బోతన వ్రాసె నని ప్రతీతి. దేవకీనందన శతక మందు వలెనే యిందును శ్రీకృష్ణుని బాల్యచేష్టలును మహిమానుభావము లును భక్తి పూరితముగా వర్ణింపఁబడి యున్నవి.

అయ్యలరాజు రామభద్రుని తాత ఒంటిమిట్ట రఘువీర శతకము రచించినట్లు రామాభ్యుదయ మందలి గద్యమును బట్టి

తెలియుచున్నది. ఇది క్రీ. శ. 15 వ శతాబ్ది యుత్తరార్ధమున రచింపఁబడి యుండును. ఇదియును సంస్కృత సమాస భూయిష్ఠమే యయ్యు రసవంతమును సుబోధమునై మిక్కిలి హృద్యముగా నున్నది. ఈ శతకమున నెడనెడ శబ్దాలంకార ప్రీతి గోచరించును. అయ్యును ధార యెచ్చటను గుంటువడక సెలయేటివలె సాగిపోయినది. "రఘువీరా! జానకీ నాయకా!" యనున దిందలి మకుటము.

ధూర్జటి మహాకవి రచించిన కాళహస్తీశ్వర శతకము భక్తి నైర్మల్యముచేతను, భావ గాంభీర్యము చేతను, మృదుమధుర పద ప్రయోగముచేతను తెలుఁగు నందలి శతక వాఙ్మయమున కలంకార మని చెప్పఁ దగినది. ఇది ధూర్జటి కృత మగునా కాదా యని కొందఱు విమర్శకులు సందేహించుచున్నారు. కాని శైలీ సౌందర్యమును, రచనాప్రౌఢిమనుబట్టి చూచినచో శ్రీ కాళహస్తి మాహాత్మ్యము రచించిన కవియే దీనిని గూడ రచించి యుండునని నిరాక్షేపముగఁ జెప్పవచ్చును. ధూర్జటి రాజుల సేవించుచుఁ గామోపభోగలాలసుఁడై పూర్వ వయస్సును బుచ్చి యుండును. ఈ శతకమున నాతని పశ్చాత్తాపమును, వైరాగ్యమును జక్కగా వెల్లడి చేయఁబడినవి. ఇందు రాజులును, వా రొనర్చు ధూర్తచర్యలును బలు విధముల నిరసింపఁబడినవి. ఇందలి శైలి ప్రౌఢమై, ధారాశుద్ధి శోభితమై మిగుల హృద్యముగా నున్నది. ధూర్జటి యాత్మీయాంశ యిందుఁ బెక్కుచోట్లఁ గాననగును. భాషావిషయమున నాతఁడు బుద్ధిపూర్వకముగనే యిందుఁగొంత స్వాతంత్ర్యము వహించియుండెను.

క్రీ. శ 17 వ శతాబ్ది యుత్తరార్ధమున గోలకొండ పరిపాలించిన అబుల్ హసన్ తానీషా కాలములో నుండిన కంచెర్ల గోపన్న యను పేరుగల రామదాసు రచించిన దాశరథీ శతకము శ్రీ కాళహస్తీశ్వర శతకము వలెనే తెలుఁగునఁగల భక్తి శతకములలో మిక్కిలి యుత్తమమైనది. ఇందలి ప్రతి పద్యమును నొక భక్తిరసవాహిని. ఇందలి యర్థ

శబ్దాలంకార చమత్కారమును, వైరాగ్య సంపదయు, ధారాశుద్ధియు "చిక్కని పాలపై మిసిమిఁ జెందిన మీఁగడ పంచదారతోఁ" గలసిన భంగి మధురమైన పదప్రయోగమును, ననన్యసామాన్యములు. ఇందుకు రామదాసు హృదయమున నిండారి యుండిన మహోన్నత భక్తి భావమే కారణము. తెలుఁగుదేశమున విశేష ప్రచారముఁ గాంచిన శతక రాజములలో నిది యొకటి.

కందపద్యమయమును భక్తిరసపూరితమును నైన కృష్ణశతకము చిరకాలము నుండి పాఠశాల లందు బాలబాలికలకుఁ బాఠ్యగ్రంథమై యలరారుచున్నది. దానిని రచించినవాఁడు నృసింహ కవి. ఇందు శ్రీకృష్ణుని బాల్యక్రీడలును, మహిమలును మృదుమధురమైన శైలిలో వర్ణింపఁబడినవి.

రావూరి సంజీవ కవి, కొలనుపాక వీరనారాయణ దేవుని నుతించుచు, వీరనారాయణ ముకుందశతకము రచించెను. (1731) మహమ్మదీయ విప్లవ సమయమున కొలనుపాక యందలి ప్రజలు వీరనారాయణ విగ్రహమును బొదలలో దాచఁగా నది తెలిసికొని సంజీవకవి రసవంతములైన పద్యములు చదివి దానిని ముందుకు రప్పించె నని చెప్పుదురు. ఈ శతకము సీసపద్యమయము. ఈ సీసములు లక్షణయుక్తములయ్యు. వచనప్రాయములై సర్వజన సుబోధ మగు శైలిలో నున్నవి. ప్రతిపద్యము చివరను "భూరిమయవాస, కొలిపాకపుర నివాస! వీరనారాయణ ముకుంద విశ్వతుంద!"యను నట్లుగా నంత్యానుప్రాస నియమము కనిపించుచున్నది. కొలనుపాక సుప్రసిద్ధ జైన క్షేత్రము. అది కాకతీయుల కాలమున శైవులకును, దరువాత వైష్ణవులకును వశమయ్యెను. ఈ సంజీవకవి వసుదేవనందన శతకమును గూడ రచించి యుండెను.

శేషప్ప లేక శేషాచలదాసు అను పేరుగల కవి నృకేసరి శతకము, నరసింహ శతకము అను రెండు శతకములు రచించెను. ఇతఁడ

ధర్మపురి నివాసి. ధర్మపురి నిజాము రాష్ట్రమునందలి పుణ్యక్షేత్రములలో నొకటి. నృకేసరిశతకము నందు 'ధర్మపురీ నృకేసరీ' యనునది మకుటము. అచ్చటచ్చటఁ గొలఁది వ్యాకరణ స్ఖాలిత్యము లున్నను ఈ శతకము భక్తిరసోద్బోధకమై మిక్కిలి సరసముగా నున్నది. నరసింహశతకము నృకేసరిశతకముకంటె నెక్కువ ప్రచారము వడసినది. ఇందలి సీసపద్యములలోఁ బెక్కు భక్తిమయములే యైనను, గొన్ని నీతిప్రబోధకములైనవి కూడఁ గలవు. "భూషణవికాస శ్రీధర్మపుర నివాస దుష్టసంహార నరసింహ దురితదూర" అనునది యిందలి మకుటము.

లక్ష్మీశతకము కందపద్యమయ మైన శతకము. దీనిని రచించిన వాఁడు పరవస్తు మునినాథకవి యను సాతానివైష్ణవుఁడు. ఇతఁడు లలితా శతకమును గూడ రచించి యుండెను. ఇతని కవిత శబ్దాలంకారమయమై, నిర్దుష్టమై ద్రాక్షాపాకముగ నున్నది. లక్ష్మీస్తుతి పరమైన శతకమాంధ్రమున నిది యొకటే.

తిరువాయిపాటి వేంకటకవి యను సాతానివైష్ణవుఁడు 'యాదగిరీంద్ర మ్రొక్కెదన్' అను మకుటముతో యాదగిరీంద్ర శతకము రచించెను. యాదగిరి తెలంగాణమునఁగల ప్రసిద్ధమైన నృసింహక్షేత్రము. ఇందలి దేవునిగూర్చి వ్రాయఁబడిన యక్షగానములు, శతకములు, గేయములు పెక్కు గలవు. వేంకటకవియే యాదగిరి నృసింహా యను మకుటము గల కందపద్య శతకమును గూడ రచించె నని శ్రీ శేషాద్రి రమణ కవులు తెల్పియున్నారు.

"రంగశాయి మనపాలఁ గలండు విచార మేటికిన్" అను మకుటముతోఁ గూడిన రంగశాయి శతక మెవరు రచించినదో తెలియదు. ఇందలి కొన్ని పద్యములను బట్టి కవి వైష్ణవసంప్రదాయములు బాగుగా నెఱింగినవాఁడని యూహింపవచ్చును. ఈ శతకము మిక్కిలి ప్రౌఢమై నిర్దుష్టముగా నున్నది. కవికి యమకానుప్రాసముక్తపదగ్రస్తాదు లగు శబ్దాలంకారము లందుఁ బ్రీతి మెండు. ఇందలి ప్రతిపద్యము నందును

భక్తి నిండారియున్నది ఇందు మొత్తము నూటొక్క పద్యము లున్నవి.

పైని పేర్కొనఁబడినవికాక నీతి భక్తి ప్రధానములైన శతకము లింకను బెక్కు గలవు. అందు శివశతకము, దిట్టకవి నారాయణకవి కుమారుఁడు రామచంద్రకవి రచించిన మహిషాసుర మర్దనీ శతకము పేర్కొనఁదగియున్నవి. ఆధునికులు రచించిన భక్తిమయ శతకములలో తిరుపతి వేంకటేశ్వరకవుల కామేశ్వరీ శతకమును, కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి విశ్వేశ్వర శతకమును (మాస్వామి), కీ. శే. వడ్డాది సుబ్బారాయుఁడుగారు రచించిన భక్తచింతామణి శతకమును ముఖ్యములైనవి. వీనిలో భక్తచింతామణి శతకము మిక్కిలి ప్రచారము పొందినది. ఇందలి పద్యము లన్నియు భక్తిరసనిధానములై, మనోహరములుగా నుండును.

క్రీ. శ. 19 వ శతాబ్ది నడుమ నుండిన అప్పావు మొదలి యను కవి మాతృశతకము రచించి యుండెను. ఈతఁడు మీనాక్షీ దేవి భక్తుఁడు. ఇతఁడీ శతకమున మాతృమాహాత్మ్యమును, దల్లికి సంతానము నెడఁ గల వాత్సల్యమును హృద్యముగా వర్ణించి యుండెను, 'తల్లినిబోల రెవ్వరున్' అనునది యిందలి మకుటము.

## వ్యాజస్తుతి శతకములు.

"వ్యాజస్తుతి ర్ముఖేనిందా స్తుతిర్వా రూఢి రన్యథా" అని వ్యాజస్తుత్యలంకారమునకు కావ్యప్రకాశమున నీయఁబడిన నిర్వచనము. ఇందు స్తుతిలో నిందకాని, నిందలో స్తుతి కాని యంతర్గతమై యుండును. దేశము విప్లవకారులయు, ధూర్తులయు నత్యాచారములకు లోనై యుపద్రవ సముద్రమున మగ్నము కానున్నపుడు భగవంతుఁడు మౌనము వహించి యూరకుండుట యుచితము కాదనియు, నాతఁడు కరుణవహించి దేశమును భక్తులను గాపాడవలె ననియుఁ గవి కావించు తీవ్రమయిన

ప్రబోధ మిందలి ప్రధానాంశము. కవి ప్రయోగించు తీక్ష్ణములైన మాట లాతఁడు భగవంతుని నిందించుచున్నట్లు కానిపించినను ఇందలి పద్యము లలో భక్తి యంతర్వాహినిగాఁ బ్రవహించుచునే యుండును. ఈ శతకము లవి రచింపఁబడిన కాలము నందలి రాజకీయ మత పరిస్థితులను దెలిసికొనుట కెన్నియో విధములఁ దోడ్పడుచుండును.

వ్యాజస్తుతి శతకములలో మొదటఁ బేర్కొనఁదగినది గోగుల పాటి కూర్మనాథకవి రచించిన సింహాద్రి నారసింహ శతకము. ఈ కవి క్రీ. శ. 18 వ శతాబ్ది యుత్తర భాగమున విశాఖ మండలమున నివ సించిన వాఁడు. అప్పు డాంధ్రదేశము యవనుల దురాగతములకు లోనై కడగండ్లు గుడుచుచుండెను. స్త్రీలను జెఱపట్టుట, మతగ్రంథములను మంటఁగలుపుట, దేవాలయములను బడఁగొట్టుట మున్నగు నత్యా చారములు సర్వత్ర సాగుచుండెను. ఒకప్పుడు యవనసేన సింహగిరిపై కెక్కి సింహాద్రి క్షేత్రమును గొల్లగొట్ట నుద్యమించెను. ఆ యుపద్రవ మును గన్నులారఁ గాంచి భక్తుఁడైన కవి స్వామి యగ్రభాగమున నిలిచి, ప్రజలను, దేశమును గాపాడవలె నని నరసింహస్వామి నీశతకము లందలి పద్యములతోఁ బ్రబోధించి యుండెను. ఈ పద్యము లప్పటి జనుల హృదయముల నిండియున్న వేదనకు నిధానములు. అందలి సామెతలు, యుక్తులు, ఉపాలంభములు మిక్కిలి తీవ్రములై కవి యావేశమును జక్కఁగా సూచించుచున్నవి. ఇందలి పద్యములు "వైరివరరంహ సింహాద్రి నారసింహ" యను మకుటముతో నొప్పారు సీసపద్యములు. భక్తుని యుపాలంభవాక్యములు సహింపలేక సింహాద్రి స్వామి కందిరీగల రూపమున నావిర్భవించి, దుష్టులైన శత్రువులను బటాపంచ లొనరించి, యాలయము నుపద్రవము నుండి రక్షించె నని చెప్పుదురు.

భల్లా పేరయ్యకవి రచించిన భద్రగిరి శతకము కూడ నిందాస్తుతి మయమైనదే. క్రీ. శ. 18 వ శతాబ్ది పూర్వ భాగమున ధంసా యను

యవన సేనాని వేల్పుకొండపై దుర్గము నిర్మించి, దండయాత్రకు బయల్వెడలి, యనేక పురముల పాడుచేసి, పెక్కు దురంతములొనరించుచుఁ జివరికి భద్రాచలముపై దండెత్తెను. అతఁడా క్షేత్రము నందలి ప్రజలకును, భక్తులకును గలిగించిన కష్టములకు మేరలేదు. అతఁడు భద్రగిరిపైఁగల దేవాలయము చొచ్చి యందలి విగ్రహములను పాడుచేయునేమో యను భీతిచే నర్చకులు వానిని బడవలపైఁ బోలవరము చేర్చిరి. "భక్తులందఱు ధంసా క్రౌర్యమునకుఁ బాల్పడి పలు కష్టము లొందుచుండ నీవు పోలవరమున సుఖముగాఁ గూర్చుంటివా? ముష్కరులైన శత్రువులు నిన్నును విడువ" రని నిష్ఠురములాడుచు పేరయకవి యీ శతకమును రచించినాఁడు. శ్రీరామాదుల విగ్రహములు పోలవరమున సుమారైదేండ్లుండెను. కవి శ్రీరాముఁడు పోలవరమునకు వలసపోయినప్పుడీ శతకమును వ్రాయ నారంభించి యతఁడు మరల భద్రాద్రి కరుదెంచునప్పటికి దానిని ముగించెనని తోఁచుచున్నది. ఇందుఁగవి శ్రీరాముని యుల్లము చిచ్చిపోవునట్లు నిష్ఠురములు పల్కినాఁడు. ఈ పల్కులలో నప్పటి పరిస్థితులను చూచి యాతఁడు పొందిన పరితాపాతిశయము వెల్లడి యగుచున్నది. ఇందలి కవిత సరళమును, సుబోధమునై యొప్పారుచున్నది.

కృష్ణానదీతీరము నందలి శ్రీకాకుళ గ్రామమున నాంధ్రవిష్ణువు దేవాలయము కలదు. శ్రీకృష్ణదేవరాయ లీ దేవుని ప్రేరణచేతనే తా నాముక్తమాల్యదను రచించినట్లు చెప్పియున్నాఁడు. ఈ దేవాలయము కృష్ణానది వఱదలకు శిథిలమై, పూజా పురస్కారములులేక పాడుపడి యుండుట చూచి, తద్గ్రామవాసి యగు కాసుల పురుషోత్తమకవి (1790) దుఃఖితుఁడై యా దేవుని గూర్చి "నీ వెన్నో మహాకార్యములు చేసితి వందురు. అవన్నియు వట్టి యతిశయోక్తులు. నీ వుండు దేవాలయమునే యుద్ధరించుకొనలేనివాఁడవా మహాకార్యములు చేసితివన్న నెట్లు విశ్వసింపనగును. నీ కాలుబిడ్డలు తెచ్చిపెట్టిన ఘనతయేకాని, నైజమైన

ఘనత మృగ్య" మని యుపాలంభించుచు నాంధ్రనాయక శతకమును రచించెను. విష్ణువు వివిధావతారములలోఁ గావించిన ఘనకార్యము లన్నియు ధూర్తచర్యలని యీతఁడు నిరూపింప యత్నించెను. ఇందన్నియు సీసపద్యములే. వానిలోఁ బైకి నిందయే గోచరించినను లోపల గాఢ మయిన భక్తిభావము నిండారి యున్నది. ఇందుఁ గవి ప్రదర్శించిన వ్యంగ్య చమత్కారము లద్భుతము లైనవి. ఇట్లుపాలంభ పూర్వకముగా శతకమును వ్రాసి, ముగించి కవి చివర తన యవివేకమును మన్నింపు మని భగవంతునిఁ బ్రార్థించినాఁడు. ఈ శతకము విని కవి కాశ్రయ ణీయులైన యప్పటి చల్లపల్లి రాజుగా రాంధ్రనాయకస్వామి యాలయ మును బాగుచేయించిరని తెలియుచున్నది. ఈ శతకమునందలి కవిత్వము సులభ జాతీయోక్తులతోఁ గూడి, ధారాశుద్ధి శోభితమై, మిక్కిలి హృద్యముగా నుండును. ఈ పురుషోత్తమ కవియే మానసబోధశతకము, హంసలదీవి గోపాలశతకము, భక్తకల్పద్రుమ శతకము అను నితర శతక ములను గూడ రచించెను.

వేంకటాచల విహార శతకము, మట్టపల్లి నృసింహశతకము అను నవి కూడ నిట్లే యవి రచింపఁబడిన కాలము నందలి దేశ రాజకీయ పరిస్థితులను వ్యక్తము చేయుచున్నవి.

## తత్త్వ శతకములు

ఉపనిషదాదు లందు నిరూపింపఁబడిన తత్త్వవిషయములు పండిత జనైక వేద్యములై సామాన్యులకు దుర్బోధము లగుటచేఁ గొందఱు కవు లా గూఢవేదాంత విషయములనే చక్కని తేట తెలుఁగుమాటలతో శతకరూపమున వెల్లడించియున్నారు. ఇవి సర్వజన సుబోధములైన సామెతలతోడను, లోకోక్తులతోడను గూడి యతిక్లిష్టములైన తత్త్వ విషయములను సైత మరటిపండొల్చి పెట్టినట్లు సులభగ్రాహ్యముల నొనరించుచున్నవి. భక్తిరసమయములైన శతకము లన్నింట నెడనెడ

నాధ్యాత్మిక విషయములు కూడ వివరింపఁబడుచునే యుండును. శ్రీ కాళ హస్తీశ్వర, దాశరధిశతకము లిందుకుఁదాహరణములు. తత్త్వశతకములు కూడ నట్లే ప్రధానముగాఁ దత్త్వవిషయములనే ప్రపంచించినను భక్తిరసభరితములై కూడ నుండును. అవి జగన్మిథ్యాత్వమును, ఆత్మనిత్యత్వమును బోధించుచుఁ బఠితల నాత్మచింతా పరాయణుల నొనరించును. ఆంధ్రమున నిట్టి శతకములు పెక్కు గలవు. వానిలో నారాయణ శతకము ప్రాచీనమైనది. ఇది గేయరూపమై, భగవద్గీతాదు లందు నిక్షిప్తములైన యద్వైత రహస్యములను దేట తెనుఁగు మాటలతో వ్యక్తము చేయుచున్నది. దీని నెవ్వరు రచించిరో తెలియదు.

తోట వేంకటనరసింహ కవి రచించిన రామరామశతకము కూడ నారాయణ శతకమువలెనే గేయ రూపమున నున్నది. ఇందు నూటాఱు చరణము లున్నవి. ఇది సాంఖ్య శాస్త్రానుగుణముగ రచింపఁబడినది. ఇందు పిండోత్పత్తి విధము, పంచీకరణ విధానము, ముద్రాయోగాదికములు మృదుమధురమైన భాషలోఁ బామరులకుఁ గూడ విశదమగు నట్లు వర్ణింపఁబడినవి

పరమానంద యతీంద్రుఁడు శివముకుంద శతకము, సంపగిమన్న శతకము, దత్తాత్రేయ శతకము మున్నగు శతకములు రచించెను. శివముకుంద శతకము శివముకుంద పరమానందా ! అను మకుటముతోఁ గూడి కందపద్యములలో రచింపఁబడినది. ఇందు హరిహరాద్వైతము నిరూపింపఁబడినది. సగుణ నిర్గుణ స్వరూపము, మాయ, ప్రకృతి మున్నగునవి యిందు వివరింపఁబడినవి. సంపగిమన్న శతకము కూడఁ గందపద్యమయ మైనదే. సంపగిమన్నా యనున దిందలి మకుటము. ఈ సంపగిమన్నఁ డెవ్వరో తెలియదు. ఇది యద్వైత సంప్రదాయాను సారముగ రచింపఁబడినది. ఇందు యోగాభ్యాసము మోక్షప్రాప్తికి ముఖ్యసాధన మనియు, దానిని విడిచి, వాదోపవాదములు చేయుచు మూఢములయిన యాచారము లవలంబించుటవలన లాభము లేదనియు,

ధూర్తులైన గురువుల నాశ్రయించుట పతనమునకు హేతు వగుననియు కవి ముముక్షువులను మందలించి యున్నాఁడు. వేదాంత విషయ వివరణమునందు వలెనే కవితా విషయమునఁ గూడ నీ శతకము మిక్కిలి ప్రౌఢమైయున్నది.

సదానందయోగి "నవ్యతరభోగి శ్రీ సదానందయోగి" యను మకుటముతో తేటగీతి పద్యములలో సదానందయోగి శతకమును రచించెను. ఇది వేమన పద్యములవలెనే దురాచారములను, యోగి ఋషుల కపట దంభములను, గులీనుల యౌద్ధత్యమును ఖండించుచున్నది. వేమన పద్యములందువలెనే యిందును నెడనెడ వ్యాకరణస్ఖాలిత్యములు గోచరించుచున్నవి. కాని యిందలి శైలి యందలి దానికంటెఁ ప్రౌఢ తరముగా నున్నది.

తాడేపల్లి పానకాలరాయకవి (క్రీ. శ. 18 వ శతాబ్ది) మానస బోధ, చిత్తబోధ శతకములు రచించెను. ఇవి రెండును భక్తి వైరాగ్య భావబంధురములై యున్నవి, కవి యొసంగిన పెక్కు దృష్టాంతము లతని లోకానుభవమును జాటుచు, నతని భావములను సర్వజన సుబోధములు కావించుచున్నవి. "మనసా ! హరిపాదము లాశ్రయింపుమా" యనునది. మానసబోధశతకము నందలి మకుటము.

వేమనయోగి రచించిన పద్యములలోఁ గూడఁ దత్త్వబోధకము లైనవి" చాలఁ గలవు. ఆతఁడు రచించిన పెక్కు పద్యములలోఁ బైకి సువ్యక్తములు కాకున్నను, గూఢములైన వేదాంత రహస్యములును ధాతువాద రసవాద సిద్ధాంతమును ఇమిడియున్నవని విమర్శకులు చెప్పుదురు. తత్త్వసంబంధులయిన పారిభాషికపదముల కాతఁడు కొన్ని చోట్ల స్వకల్పితములైన క్రొత్త పదములు వాడియుండుటచే నతని పద్యములు కొన్ని సులభపదఘటితములే యయ్యు దురవగాహములుగా నున్నవి. ఇట్లే తత్త్వప్రధానములైన శతకములు రచించినవా రింకను

బహువురు గలరు. విస్తర భీతిచే నిందు ప్రధానులుమాత్రమే పేర్కొనఁబడియున్నారు.

భాషావిషయమున శతకములలోఁ గొంత స్వాతంత్ర్యము గోచరించుమాట సత్యమే యైనను అవి ధారాశుద్ధిశోభితములును, సహజభావపూరితములునై, చదువరుల కానందముతోపాటు విజ్ఞాన వివేకములను గూడఁ గలిగింప దక్షములై యుండును. వానియందుఁ బాండిత్య ప్రకర్షకంటె స్వచ్ఛందమైన కవితా సంపదయే యెక్కువగా గోచరించును. పూర్వము బాల బాలికలచేఁ బ్రసిద్ధములైన శతకములు చదివించుట పరిపాటిగా నుండెను. అది వారి భాషాభావ వికాసముల కెన్నియో విధములఁ దోడ్పడుచుండెను, ఇప్పుడు శతకపఠనము చాలవఱకు పేక్షింపఁబడుట శోచనీయము.

# ఆంధ్రవాఙ్మయ చరిత్రము

## జానపద గేయ వాఙ్మయము

జనపదమనగా దేశవిభాగము లేక గ్రామము. జానపదమన్నను ఇదే అర్థము. అందుండు జనులకు జానపదులని పేరు. "జానపదుల్ పురీజను"లని ఎఱ్ఱన జానపద శబ్దమును గ్రామవాసులు లేక పల్లెప్రజలు అను నర్థమున వాడి యున్నాడు. జానపదులందు ప్రచారమున నుండు వాఙ్మయము జానపద వాఙ్మయము. ఏ దేశమందైనను గద్యము కంటె పద్యమే ముం దుద్భవించుననియు, పద్యములలో కూడ పదమే ముందు పుట్టుననియు విజ్ఞుల అభిప్రాయము. సంతోషవిషాదాది భావముల కుద్రేకము కలుగునపు డవి లయాన్వితమైన భాషలోనే వెలువడుట సహజమని విమర్శకులు చెప్పుచున్నారు. విద్యావివేకములు లేని యాటవికులు సైతమట్టి యెడ పదమునో పాటనో పాడుచుందు రన నాగరికుల విషయము వేఱుగాఁ జెప్పనవసరము లేదు.

జానపద వాఙ్మయము గేయరూపమును, అజ్ఞాత కాల కర్తృకమును, కామచార ప్రవృత్తియు, మౌఖిక ప్రచారమును, స్థానిక పరిచిత వస్తుకమును, వ్యావహారిక భాషా ప్రయుక్తమును, సహజ నిరాడంబర శైలీ సంపన్నమునునై యుండును. ఇది సాధారణముగా నాశురచనయై పదవాక్య పునరుక్తులతో నొప్పుచుండును. ఇది యొక్కొక్కప్పుడు బహుకర్తృకమై యుండుటయు సంభవించును. జానపద కవితయే కొన్ని మార్పులను పొంది దేశికవితగాఁ బరిణమించునని భావింపవచ్చును.

ఆంధ్రభాష సుస్థిరరూపము దాల్చినప్పటి నుండియు (అనగా క్రీ. శ. 6,7 శతాబ్దులనుండియు) జానపద గేయములు వెలువడియుండును. ఇవి మాత్రాచ్ఛందమునకు చెందియుండును. ప్రాఙ్నన్నయ యుగము

నందలి శాసనములలో నిట్టి రచనలు కొన్ని కానవచ్చుచున్నవి. నన్నయ సీసము, గీతము, మధ్యాక్కర, తరువోజ, మున్నగు వానిని వాడి యుండెను. నన్నెచోడుడు కుమార సంభవమున గౌడు గీతములు, రోకటి పాటలు, అంకమాలికలు మొదలైన దేశిరచనలను పేర్కొనెను. పాల్కురికి సోమనాథుడు తాను బసవ పురాణమును "ఆతత బసవ పురాతన భక్త గీతార్థసమితియే మాతృక గాఁగ" రచించినట్లు చెప్పుటయే కాక పండితారాధ్య చరిత్రమున తుమ్మెద పదములు, పర్వత పదములు, ఆనంద పదములు, వాలేశు పదములు, వెన్నెల పదములు, నివాళి పదములు, రోకటి పాటలు మున్నగు వానిని పేర్కొనియున్నాడు. నాచన సోముని వసంత విలాసమందలి గేయమొకటి లాక్షణికులచే నుదాహరింపఁ బడినది. శ్రీనాథుడు యక్షగానములను, జాదురలను (జాజర పాటలను) పేర్కొని యుండెను. క్రీడాభిరామమున ఒక వనిత వీరానీకమును గూర్చి పాడు ద్విపద ప్రబంధము యొక్కయు, బవనీల చక్రవర్తి పాడు పరశురాముని కథల యొక్కయు, జక్కులపురంధ్రి పాడు కామవల్లీ మహాలక్ష్మి కైటభారుల వలపు పాట యొక్కయు ప్రసక్తి కలదు. కొఱవి గోపరాజు వెన్నెలగుడి పాటను పేర్కొనెను. తాళ్లపాక అన్నమాచార్యులు తన నాటి జానపద గేయముల మాదిరుల నన్నిటిని తన సంకీర్తనలం దనుకరించి యుండెను. చిన తిరుమలాచార్యుడు కొన్ని పదములను వ్రాయుటే కాక ఏలలు, అర్ధ చంద్రికలు, చందమామ పదములు, గొబ్బిళ్లు మున్నగు వాని లక్షణములను వివరించుచు సంకీర్తన లక్షణమను గ్రంథమును కూడ రచించెను. దామెర్ల వెంగళ భూపాలుడు, పాలవేకరి కదిరీ పతి, మున్నగు కవులు తమ కావ్యములలో పెక్కు పద గేయ భేదములను పేర్కొనిరి. దక్షిణాంధ్ర యుగమున తండోప తండముగా వెలసిన యక్షగానములలో జానపద గేయముల వంటి దేశిరచనలు, దరువులు, రగడలు, కీర్తనలు పెక్కు వ్రాయబడినవి. రామదాసు కీర్తనల కాంధ్ర దేశమున బహుళ ప్రచారమున్నది. క్షేత్రయ్య, త్యాగయ్య వ్రాసిన పదములు, కీర్తనలు

మహోదాత్తములై కర్ణాటక సంగీతము కోరువారి కెల్ల కర్ణాభరణము లైనవి. రుద్రకవి, పాపరాజు, బాలసరస్వతి, కూర్మనాథకవి మున్నగు పండిత కవులుకూడ యక్షగానములు, గేయములు రచించి జానపద కవిత నాదరించిరి. జానపద గేయఫణితు లెన్నో యథాతథముగనో ఇంచుక రూపాంతరము దాల్చియో ఆధునిక రచనలలో గోచరించు చున్నవి.

జానపద వాఙ్మయము ప్రధానముగా మౌఖిక ప్రచారము మూలముననే సాగివచ్చున దగుటచే నందలి విస్తార భాగము నష్టమైపోయినది. ఇటీవల కొన్ని రచనలు ముద్రితములైనవి కాని, వాని సంఖ్య చాల తక్కువ. పెక్కు రచనలింకను తాళపత్ర గ్రంథములందును, జానపదుల ముఖములందును మాత్రమే యుండి పోయినవి. తొలుత నీ జానపద గేయ వాఙ్మయమును గూర్చి లోకమునకు పరిచయము కలిగించిన వారు బ్రౌను దొరగారు. తరువాత జె. ఏ. బాయిల్ దొరగారు కొన్ని జానపదగేయములను సేకరించిరి. ఆధునిక కాలమున జానపద గేయములను సేకరించుటకును, ప్రచురించుటకును, వానియందలి యందచందములను వెలువరించుటకును ప్రయత్నములు విరివిగా జరుగుచున్నవి.

వస్తు రసాది భేదములను బట్టి జానపద గేయముల నీ క్రింది విధముగా విభజింప వచ్చును.

I. పౌరాణిక గేయములు:-రామాయణ భారతములు, భాగవతాది పురాణములు మున్నగు వానియందలి కథలును, కథాభాగములును వస్తువులుగాఁ గల పౌరాణిక గేయము లసంఖ్యాకములుగా నున్నవి. సంస్కృత మూలములందుఁ గానరాని వృత్తాంతములు కూడఁ గొన్ని జానపద గేయములందుఁ గానవచ్చు చున్నవి. వీనిలోఁ గొన్నిటిని సంస్కృత మూలముల ననువదించు నప్పుడు ఆంధ్ర మహాకవులు తమ యనువాదములలోఁ జేర్చి యుండిరనుటకును అవకాశము కలదు. ఇది జానపద

గేయములందలి కథాకల్పన రామణీయమునకుఁ దార్కాణము. రామాయణ కథా వస్తుకములైన గేయ కావ్యములలో కూచకొండ రామాయణము, ధర్మపురి రామాయణము, శారద రామాయణము, మోతుగుండ రామాయణము, చిట్టి రామాయణము, రామాయణపు గొబ్బిపాట, అడవి, శాంత, సేతు, గోవింద నామములు మొదలైనవి ముఖ్యములైనవి. శాంతాకల్యాణము, పుత్రికామేష్టి, కౌసల్యాబైకలు, సుందరకాండ పదము, సుగ్రీవ విజయము, అంగదు రాయబారము, లక్ష్మణ మూర్ఛ, లంకా యాగము, రామ పట్టాభిషేకము, లక్ష్మణదేవరనవ్వు, ఊర్మిళాదేవి నిద్ర, కుశలవ యుద్ధము, పాతాళ హోమము మున్నగునవి రామాయణ కథైకదేశ వస్తుకములైనట్టివి. సీతా కల్యాణము, సీత సమర్త, సీత వామన గుంటలు, సీత వసంతము, సీత సురటి, సీత అగ్ని పరివేశము, సీతమ్మ చెర, మాయలేడి పాట మున్నగునవి సీతా పాత్ర ప్రాధాన్యము కల గేయములు.

నలచరిత్ర, దేవయాని చరిత్ర, సుభద్రా కల్యాణము, పండుపాట, ధర్మరాజు జూదము, విరాటపర్వము పద్మవ్యూహము, విశ్వరూపము, భగవద్గీత, శశిరేఖా పరిణయము, గయోపాఖ్యానము, ఉత్తర దక్షిణ గోగ్రహణములు మొదలైనవి భారత కథకు సంబంధించిన గేయములు. ఇందుఁ గొన్ని సుదీర్ఘములైనట్టివి.

ఇట్లే భాగవతమునకును ఇతరపురాణములను సంబంధించిన గేయము లెన్నో యున్నవి. ఇందు ప్రహ్లాద చరిత్ర పదము, వామన విజయము, గజేంద్రమోక్షము, శ్రీకృష్ణ జననము, బాలకృష్ణ లీలలు, గోపికా జలక్రీడలు, రుక్మిణీ కల్యాణము, పారిజాత పల్లవి, ఉషా స్వప్నము, భ్రమరగీతము, కుచేలోపాఖ్యానము మొదలైనవి భాగవతమునకు సంబంధించినవి. ఇతర పురాణములకు సంబంధించిన గేయములలో సత్య హరిశ్చంద్ర, గోవుపాట, దక్ష యజ్ఞము, గంగాగౌరీ సంవాదము, లక్ష్మీ

పార్వతీ సంవాదము, త్రిపురాసుర సంహారము, సురాభాండేశ్వరము, మార్కండేయ జననము, సిరియాళచరిత్రి, శ్రీరంగ మాహాత్మ్యము, దశావ తారముల పాట, వేంకటేశ్వరులవేఁట, చెంచెత కథ, వరాహావతార చరిత్రము మొదలైనవి ముఖ్యములు. వీని యన్నిటి యందును జానపదుల కితిహాస పురాణముల యెడఁ గల యాదరముతోపాటు వారి కథా కల్పన చమత్కారమును, చిత్తప్రవృత్తులును గూడఁ దెలియవచ్చును.

II. చారిత్రక గేయములు:—వీనికే వీరగీతములని కూడ పేరు. వాస్తవముగా జరిగిన యొక వీర సంఘటనమును జూచియో వినియో భావోద్వేగము కల జానపదు డొకడు దానిని లయాన్వితముగాఁ గూర్చి గొంతెత్తి పాడును. క్రమముగా నది దేశమంతటను వ్యాప్తి చెందును. ఇట్లు వ్యాపించుటలో నొక్కొక్కప్పుడు వస్తువున నతిశయోక్తులును అసత్యములును గూడఁ బ్రవేశించుచుండును. పూర్వమే లిఖితములై స్థిరరూపములైన గేయములు సత్యశోభితములై చరిత్రి నిర్మాణమున కెంతయేని తోడ్పడును. ఈ వీరగేయము లాంధ్రుల వీర పూజాభినివేశమును జాటుచు విశిష్టమైన రచనావైఖరి కలిగి యుండును. ఇట్టి వాని సంఖ్య యనల్పము. పల్నాటి వీరుల కథలు ప్రాచీనములైనవి. పల్నాటి వీర గాథకు సంబంధించిన వివిధ గేయము లముద్రితములై యున్నవి. పిన యెల్లయను వాఁడు శ్రీనాథుని వచన పద్ధతి ననుసరించి వ్రాసిన కాటమ రాజుకథ ముద్రితమైనది. దీని కనుబంధములని చెప్పఁదగిన గేయములెన్నో కలవు. దేశింగు రాజుకథ, బొబ్బిలి రాజుకథ, బంగారు తిమ్మ రాజుకథ, ఆరెమరాఁతీల కథ, పర్వతరాజ మల్లారెడ్డి కథ మున్నగు చారిత్రిక గేయములు సర్వాంధ్ర జనపద పరిచితములైనవి. వీనిలో బొబ్బిలి రాజుకథ కున్న ప్రాచుర్య మత్యధికము. సోమనాద్రి, రామేశ్వర రావు, రాణి శంకరమ్మ, కర్నూలు నవాబు, కుమారరాముడు, సదాశివరెడ్డి సర్వాయి పాపడు, కొండఱ్రాయుఁడు మున్నగు తెలంగాణా వీరుల కథలు వర్ణించు గేయములు చాల ప్రచారము గాంచినవి.

III. పారమార్థిక గేయములు:—ఈ శాఖకు చెందిన గేయములలో భక్తి జ్ఞాన కర్మ మార్గములు మూఁడింటికిని సంబంధించిన వనేకము లున్నవి. భక్తి గేయములలోఁ గొన్ని వైష్ణవములు, కొన్ని శైవములు. శైవములైన తుమ్మెద పదములలోఁ గొన్ని యిప్పటికిని వినఁబడుచున్నవి. వైష్ణవములలో తాళ్లపాక వారు, క్షేత్రయ, త్యాగయ్య వ్రాసిన కీర్తనలు, పదములు ముఖ్యములైనవి. అధ్యాత్మ రామాయణ కీర్తనలును, రామదాసు కీర్తనలును అధిక ప్రచారము నార్జించుకొన్నవి. తూము నరసింహదాసు, పరాంకుశదాసు, ప్రకాశదాసు, వేంకటదాసు, మున్నగువారు రచించిన కీర్తనలు, రామదాసు కీర్తనల వంటివే. రామ, హరి, పాండురంగ భజన కీర్తనలును, కుసుమహరనాథ కీర్తనలును, భగవన్నామ సంకీర్తనలును పెక్కు ముద్రితము లైనవి. కొన్ని మౌఖిక ప్రచారమునందే సాగివచ్చుచున్నవి. లాలిపాటలు, మేలు కొలుపులు, కోలాటములు, మంగళ హారతులు భక్తి గేయములకుఁ జెందినవే. మంగళ హారతులు వివిధ దేవతలకు సంబంధించి యుండును. ఇందుఁ గొన్ని వర్ణన రూపములు, కొన్ని స్తుత్యాత్మకములు, కొన్ని సేవా రూపములు.

వేదాంత గేయములను తత్త్వము లని కూడఁ బిల్చుచుందురు. ఇందు తత్త్వము ప్రాధాన్యము వహించి యుండుటయే యిందుకుఁ గారణము. ఈ తత్త్వములలో నద్వైత వేదాంత రూపములైన వాని సంఖ్య హెచ్చు. ఏగంటివారు, వీరబ్రహ్మము, వేమన, ఎడ్ల రామదాసు, పరశురామ పంతుల లింగమూర్తి మున్నగు వారు వ్రాసిన తత్త్వము లెన్నో ప్రచారమున నున్నవి. వీనిలో రాజయోగము, అచల వేదాంతము, వైరాగ్యము, గురుభక్తి, అహింస, నీతి మొదలైనవి ప్రతిపాదింపఁబడి యుండును. నారాయణ శతకము, రామరామ శతకము, కాలజ్ఞాన తత్త్వములు, తారకామృత సారము, సీతపాట మున్నగునవి ముద్రితము లైనవి.

వ్రతములు, నోములు, కర్మకాండము మున్నగు వానిని వర్ణించు గేయములును పెక్కు గలవు. ఇందధిక సంఖ్యాకములు స్త్రీల పాటల

రూపమున నున్నవి. స్త్రీ శూద్రాదులందఱికిని పూజాధికారము కలిగించుటయే వీని ముఖ్య ప్రయోజనము. వరలక్ష్మి వ్రతము, తులసినోము, లక్షవత్తులనోము, శ్రావణ మంగళ శుక్రవారముల నోములు, మోచేటి పద్మమునోము, మదనద్వాదశ వ్రతము మున్నగు వానికి సంబంధించిన పాటలు బహుళ ప్రచారము పొందినవి. పోచమ్మ, మైసమ్మ, ఎల్లమ్మ, బాలమ్మ మున్నగు దేవతలకు సంబంధించిన పాటలు పల్లెలందును, శూద్రాది వర్ణములందును ఎక్కువగా వినఁబడు చుండును.

IV. స్త్రీలపాటలు:—ఇవి సాంఘిక జీవితమునకు దర్పణముల వంటివి. ఇందు భావనకంటె వాస్తవికత హెచ్చుగా నుండును. ఇవి సాధారణముగా గృహవాతావరణము నంటుకొని యందలి సుఖ దుఃఖముల వర్ణనముతో నొప్పారు చుండును. స్త్రీ గృహలక్ష్మి, మాతృమూర్తి. కొన్ని పాటలలో సంతానమునకై స్త్రీలు పడుపాట్లు, నోచెడునోములు, గొడ్రాండ్ర స్థితి వర్ణితములై యుండును. కొన్నిటిలో లాలిపాటలు జోలపాటలు కనవచ్చును. తల్లి యిందు పుత్త్రీ పుత్త్రికులకు లక్ష్మి పార్వత్యాదులయో రామకృష్ణాదులయో భావము లారోపించి యకృత్రిమమైన ప్రేమ నొల్కఁబోయు చుండును. కొన్ని పాటలు వివాహమునకు సంబంధించినవి. పెండ్లిలో జరుగు వేడుకల నన్నిటిని వర్ణించు పాటలు కలవు. బంతులపాట, బువ్వము బంతిపాట, తలుపుదగ్గర పాట, నలుగు పాట, అలకపాట, అప్పగింతుల పాట, మున్నగున విట్టివే. అత్తమామల పైని, భర్తపైని, ఆడుబిడ్డల పైని చూపవలసిన భక్తిని, వారితోడను ఇతరులతోడను మెలఁగవలసిన రీతిని, వర్ణించు పాటలు పెక్కు కలవు. అత్తలు, ఆడుబిడ్డలు పెట్టు బాధలను వర్ణించు కరుణ రసాత్మకములైన గేయములును లేకపోలేదు. ఈ విధముగా స్త్రీల పాటలలో గృహ జీవితమునకు, అందలి వేడుకలకు, వ్యథలకు సంబంధించిన గేయము లనంతముగా నున్నవి.

V. శ్రమిక గేయములు:— కార్మికులు కర్షకులు మున్నగువారు కష్టపడి పని చేయునపుడు శ్రమాపనోదనము కొఱకై యేవో కూని దీర్ఘములు తీయుచు పాటలు పాడుకొందురు. వీనిని సాధారణముగాఁ బలువురు కలసి పాడుచుందురు. చెమటోడ్చి పనిచేయు వారికిట్టి పాటలందలి భావములు, సంగీతము ఉత్సాహోల్లాసములను కలిగించు చుండును. వీనిలో వస్తువైవిధ్యము కలిగి యుండును. భక్తి, శృంగారము, విషాదము మున్నగు భావములన్నియు నిందుఁ గాననగును. ఆయా కృషి కర్మలకు సంబంధించిన పాటలును కొన్ని కలవు. ఊడ్పుపాట, కోతపాట మున్నగు పొలము పాట లిట్టివే. బరువు పని చేయువారి పాటలు కొన్ని బూతుల బుంగలై యుండును. ఇట్టి పాటలు ఘుమఘుమా పాటలను పేరఁ గొన్ని ప్రకటింపఁబడి యున్నవి,

VI. బాల గేయములు:—వీనిని బాలబాలికలకై పెద్దలు రచించినవి, బాల బాలికలే కల్పించినవి అని రెండు విధములుగా విభజింప వచ్చును. పెద్దలు పిల్లలను లాలించుటకును నిద్రపుచ్చుటకును కొన్ని పాటలు పాడుదురు. వీనికి నర్సరీరైమ్సని పేరు, లాలి పాటలు, జోల పాటలు ఇట్టివే. బాల బాలిక లిందలి ధ్వని సంగీతముల చేతనే ఆకర్షింపఁబడి రోదనము మాని ఆనందమున నిద్రపోవుదురు, ఇట్లు కాక బాల బాలికల కర్థమగునట్లు వింత కథలనో, మనోహర విషయములనో వర్ణించుచు పెద్దలు రచించు గేయములు పెక్కు కలవు. నాలుగైదేండ్లు వచ్చిన తరువాత మాటలు బాగుగా నేర్చిన పిల్లలు పెద్దల పాటల ననుకరించుచు ఏదో యొక లయతో పాటలు పాడ నారంభింతురు. ఇందర్థ భావముల కంటె నుత్సాహోల్లాసములు కలిగించు లయకే ప్రాధాన్యము. ఆంగ్లమున వీనిని నాన్సెన్సు రైమ్సందురు. ఇంక బాల బాలిక లాడుకొను పలువిధములైన ఆటలకు సంబంధించిన పాట లనేకము లున్నవి. చెమ్మచెక్క, గుడుగుడు గుంచం, బుజబుజ రేకులు, కోతి కొమ్మచ్చి, కాళ్లగజ్జి, గొబ్బిళ్లు మున్నగు పాటలు మన మిప్పుడును వినుచునే యుందుము. ఈ

పాటలలో వైద్యాది శాస్త్ర రహస్యము లిమిడి యున్నవని విజ్ఞులు చెప్పుదురు.

VII. శృంగార గేయములు:—ఉదాత్త వాఙ్మయమున వలెనే జానపద వాఙ్మయమునఁ గూడ వివిధ రసపోషణముతోఁ గూడిన రచన లున్నవి. అందును శృంగారరస ప్రధానములైన వనేకములు. సీతాదేవి అలుక, సీతాదేవి వేవిళ్లు, ఊర్మిళాదేవి నిద్ర మున్నగు వానిలో సభ్యమైన శృంగారము కాననగును. సుందరకాండ-పదమున వియోగ శృంగారము రమ్యముగాఁ బోషింపఁబడినది. శశిరేఖా పరిణయము, నలచరిత్రఁ, సుభద్రా కల్యాణము మున్నగు భారత సంబంధి గేయములు శృంగార రస పూరితములు. సన్యాసమ్మ, లక్ష్మమ్మ, ఎరుకల నాంచారి, వీర రాజమ్మ మున్నగు గేయములందు జానపదులకు సంబంధించిన ఉత్తమ శృంగారము వర్ణింపఁబడినది. దేశింగు రాజుకథ, బొబ్బిలి రాజుకథ మున్నగు గేయములు వీరరసాల వాలములు. సురాభాండేశ్వరమున పరకీయ శృంగారము వర్ణింపఁబడినది, ఇవిగాక శృంగార ప్రధానములైన చల్ మోహనరంగ సిరి సిరి మువ్వ, నారాయణమ్మ మున్నగు పెద్ద పాటలు కాముని పున్నమ పాటలవంటి చిన్న పాటలు అసంఖ్యాకములుగా నున్నవి. మొత్తము మీద జానపద శృంగార గేయములలో నాయా పాత్రల కనుగుణము లైన భావములు కాక జానపదులకు సంబంధించిన భావములే ఎక్కువగాఁ గాననగును. అందు జీవితము సహజ సుందరముగాఁ గన్పట్టును, ఔచిత్య దృష్టి తక్కువగా నుండును. ఇది బాహుళ్య దృష్టితోఁ జెప్పినమాట.

VIII. అద్భుత రసగేయములు:—జానపదుల కద్భుతరసముపైఁ బ్రీతి మెండు. తద్రసపోషణముద్వారా సమాజమున భయభక్తులను బెంపొందింప వలెనని వారికోరిక. పెక్కు గేయములలో మానవాతీత శక్తులు కల దేవతలు, మంత్రదండము, భూత అద్దము. పావకోళ్ళు మున్నగు వానికిఁ బ్రవేశముండును. అద్భుతరస ప్రధానములైన గేయములలో బాలనాగమ్మ కథ అత్యంత ప్రచారము కలది, గాంధారికథ, కాంభోజరాజుకథ, బాల

రాజుకథ, ధర్మాంగద పాముపాట మున్నగునవి, అద్భుతరసమునకే కాక నీతిబోధకును నిలయములైనట్టివి.

IX కరుణరస గేయములు:—ఈ శాఖకుఁ జెందిన గేయములలో స్త్రీలకు సంబంధించినవి హెచ్చు. అత్తలు కలిగించు ఆరటము, తోడికోడండ్ర అసూయ, భర్తల కాఠిన్యము మున్నగు వానికి గుఱియై పలుపాట్లు పడిన పడఁతుల చరిత్రలను వర్ణించు గేయములెన్నో కలవు. ఇందు విషాదము తోపాటాయాయిల్లాండ్ర మాహాత్మ్యము కూడఁ గొంత జతపఱుపఁబడి యుండును. కామమ్మకథ, లక్ష్మమ్మకథ, సన్యాసమ్మకథ, పాపమ్మకథ, ఎరుకమ్మకథ, వీరరాజమ్మకథ, తమిళదేశము నుండి వచ్చిన నల్లతంగాళ్ కథ మున్నగునవి కరుణరసాత్మక గేయములలో ముఖ్యములైనవి. పైకథలు పెక్కింటిలోఁ గథానాయికలు అపూర్వమైన సహనము, త్యాగము ప్రదర్శించి సహగమనము చేసినట్లు వర్ణింపఁబడి యుండుటచే నవి పాషాణహృదయులకు సైతము పరమ విషాదము కలిగింపఁ జాలియుండును.

X. హాస్యరస గేయములు:—జానపద గేయములం దెడ నెడ మోటైన హాస్యము తోపాటు మృదువైన మనోహర హాస్యము కూడఁ జక్కగాఁ జిత్రింపఁబడినది. ఈ హాస్యమునఁ గొంత పదసంబంధి; కొంత యాకార వికారసంబంధి; కొంత సంఘటన వైచిత్ర్యసంబంధి. గంగా గౌరీ సంవాదము, సీతా శాంతా సంభాషణము, లక్ష్మీ పార్వతీ సంవాదము, కృష్ణ చెంచులక్ష్మి సంవాదము మున్నగువానిలోఁ బదసంబంధి హాస్యమును, శశిరేఖాపరిణయమున సంఘటన వైచిత్రికి సంబంధించిన హాస్యమును, పల్నాటి వీరచరిత్రమున వేశ్యామాతను, అడవి గోవిందనామములందు కుంభకర్ణుని వర్ణించుపట్ల ఆకార వికారసంబంధి హాస్యమును గాన వచ్చును. పెండ్లి పాటలలో వివిధమైన హాస్యరసము గోచరించును. ఈ గేయములందలి హాస్యము కొంత మోటైనను జాతీయమై జానపదుల కానందావహమై యొప్పుచుండును.

జానపద గేయములందలి ఛందోరీతు లన్నియు మాత్రాగణ బద్ధములే. ఛందో విషయమునఁ గొన్ని తమిళ కర్ణాటక రీతులకును ఆంధ్రగేయ రీతులకును సన్నిహిత సాదృశ్యము కనిపించును. అనంతముగాఁ గనవచ్చు జానపద గేయములందలి ఛందోరీతులలోఁ గొన్నిటిని మాత్రమే గ్రహించి, కొంత కొంత సవరించి, దేశికవులు వాడుకొనిరనియు, వానిలోఁ గొన్నిటికి మాత్రమే లాక్షణికులు లక్షణము వివరించిరనియు భావింపవచ్చును. ఇందు మూఁడు మొదలెనిమిది వఱకు మాత్రల ఆ వృత్తియు, త్రిశ్ర, చతురశ్ర, ఖండ, మిశ్ర గతులును గనిపించును. బొబ్బిలి రాజుకథ, దేశింగురాజుకథ మున్నగువాని యందు నాలుగు మాత్రల యావృత్తి తోడను, ఏలపాటలందాఱు మాత్రల యావృత్తి తోడను, రామదాసు కీర్తనలం దెనిమిది మాత్రల యావృత్తి తోడను, గేయములు నడచినవి. గుమ్మడేడే గోపిదేవి అనుపాట సప్తమాత్రా వృత్తితోఁ గూడి ముత్యాలసరముల రీతికి మూలమైనది.

జానపద గేయము లపండిత జనోదితము లైనను వానిలో నెడనెడ రమ్యములైన భావములు, వీనుల విందుచేకూర్చు పలుకు బళ్ళు, జాతీయ పద ప్రయోగము, ఆనంద ప్రదమైన రసపోషణము కానవచ్చుచుండును. ఇవి యిటీవల రాజకీయ భావములను సంస్కరణ భావములను ప్రచారము చేసి సామాన్య జనులలోఁ జైతన్యోదయము కలిగించుట యందెంతో తోడ్పడినవి. జానపద గేయములందుఁ జాల భాగ మముద్రితమై యే యుండి పోయినది. ఆధునికులు కొందఱు వానిని సేకరించి ముద్రించుటకు యత్నించుచున్నారు. సహజ నిర్మల భావసంపన్నములును, జాతీయ పద ప్రయోగ శోభితములును నగు నవి యన్నియు సక్రమముగా ముద్రింపఁబడుచో సారస్వత లక్ష్మి కమూల్యాలంకారములై సొంపు చేకూర్చుననుటలో సందేహము లేదు.

# ఆంధ్రవాఙ్మయ చరిత్రము

## నాటకములు

ఆంధ్రవాఙ్మయమును బరిశీలింపఁగనే యందు గత శతాబ్ది మధ్య భాగము వఱకును నాటకములు వెలువడకుండుట కొంత వింతగాఁ దోఁచును. పూర్వాంధ్రకవులు సర్వసాహిత్యప్రక్రియలందును సంస్కృత కవులనే యనుసరించినవా రయ్యును, "కావ్యేషు నాటకం రమ్య" మ్మను నుడి యందలి యాథార్థ్య మెఱింగినవా రయ్యును, నేలొకో స్వతంత్ర నాటక రచనకుఁ గాని, సంస్కృతనాటకాంధ్రీకరణమునకుఁ గాని పూని యుండలేదు.

భట్టుమూర్తి తన నరసభూపాలీయమున సంస్కృతము నందలి ప్రతాపరుద్రీయములోని లక్షణములనే యనువదించుచు నందలి నాటక లక్షణ ప్రకరణమును విడిచివేసెను. భీమన, పెద్దనాదులు రూపక లక్షణము జోలికే పోయియుండలేదు. చిత్రకవి పెద్దన యొక్కఁడు మాత్రమే తెలుఁగులో నాటకలక్షణములను గొంతవఱకు వివరించి యుండెను. శ్రవ్యకావ్యములలో సైతము నాటకోచిత సన్నివేశములు కల్పించి, సమర్థతతో నిర్వహింపఁజాలిన తిక్కనాదులు నాటకరచన కుద్యమింపకపోవుటయు, సంస్కృతనాటకము లందలి రామణీయకముచే నాకర్షింపఁబడి వానిలోఁ గొన్నిటి నాంధ్రీకరించు నుద్దేశముకలవా రయ్యును మంచన, పినవీరభద్ర, నంది మల్లన, ఘంట సింగనలు వానిని నాటకములుగాఁ గాక ప్రబంధములుగా సంతరించుటయు, సంస్కృత నాటక రచన సన్నగిల్లినను గొంద ఱాంధ్రపండితులు సంస్కృతము లోనే నాటకములు వ్రాసియుండుటయుఁ జూడ నప్పుడు తెలుఁగున నాటకములు రచించుట కేవో కొన్ని యాటంకము లుండినట్లు కాని పించును. సంస్కృతనాటకములలోఁ గానవచ్చు పాత్రానుగుణ భాషా

ప్రయోగము తెలుఁగున నప్పుడు సాధ్యముకాకపోవుటయు, లాక్షణికు లెవ్వరును రూపక లక్షణములను వివరింపకపోవుటయు, నాటక ప్రదర్శన మునకుఁదగిన రంగపరికరాదులు లేకపోవుటయు, నటులు సంఘబాహ్యు లుగాఁ బరిగణింపఁబడుటయు, నందుకుఁ గారణములై యుండు నని యూహింపవచ్చును. పైఁగా నన్నయ కాలము నుండియు నేవో దృశ్య కావ్యములు నాటకములు లనుపేర రచింపఁబడుచు, నుత్సవయాత్రా సందర్భములఁ బ్రదర్శింపఁబడు చుండె నని పాల్కురికి సోమనాథుఁడు పండితారాధ్య చరిత్రలోఁ గావించిన వర్ణనలనుబట్టి తెలియుచున్నది. ఆ నాటకములు బహుశః యక్షగానములవంటి దేశి రచనలై యుండును. వానితోడనే యప్పటి కవులును, ప్రజలును సంతృప్తి నందుచుండి రన వచ్చును. వినుకొండ వల్లభరాయని పేరఁ బరఁగుచున్న క్రీడాభిరామ మునకు వీథినాటక మను నామాంతర మున్నది. ఇది కవిసార్వభౌముఁ డైన శ్రీనాథుఁడు రచించి వల్లభరాయని పేరఁ బ్రకటించియుండు నని కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రి గారు నిరూపించియున్నారు. వీథి దశ రూపక భేదములలో నొకటి. క్రీడాభిరామమున నీ వీథీలక్షణములు కొంత వఱకుఁ గానవచ్చుచున్నవి. ఇది యొక్కటితప్ప సంస్కృత లక్షణాను గుణముగా వ్రాయఁబడిన రూపకములు మఱెవ్వియుఁ గానరావు.

అల్లసాని పెద్దన మనుచరిత్రలో స్వరోచి పురప్రవేశసందర్భమున "చిలుకలకొల్కి కల్కి యొక చేడియ నాటకశాల మేడపై నిలువున నిల్చి" యని నాటకశాలా పదమును వాడియుండుటచే నా రోజులలో నాటకశాల లుండెనేమో యను సందేహ ముదయించుచున్నది. ఆ నాటకశాలలలో సంస్కృత నాటకములే ప్రదర్శింపఁబడుచుండెనో, తెలుఁగు నాటకములే ప్రదర్శింపఁబడుచుండెనో, లేక భరతనాట్య నృత్య ప్రదర్శనములే జరుగుచుండెనో చెప్పుట కాధారములు లేవు. క్రీడాభి రామము నందును, కొన్ని చాటువు లందును, బూర్వ ముండిన నటీ నటుల ప్రశంస కానఁబడుచున్నది.

దక్షిణాంధ్రయుగమున మధుర, తంజావూరు నాయకుల పోషణమున నసంఖ్యాకములగు యక్షగానములు రచింపఁబడినవి. వాని కప్పుడుండిన యాదరణమునుబట్టి పండితకవులుసైత మట్టి రచనలుచేయఁ దొడంగిరి. వానిలోఁ గొన్నిటికి నాటకము అను పేరు కూడఁ గనఁబడుచున్నది. కాని యవేమియు సంస్కృత రూపక లక్షణానుగుణముగా రచింపఁబడినవి కావు. అవి దరువులు, ఏలలు, పదములు మున్నగు దేశి రచనలతోఁ గూడిన దేశీయనాటక భేదములు. మనమిప్పు డాంధ్రమునఁ గాంచుచున్న నాటకములు సంస్కృతాంగ్ల నాటకముల యనుకృతులే కాని యీ యక్షగానముల నుండి పరిణమించినవి కావు. ఎలకూచి బాలసరస్వతి, కుందుర్తి వేంకటాచలపతి మున్నగువారు కొన్ని నాటకములు రచించినట్లు తెలియుచున్నది కాని యవి లభ్యమానములు కామిచే వాని స్వరూపమును నిర్ణయించుటకు వీలులేకున్నది. బహుశః అవియు యక్షగానభేదములే యై యుండవచ్చును.

క్రీ. శ. 19 వ శతాబ్ది యుత్తరార్ధమున ధార్వాడ నాటక సమాజమువారు భారతదేశము నందలి పలుప్రాంతముల కేగి హిందీనాటకములను బ్రదర్శింప నారంభించిరి. ఆంధ్రదేశమున నా నాటకములు సహస్రములకొలఁది సామాజికుల నాకర్షించుచుండెడివి. అది చూచి యాంధ్రదేశము నందలి కొందఱు పండితులు తెలుఁగునఁ గూడ నాటకములు రచించి, ప్రదర్శింపఁజేయవలె నని సంకల్పించి ఆంగ్ల సంస్కృత నాటకముల నాంధ్రీకరించుటకును, వానిని బోలిన స్వతంత్రనాటకములు రచించుటకును బూనుకొనిరి. వారు నాటకరచనతో మాత్రము తృప్తిపడి యూరకుండక నాటక సమాజములు స్థాపించి, స్వరచిత నాటకములను వానిచేఁ బ్రదర్శింపఁజేయుచుండిరి. ఈ విధముగాఁ బ్రతిపట్టణమునందును రెండు మూఁడు నాటక సమాజములు బయలుదేఱి యేవో నాటకములను బ్రదర్శించుటయుఁ, దద్ద్వారా జనులయందు నాటక కళాభిరుచి బెంపొందుచుండుటయు జరుగుచుండెను. ధార్వాడ నాటక సమాజము

వారి హిందీ నాటకములే తెలుఁగు దేశమునఁ గల్గిన యీ న
వృద్ధికి హేతువు లనుటలో సందేహము లేదు.

మనకుఁ దెలిసినంతవఱకుఁ దెలుఁగున నాటకరచన
యాంధ్రపండితులలో శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రిగారు ప
చెప్పవచ్చును. వారు క్రీ. శ, 1860 ప్రాంతమున మంజరీ
మను స్వతంత్ర నాటకమును రచించి, కొంచె మించుమించు
కాలముననే వేణీ సంహార నాటకమును గూడ నాంధ్రీకరిం
భించిరి. కాని యది ముద్రితము గాలేదు. క్రీ. శ.
కొక్కొండ వేంకటరత్నంపంతులుగారు నరకాసుర విజయవ్యా
ననువదించి ప్రకటించి యుండిరి. తరువాత రెండు మూఁడేండ్ల
పట్టణమున శ్రీ పరవస్తు రంగాచార్యులుగారును, రాజమహే
మున శ్రీ వీరేశలింగము పంతులుగారును, కాళిదాసుని
శాకుంతలమును బ్రత్యేకముగా నాంధ్రీకరింప మొదలిడిరి. క్రీ.శ.
కీ. శే. వావిలాల వాసుదేవశాస్త్రిగారు షేక్స్పియరు జ
సీజరు నాంధ్రీకరించి తరువాత నాలుగైదేండ్లకు నందకరాజ
స్వతంత్ర సాంఘిక నాటకమును బ్రచురించిరి. ధార్వాడ నా
జము వచ్చి హిందీ నాటకములు బ్రదర్శించువఱకు నిం దేవియు
దేశమునఁ బ్రదర్శితములైనట్లు లేదు.

క్రీ. శ. 1881లో వీరేశలింగంపంతులుగారు శ్రీహర్షుని ర
షేక్స్పియరు కామెడి ఆఫ్ ఎర్రర్సును దెలిఁగించి కళాశాల
లచేఁ బ్రదర్శింపఁ జేసిరి. మచిలీపట్టణమున కీ. శే. నాదెళ్ళ పుర
కవిగారు సంస్కృతమయమైన హిందీ భాషలో నాటకములు
ప్రదర్శింపఁ జేయుచుండిరి. శ్రీ ఈమని లక్ష్మణస్వామిగారివంటి
మణు లందుఁ బాల్గొనుచుండిరి. గుంటూరులో కీ. శే. కొ
సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వచన నాటకములు వ్రాసి, వానిని శ్రీ
వేంకటప్పయ్య పంతులుగారు మున్నగు నటులచే బ్రదర్శింపఁజేయ

క్రీ. శ. 1883 లో కీ. శే. వడ్డాది సుబ్బారాయుడుగా రనువదించిన వేణీ సంహార నాటకము ప్రదర్శింపఁబడినది ఈ సమయముననే (1885) బళ్ళారి నగరమున శ్రీ ధర్మవరము రామకృష్ణమాచార్యులుగారును, కోలాచలం శ్రీనివాసరావుగారును క్రమముగా సరస వినోదినీ సభ, సుమనో మనోరమాసభ అను నాటకసమాజములను స్థాపించి, స్వరచితము లయిన నాటకములను వానిచే ప్రదర్శింపఁజేయుచుండిరి, రాజమహేంద్రవరమున శ్రీ ఇమ్మానేని హనుమంతరావు నాయుఁడుగారిచే స్థాపింపఁ బడిన (1889) హిందూసమాజము వారు కీ. శే. చిలకమర్తివారి నాటకములను మనోహరముగాఁ బ్రదర్శించుచుండిరి. కీ. శే. టంగుటూరి ప్రకాశం పంతులుగా రీ సమాజమున నాయికాపాత్రలు ధరించుచుండిరి.

ఈ విధముగా నీ యారంభ దినములలో నొండు రెండు స్వతంత్ర నాటకములు కూడ వెలువడినను ఆంగ్ల సంస్కృత నాటకముల యాంధ్రీకరణములే యెక్కువగాఁ గానవచ్చుచున్నవి. ఆంగ్లనాటకముల ననువదించినవారిలో శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులుగారు, వావిలాల వాసుదేవశాస్త్రిగారు ముఖ్యులు. తరువాత శ్రీ రెంటాల వేంకటసుబ్బారావుగారు, చెన్నాప్రగడ భానుమూర్తిగారు మున్నగువారు కూడఁ గొన్ని యాంగ్ల నాటకములను (ఒథెల్లో, లీయరు) దెనిఁగించి యుండిరి. సంస్కృతమునఁ గల ప్రసిద్ధ నాటకముల కన్నిటికిని ఇప్పుడు తెలుఁగునఁ బరివర్తనము లున్నవి. అభిజ్ఞాన శాకుంతలోత్తరరామ చరిత్రములు పలువురిచే ననువదింపఁబడినవి. శ్రీ వీరేశలింగంపంతులుగారు, వేదం వేంకటరాయశాస్త్రిగారు, వడ్డాది సుబ్బారాయుఁడుగారు, రాయదుర్గము వేంకట నరసయ్యగారు, కాంచనపల్లి కనకాంబగారు, దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు, మోచర్ల రామకృష్ణయ్య గారు మున్నగువారు శాకుంత లాంధ్రీకర్తలలో ముఖ్యులు. ఈ యాంధ్రీకరణము లన్నిటిలోఁ గాలమునుబట్టియే కాక గుణమునుబట్టి కూడ శ్రీ వీరేశలింగంపంతులు గారిదే యగ్రగణ్యమైనది. ఉత్తరరామచరిత్ర నాంధ్రీకరించినవారిలో

వావిలాల వాసుదేవశాస్త్రి, వేదం వేంకటరాయశాస్త్రి, జయంతి రామయ్యపంతులు, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగార్లు ప్రసిద్ధులు. ఇందు వేదమువారిది మూలానుసరణమునకును, మల్లాదివారిది ప్రసాద గుణమునకును బేరుపొందినవి. శ్రీ వడ్డాది సుబ్బారాయుఁడుగారి వేణీ సంహార నాటకానువాదము మిక్కిలి ప్రసిద్ధి నందినది. ఇటీవల శ్రీ బులుసు వేంకటేశ్వర్లుగారు కూడ దాని నందముగా నాంధ్రీకరించి యుండిరి. శ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులు ముద్రారాక్షస, మృచ్ఛకటిక, బాలరామాయణములను మధురముగాఁ బరివర్తనము కావించియుండిరి. వీరి యనువాదము లించుక స్వతంత్రములైనను మూలభావములను సమగ్రముగా వెల్లడించుట యందు సమర్థములై యుండును. శ్రీహర్షుని నాటకములను కందుకూరి వీరేశలింగంపంతులుగారును, వేదం వేంకటరాయశాస్త్రిగారును ఆంధ్రీకరించి యుండిరి. వీనిలో వేదంవారి యాంధ్రీకరణములకే ప్రచార మెక్కువ. నాగానందము ననువదించినవా రనేకను గొందఱు కలరు. వారిలో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారును, పాలెపు వేంకట సూర్యగోపాలరాయ ప్రధానిగారును, పాటిబండ మాధవశర్మగారును ముఖ్యులు. శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు భవభూతి మహావీరచరిత మాలతీమాధవములనుగూడఁ జక్కగా ననువదించి యుండిరి. దాసు శ్రీరాములు పంతులుగారి మాలతీమాధవానువాదము సరసముగా నుండును. శ్రీ వడ్డాది సుబ్బారాయుఁడు గారు ప్రబోధ చంద్రోదయము, కుందమాల, మల్లికామారుత ప్రకరణము మున్నగు వానిని గూడఁ దెనిఁగించి యుండిరి. ప్రబోధ చంద్రోదయమునకు శ్రీ వీరేశలింగంపతులుగారి యనువాదము కూడ నున్నది. భాసుని నాటకములలోఁ గొన్నిటిని శ్రీ మానపల్లి రామకృష్ణకవిగారును, కొన్నిటిని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారును, అన్నిటిని శ్రీ చిలకమర్తి కవిగారును ఆంధ్రీకరించి యుండిరి. వీనిలో శ్రీ ప్రభాకరశాస్త్రిగారి పరివర్తనలు మిక్కిలి ప్రశస్తముగా నుండును. స్వప్నవాసవదత్తమునకు

మాత్రము ప్రత్యేకముగాఁ బెక్కు పరివర్తనములు వెలసినవి. శ్రీ భువనగిరి విజయరామయ్యగా రభిజ్ఞాన శాకుంతలము, అనర్ఘ రాఘవము మున్నగు నాటకములకుఁ బరివర్తనములు ప్రకటించిరి. పైని పేర్కొనఁబడినవి కాక తాపసవత్సరాజము, కౌముదీ మహోత్సవము, రత్నేశ్వర ప్రసాదము, కర్పూరమంజరి, విద్ధసాల భంజిక, ప్రద్యుమ్నాభ్యుదయము, మున్నగు నాటకము లెన్నో యాంధ్రమునకుఁ బరివర్తనముచేయఁబడినవి.

ఆంగ్ల సంస్కృత నాటకముల తోపాటు కొన్ని వంగ, హిందీనాటకములు కూడఁ దెనుఁగున కనువదింపఁబడినవి. కీ శే. శ్రీపాద కామేశ్వరరావుగారు చంద్రగుప్త, సీత మున్నగు ద్విజేంద్రుని నాటకములను దెనిఁగించిరి. రవీంద్రుని నాటకముల నాంధ్రమునకుఁ బరివర్తనము కావించినవారు పలువురున్నారు. వారందఱిలో శాంతినికేతనమున విద్య నభ్యసించి, రవీంద్ర సారస్వత రసాస్వాద పరవశులై యా మహాకవి రచించిన కాళిదాసు, ఊర్వశి మున్నగు పద్యకావ్యముల నాంధ్రీకరించినవారును, బహుభాషాకోవిదులును, మంత్రివరేణ్యులు నయిన గౌ. డా. బెజవాడ గోపాలరెడ్డిగారు ముఖ్యులు. వీరు దేవయాని, చిత్రాంగద, ఆఱునాటికలు, విసర్జన, మాలిని, ప్రకృతి ప్రతీకారము అను రవీంద్రుని నాటకములను సరళసుందరమైన శైలిలో హృద్యముగ ననువదించి యుండిరి. రవీంద్రుని గ్రంథములను దెనిఁగించిన యితరులు సాధారణముగా నాంగ్ల పరివర్తనముల నుండియే వాని ననువదించి యుండిరి. శ్రీ గోపాలరెడ్డిగారు వంగభాష బాగుగా నభ్యసించినవారగుటచే వాని నాంగ్ల పరివర్తనముల నుండి కాక వంగమాతృకల నుండియే పరివర్తనముచేసియుండిరి. ఆంగ్ల పరివర్తనములలోఁ గొన్నిట రవీంద్రుని రచనలు సంక్షిప్తములగుట సంభవించినది. అందుచే వాని యందలి సౌందర్యమును సంపూర్ణముగాఁ జూఱఁగొనవలెనన్న వంగ మాతృకానువాదములను బఠించుటయే యుక్తము. మఱియు రవీంద్రుని

మృదుమధుర సమాస సంఘటనమును, సరళసుందరపద ప్రయోగమును ఆంధ్రులకుఁ జవిచూపు నుద్దేశముతో శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు వంగమాతృక లందలి సమాసములను, బదములను, నెడనెడ వాడి తమ యనువాదముల కన్యములందుఁ గానరాని గాంభీర్యమును, సహజత్వ మును సమకూర్చినారు. వారు రవీంద్రుని సారస్వత రచనా సంప్ర దాయములను సంపూర్ణముగా నవగాహనము చేసికొన్నవా రగుటచే వారి యనువాదములు మూలమునకు సన్నిహితములై యందలి భావ ములను స్పష్టముగా వ్యక్తముచేయుచు మిక్కిలి హృద్యములై యలరారు చున్నవి.

క్రీ. శ. 1880 వఱకును వెలువడిన యాంధ్రనాటకములు పెక్కు అనువాదములే. నందకరాజ్యము, మధుకరీ మంజరీయము మున్నగు స్వతంత్ర నాటకములు రెండు మూఁడు వెలసినను వాని కప్పు డంత ప్రసిద్ధి చేకూఱియుండలేదు. స్వతంత్రనాటకములను విరివిగా వ్రాసి, వానిని స్వయముగా నభినయించి, జనాదరము సంపాదింపఁజాలిన మొదటి నాటకకర్త శ్రీ ధర్మవరము రామకృష్ణమాచార్యులుగారు (జననము 1853). వీ రాంధ్రభాషయందే కాక, యాంగ్ల, గీర్వాణభాష లందును, గన్నడము నందును గూడ గొప్ప పండితులు. వీరు రచించిన నాటకములు ముప్పదికిఁ బైగా నున్నవి. వానిలోఁ బదుమూఁడు మాత్రము ముద్రితము లైనవి. అముద్రితములయిన నాటకములు కూడ వీరి జీవిత కాలమునఁ బలుసార్లు ప్రదర్శింపఁబడినవి. వీరినాటకము లందలి వస్తువులు పౌరాణికములే అయ్యును సన్నివేశ కల్పనమందు వీరు ప్రదర్శించు నేర్పనన్య సామాన్యముగా నుండును. చిత్రనళీయము, విషాద సారంగ ధరము, పాదుకా పట్టాభిషేకము, చంద్రహాస, మోహినీ రుక్మాంగద, సావిత్రీ చిత్రాశ్వము, ప్రమీలార్జునీయము, వరూధిని, చిరకారి మున్నగునవి వీరి నాటకములలో సుప్రసిద్ధములైనవి. వీరి తొలినాటక ములలోఁ బద్యబాహుళ్యమును, ప్రబంధ లక్షణములును గానిపించును.

వీ రాంగ్లనాటక సంప్రదాయములను సైతము తమ నాటకములలో పెక్కుచోట్లఁ బ్రవేశపెట్టియుండిరి. వీరి విషాద సారంగధర నాటకము విషాదాంతమైనది. అంకమును రంగములుగా విభజిచుంట, ప్రొలోగు, ఎపిలోగు మున్నగు వానిని నాటకారంభావసానము లందు వ్రాయుట, దీర్ఘస్వగతములను బ్రవేశపెట్టుట, కొన్ని నాటకములను విషాదాంతము లొనరించుట మున్నగునవి వీ రవలంబించిన పాశ్చాత్య నాటకసంప్రదాయములు. వీరు తమనాఁడు దేశమును గలఁత నొందించుచుండిన రాజకీయ మత సాంఘికాది సమస్యలను దమ నాటకములం దెట్లో ప్రవేశింపఁజేసి, వాని కపూర్వమైన సౌందర్యము నాపాదించుచుండిరి. చంద్రహాస నాటకము నందలి ఉప్పువన్ను వృత్తాంతమును, ప్రమీలార్జునీయము నందలి స్త్రీస్వాతంత్ర్య వృత్తాంతమును ఇందుకు నిదర్శనములు. వీరు సంభాషణ వైచిత్రియందును, పాత్రపోషణ మందును, నీత్యుపదేశము నందును గృతహస్తులు. వీరి నాటకములలో హాస్యరసము విరివిగాఁ బోషింపఁబడినది. వీరు కవులేకాక, నటకులు కూడ నగుటచే నచ్చటచ్చట సామాన్య జనాకర్షణమున కుపయోగించు పెక్కు రంగములను సృష్టించి యుండిరి. నటకులు తమ యభిరుచి సామర్థ్యములనుబట్టి పద్యమో గద్యమో గ్రహించుట కనువుగా వీరు తమ నాటకములందుఁ బద్యము లందలి భావములనే గద్యరూపమునఁ గూడ వ్రాయుచుందురు. కొన్నిచోట్ల నా భావములే కీర్తనలలో సైతము కానవచ్చుచుండును. ఈ విధముగా నందచ్చటచ్చటఁ బునరుక్తిదోషము గోచరించును. అనువాదములే కాని, స్వతంత్రరచన లంతగా లేని యా కాలమున వారు స్వతంత్రనాటకములు పెక్కు వ్రాసి, యాంధ్రనాటక వాఙ్మయమున కభ్యున్నతి కలిగించి, తమ ఆంధ్రనాటక పితామహ బిరుదము నన్వర్థము కావించుకొనిరి.

శ్రీ ధర్మవరము రామకృష్ణమాచార్యులుగారి వలెనే బళ్ళారి నగరమున న్యాయవాదులై పెక్కు నాటకములను వ్రాసి, వానిని

రమ్యముగాఁ బ్రదర్శింపఁజేసినవారు శ్రీ కోలాచలం శ్రీనివాసరావుగారు (జననము 1754). వీరు నిర్మింపఁజేసిన వాణీవిలాస నాటకశాలకు స్వర్గీయ బాలగంగాధర తిలక్‌గా రారంభోత్సవము కావించిరఁట! వీరు కన్న డాంగ్ల సంస్కృతములందుఁ గూడ గొప్ప పండితులై పెక్కు విమర్శలు ప్రచురించి యుండిరి. ఆ రోజులలో వీరు రచించిన ప్రపంచ నాటక చరిత్ర యుత్తమ విమర్శ గ్రంథముగా ఖ్యాతి గడించినది. శ్రీ రామ కృష్ణమాచార్యులుగారికి సమకాలికులై వీరు కొంచె మించుమించుగా వారు వ్రాసినన్ని నాటకములను వ్రాసియుండిరి. వీ రిరువురి నాటక ములలో వస్త్వైక్యముతోఁ గూడినవి కూడఁ గొన్ని కానిపించును. శ్రీ శ్రీనివాసరావుగారు రచించిన మొదటి నాటకము సునందినీ పరిణయము. దీనికే దురాశాభంగ మని నామాంతరము. వీరి విజయనగర రాజ్య పతన మాంధ్రదేశమునఁ బలుతావులఁ బలుమార్లు ప్రదర్శింపఁబడి మిక్కిలి ప్రసిద్ధి గడించినది. ఇందలి పఠాన్ పాత్రము మిక్కిలి నిపుణముగ నిర్మింపఁబడిన దగుటచే బహుజనాదర పాత్రమై యొప్పారినది. సుల్తానా చాందబీబీ చంద్రగిర్యభ్యుదయము, ప్రతా పాక్బరీయము, మైసూరు రాజ్యము మున్నగునవి వీరి యితర చరిత్ర నాటకములు. వీరు మొట్టమొదట చరిత్ర సాంఘిక నాటక రచన యందే యుత్సాహము చూపినను, దరువాతఁ బెక్కు పౌరాణిక నాటకములు కూడ రచించియుండిరి. అందలి వస్తువులు భారత భాగవత రామాయణముల నుండి గ్రహింపఁబడినవి. మదాలస, రుక్మాంగదచరిత్రము, సత్యహరిశ్చంద్రీయము, పాదుకా పట్టాభిషేకము, ప్రహ్లాద మున్నగునవి వీరి పౌరాణిక నాటకములలో ముఖ్యములైనవి. వీరు సంస్కృతము నుండియు, తమిళము నుండియు, మహారాష్ట్రము నుండియుఁ గూడఁ గొన్ని నాటకముల ననువదించియుండిరి. అందు లంకాదహనము, కాళిదాసు నాటకము, మానాపమానము అనునవి పేర్కొనఁదగినవి. యువతీ వివాహము, మోహపిశాచము అనునవి

వీరి సాంఘిక నాటకములలోఁ బ్రసిద్ధిగన్నవి. వీరి నాటకము లందలి పద్యములు ప్రౌఢములై ప్రబంధ పద్యములతోఁ బోటీ చేయుచుండును. అందలి నాయక పాత్రలను సాధారణముగా నటకాగ్రేసరులని ప్రసిద్ధిఁ గాంచిన బళ్ళారి రాఘవాచార్యులుగా రభినయించి యుండుట వాని సహజ గాంభీర్యమునకు మఱింత వన్నె చేకూర్చినది. శ్రీనివాసరావు గారు పెక్కు నాటకముల తోపాటు ఆచారమ్మ కథ, అన్యాయ ధర్మపురి మహిమ, నాచిపార్టి అను ప్రహసనములను గూడ రచించిరి. వీరు కేవల నాటకకర్తలే కాక, విద్వత్కవులు, విమర్శకాగ్రేసరులునై జగత్ప్రసిద్ధుఁడైన మల్లినాథ సూరి వంశమునకుఁ గల ప్రఖ్యాతిని మఱింత యతిశయింపఁ జేసిరి. వీ రాంధ్ర చరిత్ర నాటక పితామహు లని యానాఁడు ప్రసిద్ధి వహించిరి.

కీ. శే. వీరేశలింగం పంతులుగా రనువాదములే కాక, కొన్ని స్వతంత్ర నాటకములు కూడ రచించిరి. వానిలో దక్షిణగోగ్రహణము, సత్యహరిశ్చంద్ర ముఖ్యములైనవి. కాని వారి యనువాదములకును, బ్రహసనములకును వచ్చినంత ప్రశస్తి వీనికి రాలేదు.

మహామహోపాధ్యాయ వేదము వేంకటరాయశాస్త్రి గారు ప్రతాపరుద్రీయము, ఉష, బొబ్బిలి యుద్ధము అను మూడు స్వతంత్ర నాటకములు రచించిరి. వీనిలో మొదటిది తుదిది చారిత్రములైనవి. రెండవది పౌరాణికమైనది. ప్రతాపరుద్రీయము శ్రీ శాస్త్రిగారు రచించిన నాటకములలోనే కాక తెలుఁగున వెలసిన స్వతంత్ర నాటకముల లోనికెల్లఁ దలమానికమని చెప్పఁదగినది. అందలి రసపాత్ర పోషణము, సన్నివేశ కల్పనము, పాత్రోచిత భాషాప్రయోగము అనన్య సామాన్యములైనవి. ఇందలి యుగంధర పాత్రకును భాసుని యౌగంధ రాయణ పాత్రకును, గొంత పోలిక యున్నది. ఈ పాత్రను, చాకలి పేరిగాని పాత్రను గల్పించుటలో శాస్త్రిగారు ప్రదర్శించిన ప్రతిభ

యప్రతిమానమైనది. ఇందలి పద్యములు, గేయములు భావగంభీరములై యత్యంత మనోహరముగా నుండును. ఉప, బొబ్బిలి యుద్ధము అను నాటకములోఁ గూడ శాస్త్రిగారు ప్రదర్శించిన నాటకీయ శిల్ప మద్భుత ముగా నుండును. తమ నాటకములలో నెడ నెడ హాస్యరసపూరితము లైన సన్ని వేశములను, ఆత్మీయాంశముతోఁ గూడిన దృశ్యములను గల్పించుట వారి కలవాటు.

శ్రీ పానుగంటి నరసింహారావుగారు సుమారు ముప్పది నాటక ములు రచించి ఆంధ్ర షేక్స్పియరు అను ప్రఖ్యాతి నార్జించిరి. వానిలో పాదుకా పట్టాభిషేకము, రాధాకృష్ణ, విప్రనారాయణ పెక్కుసారులు ప్రదర్శితములై యాంధ్రజనుల యాదరాభిమానముల నాకర్షింపఁ జాలినవి. వీరి నాటకములలోఁ బద్యముల సంఖ్య తక్కువ. ఉన్నవైనను పెక్కు సీస గీతములే. షేక్స్పియరువలె దీర్ఘ స్వగతములను వ్రాయుట వీరి కలవాటు కొన్ని నాటకములలోని పాత్రలు సాక్షిలోని జంఘాల శాస్త్రివలె నుపన్యాస ధోరణిని మాటలు సాగించుచుండును. వీరు హాస్యప్రియులగుటచేఁ గొన్ని చోట్ల దాని నతిగాఁ బ్రయోగించి యనౌ చిత్యమునకుఁ దావొసంగుచుందురు. వీరి నాటకములలోని—ముఖ్య ముగా రాధాకృష్ణలోని—సంభాషణలు మనోహరములుగా నుండును. వీరి కంఠాభరణ మాంధ్రమునందలి హాస్యరసమయ నాటకములలో నగ్రగణ్యమైనది. వీరి నాటకములందలి నాందీప్రస్తావనలు కీ. శే. కూచి నరసింహం పంతులుగారిచే వ్రాయఁబడినవి.

శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు పెక్కు పౌరాణిక నాకములు రచించి పేరుగాంచిరి. వానిలో గయోపాఖ్యానము, ప్రసన్న యాదవము, పారిజాతాపహరణము ప్రహ్లాద చరిత్ర ముఖ్యములైనవి. గయోపాఖ్యాన మాంధ్రదేశమునఁ బలుచోట్లఁ బలుసార్లు ప్రదర్శితమై మిక్కిలి ప్రఖ్యాతి గడించినది. ఇందలి పద్యములు పెక్కుతురాస్యు

లైన యాంధ్రులందఱికిని గంఠగతములే. ఈ నాటకము ప్రతు లమ్ముడు పోయి నట్లాంధ్రమున మఱియే నాటకములు నమ్మఁబడియుండ లేదని చెప్పుదురు. శ్రీ పంతులుగారి పద్యములు మిక్కిలి ప్రసన్నములై నాటకోచితములుగా నుండును. వీరి ప్రహసనములు కూడ నాంధ్ర దేశమున నధిక ప్రచారము పొందినవి.

శ్రీ తిరుపతి వేంకటకవులు సంస్కృత నాటకానువాదములతో పాటు పెక్కు స్వతంత్ర నాటకములు కూడ రచించిరి. వానిలో పాండవోద్యోగ విజయములు మిక్కిలి ప్రసిద్ధములైనవి. ఇవి యెప్పటికప్పుడే నిత్య నూతనములై యిప్పటికిని వేలకొలఁది సామాజికుల నాకర్షించు చున్నవి. ఇందలి పద్యములు మృదుమధురములును, భావ గంభీరములునై భారతపద్యములకుఁ గూడ వంకలు దిద్దుచున్న ట్లుండును, అందుఁ గొన్నియైన నోటికిరాని యక్షరాస్యుఁ డాంధ్రదేశమున నుండఁ డనుటలో నతిశయోక్తి లేదు. తిరుపతి వేంకటకవుల పద్యములకున్న నాటకానుకూలత యింతిం తనరానిది. అదియే వారి నాటకముల కంత ప్రఖ్యాతి నార్జించి పెట్టినది. వారి నాటకములలోఁ బద్యముల సంఖ్య హెచ్చు. "బావా యెప్పుడు వచ్చితీవు" వంటి సామాన్య భావముల వ్యక్తము చేయుటకుఁ గూడ వారు పద్యము వాడుచుందురు. వీరి పద్యములలో నున్నంత జిగి వచనమునఁ గానరాదు. వీరి పాండవోద్యోగములో భారవి కిరాతార్జునీయమునందలి శ్లోకములు కొన్ని యనువదింపఁబడినవి. పాండవ జననము, పాండవ ప్రవాసము, పాండవ రాజసూయము. పాండవాశ్వమేధము అను వీరి యితర భారత నాటకములకంత ప్రఖ్యాతి రాలేదు. సుకన్య, ప్రభావతీ ప్రద్యుమ్నము, అనర్ఘ నారదము, పండితరాజము, ఎడ్వర్డు పట్టాభిషేకము. వ్యసన విజయము అనునవి వీరి యితర నాటకములు. వీనిలో వ్యసన విజయ మసమగ్రము.

ఆంధ్రమున మిక్కిలి ప్రసిద్ధినందిన మఱియొక నాటకము శ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంత కవిగారి సత్యహరిశ్చంద్రీయము. ఇది

గౌరన హరిశ్చంద్ర చరిత్ర, శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యా
వాని ననుసరించి వ్రాయఁబడినది. ఇందలి పద్యమొక్కటి ర
రత్నము. ఈ నాటకముకూడ నాంధ్రదేశమున ననేక పర
ప్రదర్శితమై జనాదరము నార్జించినది. ఇందలి సంభాషణలు
ములు మిక్కిలి రసవంతములై యుండును. వీరి యుత్త
భవభూతి యుత్తరరామ చరిత్రము ననుసరించి వ్రాయఁబడిన

ఆంధ్రమునందలి సాంఘిక నాటకములకెల్ల నాదర్శము
మునైనది శ్రీ గురుజాడ అప్పారావుగారి కన్యాశుల్కము, ఇ
బడి సుమారు డెబ్బది యేండ్లయినను ఇప్పటికిని నూతనత్వమున
కుండుటయే దీని ప్రాశస్త్యమునకుఁ దార్కాణము. ఇందలి గిరీ
అద్భుతమైనది. అంత సజీవము సహజమునైన పాత్ర యాంధ
ములలో మఱెచ్చటను గానరాదు. ఈ నాటకము సహజ
మాండలిక పదప్రయోగమునకును, నిర్మలమైన హాస్యమునకు
మంతమైన సంస్కరణ ప్రబోధమునకును నిలయమైనది.
టచ్చటఁ గానవచ్చు నాంగ్లపదమిశ్రితమైన సంభాషణము
చిత్రముగను జమత్కారవంతముగను గానవచ్చును. తెలుఁగు
రంగమున నీ నాటకమొక విప్లవము తెచ్చిపెట్టినది. తరువాత
బడిన పెక్కు సాంఘిక నాటకముల కిది యాదర్శప్రాయ
రారినది. శ్రీ పంతులుగారి కొండుభట్టీయముకూడ కన్యా
వంటిదే.

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు కావ్య
కాక నాటకకర్తగాఁ గూడఁ బేరొందిన ప్రతిభావంతులు. న
వేనరాజు, త్రిశూలము, అనార్కాళి, వేదకావ్య హరిశ్చంద్ర
మున్నగునవి వీరి నాటకములు. వీనిలోనికెల్ల నర్తనశాల
బట్టియేకాక గుణమునుబట్టి కూడఁ బ్రథమ గణ్యమైనది.

యిందలి యితివృత్తము. శ్రీ కవిగా రిందు కీచకుని నుదాత్తుఁడైన విషాద నాయకునిఁగాఁ జిత్రింప యత్నించి కృతార్థులైరి. ఇందలి సంభాషణలు రమ్యముగా నుండును. వేనరాజు విశిష్టమైన శిల్పముతోఁ గూడిన యుత్తమ నాటకము. దీని కాంధ్రదేశమునఁ దగినంత ప్రోత్సాహము లభింపలేదు.

ఆంధ్రదేశమున స్వతంత్ర నాటకములు నిర్మించిన కవు లింకను బలువురున్నారు. వారిని గూర్చియు వారి రచనలను గూర్చియుఁ జెప్పుట కిటఁ జోటు చాలదు. శ్రీ చక్రావధానుల మాణిక్యశర్మ, సోమరాజు రామానుజరావు, ద్రోణంరాజు సీతారామారావు మొదలైన వా రనేక నాటకములు వ్రాసి ప్రచురించిరి. కీ శే. ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణ శాస్త్రిగారి రసపుత్ర విజయము వీరరస ప్రధానమైన నాటకములలో నుత్తమమైనది. శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారి సత్యకీర్తి, విక్రమోర్వశీయము మనోహరములుగా నుండును. మహాకవి కాళ్లకూరి నారాయణరావుగారి వరవిక్రయము, చింతామణి, మధుసేవ రంగము నందు విశేష ప్రఖ్యాతి నార్జింపఁ జాలినవి. ముత్తరాజు సుబ్బారావు గారి శ్రీకృష్ణతులాభారము, ధర్మవరము గోపాలచార్యులుగారి రామ దాసు, గుండిమెడ వేంకట సుబ్బారావు గారి ఖిల్జీరాజ్యపతనము, దుర్గా దాసు, పింగళి నాగేంద్రరావు గారి నారాజు, పలుసార్లు ప్రదర్శింపఁబడి పండితుల ప్రశంసలకుఁ బాత్రములైనవి.

ఇటీవల దేశ కాలపరిస్థితులలో నేర్పడిన పెక్కు మార్పులవలన రాజకీయ సాంఘిక వస్తువైవిధ్యముతోఁ గూడిన నాటకము లనేకము లుద్భవించినవి వ్యావహారిక భాషోద్యమము క్రమముగా నాటకములపైఁ గూడఁ బ్రభావము చూప మొదలు పెట్టినది. శ్రీ కోపల్లె వేంకట రామారావుగారి పెట్టమారిమగడు, భాగ్యరేఖ, వెన్నెల మున్నగు నాటకములు సంఘమునందలి దురాచారములను దూయఁబట్టి, నైతిక సందేశముల నందఁజేసినవి. ఆచార్య ఆత్రేయగారు రచించిన ఎన్. జి. ఓ.

కప్పలు, భయం అను నాటకములలో భయానుమానములతోడను, అధఃపతనముతోడను సంఘర్షణము సాగించు సామాన్యుని మనస్తత్త్వములు చక్కగాఁ జిత్రింపఁబడినవి. ఆత్మవంచన యను బుచ్చిబాబుగారి నాటక మహంకార కలుషితములైన భావములతో నాత్మవంచన చేసికొన్న నాధునిక విద్యావంతుల యథార్థ స్వరూపమునుబట్టి చూపుచున్నది. శ్రీ త్రిపురనేని రామస్వామిచౌదరిగారు వ్రాసిన శంబుకవధ, ఖూనీ అను నాటకములు, చలంగారి చిత్రాంగి ఆంధ్ర నాటకరంగములో సంచలనము కలిగించినవి. భారతీయ విజ్ఞాన సంప్రదాయములపైఁ దిరుగుబాటు ప్రదర్శించుటచే నీ నాటకములను బ్రయోగించుటకు నాటక సమాజము లెక్కువగా యత్నించి యుండలేదు. వుడ్‌హౌసు వ్రాసిన ప్లే ఈజ్ ది థింగ్ అను నాటకము ననుసరించి శ్రీ నరసరాజుగారు వ్రాసిన నాటకములోఁ గథావిన్యాసము, పాత్రపోషణము క్రొత్త మార్గమున నడచినవి. దీనికి 1949 లో నాంధ్ర నాటక పరిషత్తు జరిపిన పోటీలలోఁ బ్రథమ బహుమాన మొసంగఁబడినది. పినిశెట్టి రచించిన పల్లెపడుచులో రైతు జమీందారుల మధ్యనుండు సంఘర్షణము చిత్రింపఁబడినది. శ్రీ బోయిభీమన్నగారి పాలేరు, కూలిరాజు భూస్వాముల దౌర్జన్యములపైఁ దిరుగుబాటు ప్రదర్శించుచున్నవి. గంగాధరంగారి కమల నాటకములో మధ్యతరగతి కుటుంబముల పరిస్థితులు, అందలి కలహములకుఁ గారణములు వివరింపఁబడినవి. తెలంగాణమునుండి వెలువడిన శ్రీ కె. యల్. నరసింహారావుగారి క్రీనీడలు, శ్రీ చిల్లర భావనారాయణ గారి ఉమర్ ఖయ్యాం మిక్కిలి ప్రసిద్ధి కెక్కినవి. ఇట్లే శ్రీ గిడుతూరి సూర్యంగారి ఇన్స్పెక్టరు జెనరలు నాటకానువాద మధికమైన ప్రచారముగాంచి మించినది. శ్రీ బెల్లంకొండ రామదాసుగారు మాస్టర్జీ, పునర్జన్మ అను ఉత్తమ సాంఘిక నాటకములు రచించి పేరుగాంచినారు. శ్రీ ప్రఖ్య శ్రీరామమూర్తిగారి కాళరాత్రి, ఫణి అను అపరాధ పరిశోధక తత్త్వముతోఁ గూడిన నాటకములు రంగస్థలమున మిక్కిలి విజయవంతములు

కాఁజాలినవి. శ్రీ కుందుర్తివారు రచించిన ఆశ యను గేయనాటక మాంధ్రనాటక వాఙ్మయమున నొక క్రొత్త ప్రయోగము. ఇట్లే యాధునిక కాలమునఁ బ్రతిభావంతులచే వ్రాయఁబడి ప్రసిద్ధి కెక్కిన నాటకము లనేకము లున్నవి. ఇప్పటికిఁ దెలుఁగు వాఙ్మయమున మొత్తము రెండువేల యైదువందల నాటకము లున్నవని యంచనా వేయఁబడినది.

సుమారు రెండు దశాబ్దులనుండి యాంధ్రమునఁ బెద్ద నాటకములు వ్రాయువారి సంఖ్య తగ్గిపోయినది. నాటక సమాజములు కూడఁ బ్రాఁత నాటకములనే ప్రయోగించుచున్నవి కాని నూతన నాటక ప్రయోగమున కంతగా యత్నించుచున్నట్లు కన్పింపదు. కాని యేకాంక నాటిక లసంఖ్యాకములుగా రచింపఁబడుచున్నవి. సంస్కృత వాఙ్మయమున నాటికలు, ఏకాంక నాటికలు భాసుని నాఁటినుండియుఁ గనఁబడు చున్నప్పటికిని వానికిని వీనికిని సంబంధమంతగాఁ గానరాదు. సూక్ష్మ ముగాఁ బరిశీలించినచో వీనిలోఁ బెక్కు కన్యాశుల్కమునకు సంకేతానుకరణములుగాను వీరేశలింగం, చిలకమర్తి ప్రభృతుల ప్రహసనములకుఁ బరిణామ రూపములుగను గానిపించును. కాని వీనిపైఁ బాశ్చాత్య నాటికల ప్రభావమే యధికముగా నున్నదని చెప్పుటకుఁ బెక్కు దృష్టాంతము లున్నవి.

తెలుఁగున నేకాంకికలు మొట్టమొదట కళ, జ్వాల అను పత్రికలలోఁ బ్రచురింపఁ బడినవి. శ్రీ పి. వి. రాజమన్నారు, ముద్దుకృష్ణ, చలం మున్నగువారిని కాలమునుబట్టియే కాక కళావిశేషమునుబట్టి కూడ నేకాంక నాటికా రచయితలలో నగ్రగణ్యులని చెప్పవచ్చును. శ్రీ రాజమన్నారుగారు క్రీ. శ. 1920 ప్రాంతముననే తమ మొదటి యేకాంకికను రచించియుండిరి. కాని యప్పటి కింకను ఆంధ్రలోక మేకాంక నాటికల విలువ గ్రహించు స్థితిలో లేకుండెను. వీరు వ్రాసిన యేకాంక నాటిక లౌచిత్యమునకును గళాసంపదకును నిలయములు. ఏమి మొగవాళ్లు,

నాగుబాము, నిష్ఫలం అను వీరి నాటిక లుత్తమోత్తములై విమర్శకుల తల లూపించినవి. తప్పెవరిది యను వీరి నాటిక 1930 లో మద్రాసు నగరమున బళ్లారి రాఘవాచార్యులుగారిచేఁ బ్రదర్శింపబడినది. ఆ ప్రదర్శనము వీరి ప్రతిభాపరిమళమునకుఁ బిల్లవాయువై ప్రకాశించినది. శ్రీ రాజమన్నారుగారు రేకాంక నాటికా రచయితలలోఁ బ్రథములే యైనను వానిలోఁ బరిణతమైన కళను బ్రదర్శించి యువకుల కాదర్శ ప్రాయులు కాఁజాలినారు. శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారు, చింతా దీక్షితులుగారు, మల్లాది విశ్వనాథకవిరాజుగారు, మొక్కపాటి నరసింహ శాస్త్రిగారు వ్రాసిన నాటికలు సంపుటములుగాఁ బ్రచురింపఁబడి పఠితల మన్ననలు పొందుచున్నవి. శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారి నాటికలు హాస్యరస ప్రధానములై వేలకొలఁది సామాజికుల నాకర్షింపఁ జాలినవి. వానిపై మోలియర్ ప్రభావము ప్రస్ఫుటముగాఁ గనిపించును. హాస్య నాటికాకర్తగా శ్రీ కామేశ్వరరావుగారికిఁగల స్థానము విశిష్టమైనది. శ్రీ డి. వి. నరసరాజుగారు, మల్లాది అవధానిగారు కూడ నిట్టి నాటికలే రచించి ప్రసిద్ధి గడించినారు చలంగారి నాటికలు స్త్రీ పురుషుల సంబంధ బాంధవ్యముల నాధారముగాఁ జేసికొని రచింపఁబడినట్టివి. అందలి భావ ములతో నేకీభవింపఁ జాలక పోయినను బఠితలందరలి రచనా శిల్పమును జూచి యాశ్చర్యపడక మానరు. డా. మారేమంచ రామారావుగారు చారిత్రి నాటికా రచనలో సిద్ధహస్తులు. శ్రీ సోమంచి యజ్ఞన్నశాస్త్రి గారి నాటికలు పాశ్చాత్య నాటికా పద్ధతుల ననుకరించుచు, నిర్మలమైన హాస్యమున కాకరములై, యొక ప్రత్యేకత గడించుకొన్నవి.

క్రీ. శ. 1943 తరువాత నాటికల రచనాపద్ధతిలోఁ గొంతమార్పు కలిగినది. నాటికా రచయితలు తమ నాటికలలో వాస్తవిక వాతావరణ చిత్రణమున కెక్కువ ప్రాధాన్యమొసంగ యత్నించిరి. శ్రీ బుచ్చిబాబు, ఆత్రేయ, నార్ల, అనిసెట్టి, పినిసెట్టి, గంగాధర్, విశ్వప్రసాద్ మున్నగు వారి క్రొత్త మార్గమునకుఁ జెందినవారు. శ్రీ బుచ్చిబాబుగారి

దారినపోయ్యే దానయ్య, ఉమర్ ఖయ్యాం, తిమ్మరుసుత ప్రశస్తములైన నాటికలు. ఆత్రేయ వ్రాసిన ప్రగతి శాస్త్రీయ దృక్పథమును, బరిశీలనను వ్యక్తము చేయుచున్నది. పినిసెట్టివారి ఆడది అను నాటికలో స్త్రీపాత్ర లేనేలేదు. తాత్కాలిక కోపావేశమునకు గురియై భార్య నింటి నుండి వెడలఁ గొట్టి పశ్చాత్తప్తుఁడైన గృహస్థు గాథ యిది. శ్రీ నార్ల వారి కొత్తగడ్డ నాటికాసంపుటిలో గ్రామజీవితము, రైతుల పరిస్థితులు సహజముగాఁ జిత్రింపఁబడినవి. వీరి నాటికలలో హెరాల్డు, చాఫిన్ మున్నగు పాశ్చాత్య నాటికాకర్తల ప్రభావ మధికముగా గోచరించును. శ్రీ కె. గంగాధర్ గారు రచించిన ప్రార్థన అను నాటిక ఆంధ్ర నాటక పరిషత్తు వారి బహుమానమును గడించినది. శ్రీ విశ్వప్రసాద్ గారి రచనలు కూడ నిట్లే భావబంధురములై పఠితల ప్రశంసలకుఁ బాత్రము లగుచున్నవి. ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, భారతి, కృష్ణాపత్రిక మున్నగు పత్రికలలో నిటీవలఁ బెక్కు నాటికలు ప్రచురింపఁబడినవి. మొత్తము మీఁదఁ దెలుఁగు నాటికల సంఖ్య కూడ రెండు వేలకు మించినదని చెప్ప వచ్చును.

శ్రీ తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రిగారు కొన్ని నాటికలను గేయ రూపమున వ్రాసి ప్రచురించినారు. వానిలోఁ బద్మావతీచరణ చారణ చక్రవర్తి, దీక్షితదుహిత మున్నగునవి పాఠకులను బరవశులఁగావింపఁ గల రసదర్పవచనలు. శ్రీ నారాయణరెడ్డిగారు కూడ శాస్త్రిగారి నాదర్శ ముగాఁ గొని కొన్ని చక్కని గేయనాటికలను రచించినారు. వానిలో నవ్వనిపువ్వు మిక్కిలి ప్రచారము పొందినది. ప్రశస్తములైన గేయ నాటికలు రచించిన వారు వీరిరువురే యని చెప్ప వచ్చును.

ఇటీవల రేడియో నాటిక ప్రసిద్ధి కెక్కినది. రేడియో నాటికల రచించు విషయమునను, నిర్వహించు విషయమునను శ్రీ కపిల కాశీపతి గారు మిక్కిలి యనుభవశాలులు. తెలుఁగున రేడియో నాటిక పెక్కు క్రొత్త పోకడలుపోయి బహుళ ప్రచారము పొందుచున్నది. శ్రీ బుచ్చి

బాబు, గోరాశాస్త్రి, శ్రీ. శ్రీ, కృష్ణశాస్త్రి, పద్మరాజు, ఆరుద్ర, రజనీ కాంతరావు, మునిమాణిక్యం నరసింహారావుగార్లు రేడియో నాటికా రచనమున నారితేరినవారు. శ్రీ కృష్ణమూర్తి, గిడుతూరి సూర్యం ఇటీవల జరిగిన రేడియో నాటికల పోటీలలో బహుమానములు పొందఁ గలిగినారు.

తెలుఁగున సంగీత నాటకమునకు శ్రీకారము చుట్టినవారు శ్రీ కొప్పరపు సుబ్బారావుగారు. వీరి నాటిక లోక సంపుటముగాఁ బ్రచురింపఁబడినవి. వీరి ఆలీముతా ఆంధ్రదేశమున మిక్కిలి ప్రసిద్ధి గాంచినది. పిల్లల నాటికలు వ్రాయు వారిలో నార్ల చిరంజీవి, పాలంకి సరస్వతీదేవి, చింతా దీక్షితులు ముఖ్యులు. చిరంజీవి రచించిన వీథిదీపం పిల్లలకై వినియోగింపఁబడినదే యయ్యును మిక్కిలి రసవత్తరముగా నున్నది. ఈ మధ్య మదరాసునందలి ఆంధ్రభాషా సమితి వా రాఱు బాల నాటికలకు బహూకృతి నొసంగినారు.

ఇటీవలఁ బెద్ద నాటకముల ప్రదర్శనలు వెనుకఁ బట్టినను ఏకాంక నాటికా ప్రదర్శనలు విరివిగానే సాగుచున్నవి. వీనిలోఁ బెక్కు పాఠశాలా కళాశాలలయు, గ్రంథాలయాదులయు వార్షికోత్సవ సందర్భములందే ప్రదర్శితములగుచున్నవి. స్త్రీ పాత్రల నభినయించుటకు స్త్రీలే లభించుట కష్టముగా నుండుటచే విద్యార్థులకు సౌకర్యము కలిగించుటకై కొందఱు రచయితలు స్త్రీ పాత్రలు లేకుండగనే రచనలు చేయుచున్నారు. ఇట్లభినయించు వారి సౌకర్యమునకై నాటకములు సృజించుట కళాభి వృద్ధి కాటంకము కలిగించును. ఏకాంక నాటికల సంఖ్య పెరుగుచుండుట ముదావహమే; కాని వానియందుఁ గళాసంపద, కొఱవడి యుండుట శోచనీయము. మఱియుఁ బ్రతిభావంతులైన రచయితలు కేవల మేకాంక నాటికారచనముతోడనే తృప్తినొందక కళాసంబంధభరితములైన నాటకముల రచనకుఁ గూడఁ గడంగి యాంధ్ర నాటక కళాభివృద్ధికి దోహద మొసంగుదురుగాక.

# ఆంధ్ర వాఙ్మయ చరిత్రము

## నవలలు - కథానికలు

పాశ్చాత్య భాషాసంపర్క ప్రభావమున వృద్ధినొందుచు నాధుని కాంధ్రవాఙ్మయమునకుఁ బరిపుష్టి కలిగించుచున్న సాహిత్యప్రక్రియలలో నవల యొకటి. దక్షిణాంధ్ర యుగమున వచనగ్రంథములు పెక్కు వెలువడినను అందుఁ జాల భాగము పౌరాణిక వస్తు విలసితమైనదే. పాశ్చాత్య భాషాసంపర్కము కలిగిన పిమ్మటనే 'నవల' యను ప్రక్రియ భారతదేశ భాషలలోఁ బ్రబలఁ జొచ్చినది. కీ. శే. వీరేశలింగం పంతులుగారు క్రీ. శ. 1878 లోఁ దమ రాజశేఖర చరిత్రమును బ్రకటించిరి. అంతకుముందు కూడ నొండు రెండు నవలలు రచింపఁబడిన మాట సత్యమేయయ్యుఁ బెక్కు కారణములచే నాంధ్రమున రాజశేఖర చరిత్రయే మొదటి నవలగాఁ బరిగణింపఁబడుచున్నది. ఇది గోల్డుస్మిత్ వికార్ ఆఫ్ వేక్ఫీల్డు ననుసరించి వ్రాయఁబడిన సాంఘిక నవల. అనుసరణమయ్యు స్వతంత్రమువలె నొప్పారుట యీ నవలయందలి విశిష్టత. ఇందు శైలియు వర్ణనలును మిక్కిలి రమణీయములుగా నుండును. సంఘసంస్కరణప్రియులైన పంతులుగా రిందుఁ దమనాఁడు ప్రబలి యున్న సాంఘిక దురాచారములను నిపుణముగా హేళన చేసి యున్నారు.

క్రీ. శ. 1893 లో శ్రీ ఖండవల్లి రామచంద్రుఁడుగారు ధర్మవతీ విలాసమను నవలను బ్రచురించిరి. పిమ్మట వారే మాలతీ రాఘవము లక్ష్మీసుందర విజయము అను మఱి రెండు నవలలను వెలయించిరి. ఈ మూఁడు నవలలు నప్పుడు చింతామణి పత్రిక వారొసంగుచుండిన పారితోషికములను బడయఁ జాలినవి. సుప్రసిద్ధ నవలారచయితలు, కవులు, నాటకకర్తలు నైన శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంపంతులుగారు

క్రీ. శ. 1894 లో రామచంద్రవిజయమను పేర మొదటి నవలను రచించి చింతామణి బహుమానమును గడించిరి. క్రీ. శ. 1876 లో వారి హేమలతయు, 1897, 98 లలో అహల్యాబాయి కర్పూరమంజరులును ప్రథమ బహుమానములకుఁ బాత్రములైనవి. వరుసగా లభించిన యీ బహూకృతులతో పంతులుగారి కీర్తి దిగంత వ్యాప్తమైనది. శ్రీ వీరేశ లింగం పంతులుగారు సాంఘిక నవలకు వలె లక్ష్మీనరసింహం పంతులుగారు చారిత్రిక నవలకాద్యులని చెప్పవచ్చును. వీరి గణపతి హాస్యరస ప్రధానమైన నవల. అదియు రామచంద్రవిజయమువలె మిక్కిలి కీర్తి ప్రచారములఁ గాంచినది. చిలకమర్తివారు రచించిన నవల లింకను నెన్నియో కలవు. వానిలోఁ గొన్ని యనువాదములు, కొన్ని యుత్తర భారత చరిత్రకు సంబంధించినవి. వారి శాపము వేములవాడ భీమకవి జీవిత చరిత్రను దక్షిణాంధ్ర కళింగ దేశముల చరిత్రను జిత్రించుచున్నది. చిలకమర్తి వారి నవలలకుఁ గలిగిన ప్రతిష్ఠకు వారి కథాకథన నైపుణియే కాక ప్రసన్న మధురమైన శైలియుఁ జాలవఱకుఁ దోడ్పడినది.

కీ. శే. కేతవరపు వేంకటశాస్త్రిగారు పెక్కు చారిత్రిక సాంఘిక నవలలు రచించి పేరుగాంచిరి. బొబ్బిలి ముట్టడి, రాయచూరు యుద్ధము, పూర్ణానందము, అగ్రహారము, ఇచ్ఛనీకుమారి మున్నగునవి వీరు రచించిన నవలలోఁ బ్రశస్తములైనవి. వీరు మంచి పండితులు, కవులు నయ్యు నవలారచనకుఁ గడంగుట యీ జాతి వాఙ్మయమునకు వన్నెవాసి చేకూర్చినది.

ఆంధ్రప్రచారిణీ గ్రంథమాలవారును, విజ్ఞానచంద్రికా గ్రంథమాలవారును, వేగుఁజుక్క గ్రంథమాలవారును బ్రచురించిన నవలలు మిక్కిలి ప్రశంసా పాత్రములైనవి. శ్రీ వేంకట పార్వతీశ్వరకవులు వంగభాషనుండి పెక్కు నవలలాంధ్రీకరించిరి. శ్రీ తల్లావఝ్ఝల శివశంకర శాస్త్రిగారు, జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు, శ్రీమతి పులుగుర్త లక్ష్మీనరసమాంబగారు, చాగంటి శేషయ్యగారు మున్నగు వారాంధ్రీ

రించిన నవలలును జెక్కు గలవు. శ్రీ భోగరాజు నారాయణమూర్తి గారి విమలాదేవి, ఆంధ్రరాష్ట్రము మున్నగు నవలలు ప్రశస్తములైనవి. వేగుజుక్క గ్రంథమాలవారి వాఁడే వీఁడు, నేనే మున్నగు నవల లా రోజులలో మిక్కిలి ప్రశంస లందినవి. నాఁడు బంకించంద్ర రవీంద్రుల నవలల ట్లే నేఁడు ప్రేమచంద్ర శరచ్చంద్రుల నవల లనేకము చక్కగా నాంధ్రీకరింపఁబడుచున్నవి.

ఆధునికాంధ్ర కవులలోవలెనే నవలాకర్తలలోఁ గూడ నగ్రేసరు లని చెప్పఁదగినవారు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు. ఏకవీర వారి ప్రథమ నవల. అందలి శైలియుఁ, గథానిర్మాణ కౌశలమును, పాత్రపోషణమును అనన్యాదృశములైనట్టివి. చెలియలికట్ట, ధర్మచక్రము, బద్దన్న సేనాని, స్వర్గానికి నిచ్చెనలు, తెఱచిరాజు, మాబాబు మున్నగు నవి వారి యితర నవలలు. వారి వేయిపడగలు పరిమాణమునందువలెనే గుణమునందును నగ్రగణ్యమైనది. అది యాధునికాంధ్రదేశ సాంఘిక మత రాజకీయ పరిస్థితులకు మణిదర్పణము, అందలి వర్ణనలు భావ గంభీరములు; పాత్రలు సజీవములు; శైలి మధురగంభీరము. అది ఆంధ్ర విశ్వవిద్యాలయమువారి నవలల పోటీలో నడవి బాపిరాజుగారి నారాయణరావుతోఁ బ్రథమ బహుమానమును బంచుకొన్నది. శ్రీ విశ్వనాథవారి నవలలలోఁ బ్రకృతి పరిశీలనమువలెనే ప్రపంచ పరిశీలనమును మిక్కుటముగా గోచరించును. అందుఁ బ్రతిపుటయు వారి సనాతన సంప్రదాయాభిమానమును జక్కగాఁ జాటుచుండును.

సాంఘిక నవలాకర్తలలోఁ బేరెన్నికగన్న వారింకను బలువు రున్నారు. శ్రీ అడివి బాపిరాజుగారి నారాయణరావు వేయిపడగల వలెనే మిక్కిలి ప్రశస్తి నార్జించినది. హిమబిందు, కోనంగి గోనగన్నారెడ్డి మున్నగువారి యితరనవలలుకూడ నాంధ్రదేశమున నధిక ప్రచారము గాంచినవి. శ్రీ శ్రీపాదసుబ్రహ్మణ్యశాస్త్రిగారిఆత్మబలి, గోపీచందుగారి అసమర్థుని జీవయాత్ర, బుచ్చిబాబుగారి చివరకు మిగిలేది, జి. వి. కృష్ణారావుగారి

కీలుబొమ్మలు, బలివాడ కాంతారావుగారి గోడమీదిబొమ్మ, పోతుకూచి సాంబశివరావుగారి ఉదయకిరణాలు చక్కని పాత్ర చిత్రణముతోడను, సాంఘిక వాతావరణముతోడను గూడి పాఠకుల ప్రశస్తులందుకొన్న యుత్తమ నవలలు.

శ్రీ నోరి నరసింహశాస్త్రిగారి నారాయణభట్టు, రుద్రాంబ, మల్లారెడ్డి అను చారిత్రక నవలలు మిక్కిలి ప్రసిద్ధము లైనవి. చారిత్రక సత్యములను విడువకయే శ్రీ శాస్త్రిగారు సరస మనోహరముగాఁ గథను సాగించుచుందురు. వారి పాత్ర చిత్రణము గతించిన చారిత్రక మహావ్యక్తులను సుస్పష్టరేఖలతోఁ బఠితలకు సాక్షాత్కరింపఁ జేయును. డా॥ కాకర్ల నరసింహంగారి కనకాభిషేకము, రఘునాథరాయలు, శ్రీమతి వసుంధర రచించిన తంజావూరి పతనము, సప్తపర్ణి, శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తి గారి భువనవిజయము, ప్రశస్తములైన చారిత్రక నవలలు. అవి విస్మృతమై పోయిన యాంధ్రవైభవము నతినిపుణముగా వర్ణించి యాంధ్రుల కానందోత్సాహముల నావహించుచున్నవి.

ఆంధ్రనవలా ప్రపంచమున కలంకారప్రాయమై యాంధ్రజనుల యాదరాభిమానములు చూఱగొన్న యత్యుత్తమ నవల శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారి మాలపల్లి. ఇందు రాజకీయ సాంఘిక మత సమన్యలెన్నో బహుముఖములఁ బరిశీలింపఁబడినవి. భారత స్వాతంత్ర్య సంగ్రామము యొక్కయు, జాతీయోద్యమము యొక్కయు నారంభ పరిణామముల నిందుఁ గాంచనగును. నిపుణమైన పాత్రపోషణమునకును, నిర్మలమైన యాత్మపరిశీలనమునకును, బరిణతమైన శైలికిని ఈ నవల పట్టుఁగొమ్మ. శ్రీ ఉప్పల లక్ష్మణరావుగారి "అతడు ఆమె" అను నవలయు, శ్రీ మహీధర రామమోహనరావుగారి రథచక్రాలు, ఓనమాలు, దవానలము మున్నగు నవలలును, శ్రీ వట్టికోట ఆళ్వారు స్వామిగారి ప్రజల మనిషియు రాజకీయ సాంఘిక సమస్యా సమ్మేళనముతోఁ గూడిన ప్రశస్తములైన నవలలు.

ఏకాంక నాటికా రచనమునవలెనే నవలారచనమునఁ గూడ భావ విప్లవముతోపాటు పరమోత్కృష్టమైన శిల్పమును గూడ బ్రదర్శించినవారు శ్రీ గుడిపాటి వేంకటచలంగారు. శ్రీ ధనికొండ హనుమంతరావు ప్రభృతులు వీరిని జాలవఱ కనుసరించిరి.

హాస్యప్రధానములైన నవలలు వ్రాసిన వారిలో శ్రీ మొక్కపాటినరసింహశాస్త్రిగారును, మునిమాణిక్యం నరసింహారావుగారును ఒగ్రేసరులు. శ్రీ నరసింహశాస్త్రిగారి బారిష్టరు పార్వతీశ మొకప్పుడాంధ్ర దేశమునంత నఱ్ఱూత లూగించినది. శ్రీ నరసింహారావుగారి తిరుమాళిగ, దీక్షితులు, కాంతం కథలు ఆంధ్రదేశము నందంతట వ్యాప్తినొందిన హాస్యరచనలు.

నవలారచనలో పేరుగాంచిన నారీమణులుకూడఁ బలువురున్నారు. శ్రీమతి జయంతి సూరమ్మగారి సుదక్షిణా చరిత్రము పౌరాణికేతివృత్తముతోఁ భాసిల్లుచున్నది. శ్రీమతి పులుగుర్త లక్ష్మీనరసమాంబగారి సుభద్ర, యోగేశ్వరి, అన్నపూర్ణ అను నవలలు సాంసారిక సమస్యాపూరితములై గృహజీవితమును జిత్రించుచున్నవి. శ్రీమతి సీరము సుభద్రాంబగారి జాగిల మనువాదమయ్యును అపరాధ పరిశోధక నవలలోఁ బేరెన్నిక గాంచినది. శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారి వసుమతి, మాలతీచందూరుగారి చంపకము, చెదలపురుగు, వసుంధరగారి దూరపుఁ గొండలు సాంఘిక నవలలోఁ బ్రశస్తి వహించినవి.

ఆంగ్లమునుండి అనువదింపఁబడిన యుత్తమ నవలలను గూర్చి యిటఁ బేర్కొ నవలసియున్నది. శ్రీ వీరేశలింగంపంతులుగారి రాజశేఖర చరిత్రము వికార్ ఆఫ్ వేక్ ఫీల్డున కనుసరణమని తెల్పఁబడినది. శ్రీ చిలకమర్తివారి దాసీకన్యయు, శ్రీ వెదురుమూడి శేషగిరిరావుగారి ఫాస్టు (రెండు భాగములు) ను ఆంధ్రదేశమున నత్యంతాదరముగాంచినవి. గోరా, నౌకాభంగము, ఇంటాబయట, తపోవనము, యోగవియోగ ములు మున్నగునవి రవీంద్రుని రచనల కనువాదములు. టాల్‌స్టాయి

రచనలకుఁ గావింపఁబడిన యనువాదములలో సమరము-శాంతి, నవజీవనము, అనా కెరీనా, అనుమానం మొదలైనవి ముఖ్యములైనవి. అమ్మ, ముగ్గురు మిత్రులు అనునవి మాక్సిం గోర్కీ సుప్రసిద్ధ నవలల కాంధ్రీకరణములు. శ్రీ మొసలికంటి సంజీవరావుగారు రైనాల్డ్సు, స్కాటు రచించిన కొన్ని నవల లనువదించిరి. అంతఃపురము, మేరీ రాణి, సంజీవి మున్నగునవి యందుఁ బ్రధానములైనవి. శ్రీ మద్దాల నారాయణరావుగారి భయంకర లోయ, హత్యాన్వేషణము అనునవి ఆంగ్లాపరాధ పరిశోధకనవలల కను వాదములు. ఇటీవల ఆంధ్రవారపత్రికలలో సుప్రసిద్ధములైన ఆంగ్లనవలలకుఁ బ్రశస్తములైన యనువాదములు ప్రచురింపఁబడినవి.

ప్రస్తుత కాలమున నవలలు, కథలు చదువువారి సంఖ్య యధిక మైనది. అందుచే నల్పశ్రేణికిఁ జెందిన రచనలు తండోపతండములుగా నుత్పన్నములగుచున్నవి. ఇట్టి వానివలన రచయితలకుఁగాని, పఠితలకుఁ గాని, వాఙ్మయమునకుఁ గాని కలుగు ప్రయోజనమేదియుఁ గానరాదు.

## కథానికలు

పాశ్చాత్య భాషాసంపర్కమువలన నిటీవల వెలసిన నూతన ప్రక్రియలలో నవలనువలెనే కథానికను గూడఁ బేర్కొనవలయును. మొపాసా, మాఘం, ఓహెన్రీ ప్రభృతు లాంగ్ల కథానికా రచయితలలో నాద్యులు. వారి యనుయాయు లనేకు లున్నారు. వారి ననుసరించియు, స్వతంత్రముగా నూహించియుఁ బ్రతిభావంతులైన యువకులు పలువు రాంధ్రమునఁ జక్కని కథానికలు సృష్టించినారు. ఆధునికకాల ప్రవృత్తి దీర్ఘములైన నవలలు పఠించుట కనువైనది కాదు. అందుచేఁ గథానికల కధికమైన ప్రచారము కలుగుచున్నది. నవలలకును నాటకములకును వలెనే కథానికలకును ఏకాంక నాటికలకును సన్నిహితసాదృశ్య మున్నది. ఈ రెండును నల్పకాలములో ననల్పమైన యానందము నందిచ్చు నుత్తమ ప్రక్రియలు. వీనిని గళాపరిపూర్ణములుగా సంతరించుట ప్రతి

ఖై కసాధ్యము. ఆంధ్రమున శ్రీ వీరేశలింగంపంతులుగారు చేయి వేయని సాహిత్య ప్రక్రియ యిది యొక్కటే.

కీ. శే. గురుజాడ అప్పారావుగారు రచించిన కథానికలే యాంధ్రమున మొదటివిగా భావింపఁబడుచున్నవి. వీరి 'అణిముత్యా' లిటీవలనే ప్రకటింపఁబడినవి. కీ. శే. వేదము వేంకటరాయశాస్త్రిగారు భోజకాళిదాసు కథలు, బేతాళపంచవింశతి, కథాసరిత్సాగరము అను కథల సంపుటములను ప్రకటించిరి. ఇవి సంస్కృతము నుండి యనువదింపఁబడినవి. ఇందున్న చిన్నకథలకును, కథానికలకును స్వరూపమునఁ జాల భేదమున్నది. చిలకమర్తివారు రచించిన రాజస్థాన కథావళి, చమత్కార మంజరి, భారతకథామంజరి, చిత్రకథా మంజరి, చిత్రకథా గుచ్ఛము అను కథలసంపుటములందుఁ గథానికలని చెప్పఁదగిన రచనలు కొన్ని గానవచ్చుచున్నవి. ఆంధ్రమునఁ గథానికారచనకుఁ బునాదులు వేసిన ప్రముఖులలో ఆంధ్రపితామహ, పద్మభూషణ శ్రీ మాడపాటిహనుమంతరావు పంతులుగారొకరు (జన.1885). తెలంగాణము సర్వతో ముఖ వికాసమునకు మేల్కొల్పులుపాడిన వైతాళికులు వీరు. వీరి జన్మస్థలము కృష్ణామండలమందలి పొక్కునూరు. వీరికి సంస్కృతాంధ్రాంగ్ల భాష లందే కాక ఉర్దూ పారసీభాషలందును మంచి పాండిత్యము కలదు. వీరేశ లింగంపంతుగారివలె వీరు మొదటఁ బద్యరచన చేయుటకే యారంభించినను దరువాత వచనరచనమందే యభినివేశము ప్రదర్శించిరి. వీరు వివిధ పత్రిక లందుఁ బెక్కు వ్యాసములు, విమర్శనములు ప్రచురించియుండిరి. గ్యారిబాల్డీ జీవితము, ఆనందమఠము, రోమకసామ్రాజ్య చరిత్రము, శాస్త్రి కాలపు హిందువార్యులు, మహాభారత సమీక్షణము, నిజామురాష్ట్రములో రాజ్యాంగ సంస్కరణలు, ఆంధ్రోద్యమము (రెండు సంపుటములు) పంతులుగారి వచన రచనలలో ముఖ్యములైనవి. వీరు రచించిన కథానికలు 1911లో మల్లికాగుచ్ఛ మను పేర నొక సంపుటముగాఁ బ్రకటింపఁబడినవి. ఇందుకొన్ని స్వతంత్రములు, కొన్ని ప్రేమ్‌చంద్ కథల కనుసరణములు.

గూడ వీరు మిక్కిలి నేర్పు ప్రదర్శించియున్నారు. అడవిఁగాచిన వెన్నెల, మేడమెట్లు, నిరంతరత్రయం మున్నగు వీరి కథానిక లాంధ్రదేశమున మిక్కిలి ప్రసిద్ధములు.

'కరుణకుమార కథలు' సంపుటములుగాఁ బ్రచురింపఁబడినవి. రసభావ పోషణమున నిందలి కథ లత్యంత రమణీయములై రచయిత మానవమానస ప్రవృత్తిపరిజ్ఞానమును జక్కగా వ్యక్తముచేయుచున్నవి. శ్రీ యస్. ఆర్. చందూరుగారి కథ లాంధ్రకథా పాఠకులకు సుపరిచితములు.

శ్రీ భరద్వాజ, ధనికొండ ప్రభృతులు శ్రీ చలంగారి శాఖకుఁ జెందిన యుత్తమకథకులు. వీరి రచనలు పెక్కు లైంగికశాస్త్ర సంబంధములైనవి. వీరి కథలలో వాస్తవికత ప్రాధాన్యము వహించి యుండును వీరికి మొపాసా మున్నగు పాశ్చాత్య కథకులు మార్గదర్శకులు.

శ్రీ మధురాంతకం రాజారాంగారి "వక్రగతులు" "కుంపటిలో కుసుమం" మొదలైన కథలు సుప్రసిద్ధములు. శ్రీ శండిలగారు వివిధములైన కథలువ్రాయుచుఁ బేరుగాంచుచున్నారు. వీరి 'జయాపజయములు' అపూర్వ శిల్పఖండము. జగత్కల్యాణము వీరి లక్ష్యము. సన్నివేశకల్పన మందును, పాత్రపోషణ మందును వీరు సిద్ధహస్తులు.

శ్రీ భాస్కరభట్ల కృష్ణారావు, పొట్లపల్లి రామారావు, ధరణికోట శ్రీనివాసులు, ఇటికాల నీలకంఠరావు, చక్రవర్తి రంగస్వామి, పోతుకూరి సాంబశివరావు హీరాలాల్ మోరియా మున్నగువారు చక్కని కథలు వ్రాయుచున్నారు. ముందు ముందు వీ రుత్తమ కథానికా రచయితలు కాఁగల రనుటలో సందేహము లేదు.

కథానికా రచయిత్రులలో శ్రీమతి వాసిరెడ్డి సీతాదేవి, మాలతీ చందూరు, ఇల్లిందల సరస్వతీదేవి, శ్రీదేవి మున్నగువారు పేర్కొనఁదగినవారు.

మయ్యు వ్యావహారికమునకు సన్నిహితమై, మిక్కిలి సుందరముగా నుండును. వీరి ఓబయ్యా వంటి హాస్యరచనలలోఁ గూడ గంభీరార్థ మిమిడి యుండును. వీరు రచించిన ఆనందభవనము సర్వమనోహరము.

ఆంధ్ర కథానికల కద్వితీయ సౌందర్యము నాపాదించించి, పేరు గన్నవారు శ్రీ చలంగారు. వీరి రచనలో మీటర్లింకు ఛాయలు కాన వచ్చును. వీరి భాష, భావములు, కథన విధానము— అన్నియు మిగుల నాకర్షకములుగా నుండును. సంప్రదాయోల్లంఘనము, స్వైరవిహారము మున్నగునవి ప్రాయికముగా వీరికిని వీరి యనుయాయులకును ప్రీతి కరములైన వస్తువులు. కథానికారాజ్యమున వీరి దొక ప్రత్యేక రాష్ట్రము. చలంగారి హంపీకన్యలు చదివి యానందింపని వా రుండరు. వీరి సినీమా జ్వరము జగద్విఖ్యాతము.

శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగా రుత్తమ కథానికారచయితలు గానే కాక, విమర్శకులుగాఁ గూడఁ బేరు గాంచినవారు. వీరి కథలకుఁ బాత్రపోషణ కౌశలము జీవగఱ్ఱ. వీరిరచన వ్యంగ్యచమత్కారములతోఁ గూడి హృద్యముగా నుండును. పక్షికోసం వెళ్ళిన పంజరము, తేచిపోయిన మనిషి, ఆడజన్మ మున్నగు వీరి కథానికల నానందముతోఁ జదువని యాంధ్రు లుండరు.

శ్రీ చింతా దీక్షితులుగారికి కథక చక్రవర్తి బిరుదము సార్థక మైనది. వీరు దాసరిపాట మొదలగు పెక్కు కథానికలను వ్రాసియుండిరి. వీరి **"ఏకాదశి"** ఆంధ్రదేశమున మిక్కిలి ప్రచారమొందిన కథల సంపు టము. బాలసాహిత్యము నందును, బాల చిత్తవృత్తి కనుగుణములైన కథలు వ్రాయుటయందును వీరి కభినివేశము మెండు.

శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారి కాంతం కథ లిదివఱకుఁ బేర్కొనఁబడినవి. దుఃఖభరాలసమైన దైనిక జీవితమును మధురాతి

మధురము చేయఁగల హాస్యరసము నుచితరీతిఁ బోషించుటలో వీరు సిద్ధహస్తులు.

శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రిగారు గొన్ని యుత్తమకథానికలు రచించిరి. 'చిత్తరువ'ను వీరి కథానిక చాల మనోహరముగా నుండును.

పండితులయ్యుఁ గథానికారచనకుఁ గడంగినవారిలో శ్రీ ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగా రొకరు. వీరు కవులుగా, కథానిక కర్తలుగా, విమర్శకులుగా మిక్కిలి ప్రసిద్ధి గాంచినవారు. హనుమచ్ఛాస్త్రి కథ లను పేరఁ బ్రకటింపఁబడిన సంపుటములలోని కథ లన్నియు నమృతవాహినులు.

శ్రీ గోపీచందుగారికి నవలాకర్తలలోను, విమర్శకులలోనువలెఁ గథకులలోఁ గూడ నుత్తమస్థాన మున్నది. వీరి భావములు, ఆదర్శములు రాజకీయసంబంధము గలిగియుండును. అప్రియమయ్యు హితమైన యుపదేశమును, మితమయిన సంభాషణమును వీరి కథలకు భూషణములు.

శ్రీ పాలగుమ్మి పద్మరాజుగారి గాలివాన ప్రపంచ కథానికల పోటీలో ద్వితీయ బహుమానము పొందినది. వీరు రచించిన కథలసంఖ్య తక్కువైనను వీరు పొందిన ప్రశస్తి యపారమైనది. దానికి వీరు కథానికారచనలలోఁ బ్రదర్శించు శిల్పవిశేషమే కారణము. ఎదురు చూస్తూన్న ముహూర్తము, వాసనలేని పూలు మొదలైన వీరి కథలు మిక్కిలి ప్రసిద్ధములైనవి. రమ్యకథా నిర్మాణము, సుందర సన్నివేశకల్పనము, సహజ సంభాషణము మున్నగునవి వీరి కథలకుఁ బెట్టని సొమ్ములు.

శ్రీ బుచ్చిబాబుగారి ప్రతిభ బహుముఖమైనది. నవలా రచనమందును, ఏకాంకికాసృజన మందునువలెనే, కథానికా నిర్మాణమునఁ

# ఆంధ్రవాఙ్మయ చరిత్రము

## వ్యాసములు, విమర్శలు. పరిశోధనలు

వచనవాఙ్మయ వృక్షమునఁ బెక్కు శాఖలున్నవి. వానిలో భారత భాగవత రామాయణాది వచనములు, నీతిచంద్రికవంటి గ్రంథములు, ఇదివఱకుఁ బేర్కొనఁబడినవి. మిగిలినవానిలో వ్యాసములు, విమర్శలు, పరిశోధనలు ముఖ్యములైనవి. వ్యాసము కళాసంభరితమైన వచన రచనా విశేషము. ఇది యాంగ్లమున మిక్కిలి పరిణతిని బొందినది. లాంబు, స్టీవెన్సను, లేహంట్టు, హేజ్లిట్టు, గార్డినరు మున్నగువారి వ్యాసములు భావగంభీరములై మనోహరములుగా నుండును, తెలుఁగున నట్టి యుత్తమ వ్యాసములు రచించినవా రెందఱో లేరు. వీనికిని శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులుగారే యాద్యులని చెప్పవచ్చును. వారు తాము నెలకొల్పిన మాసపత్రికలో స్త్రీ విద్యావశ్యకమును గూర్చియు, సంఘసంస్కరణావశ్యకమును గూర్చియుఁ బెక్కు వ్యాసములు వ్రాసి యుండిరి. పునర్జన్మము, బాల్యవివాహము, ప్రార్థన, ఈశ్వరదత్తగ్రంథములు మున్నగు విషయములను గూర్చి వారు రచించిన దీర్ఘవ్యాసములనేకము లొక సంపుటముగా ముద్రింపఁబడినవి. వీరి వ్యాసములు హేతువాద పూర్వకములును, యుక్తియుక్తములునై పూర్వపక్ష ఖండనముతోఁ గూడి విజ్ఞానవికాసములను వెదజల్లుచుండును. వీరి శైలి మృదుమధురమై యన్వయ కాఠిన్యముకాని, శబ్దకాఠిన్యముకాని లేక మిక్కిలి సరళముగా నుండును.

తెలుఁగున వ్యాసకర్తలలోఁ బ్రథమగణ్యులు శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు. వీరి సాక్షివ్యాసములు సర్వాంధ్రజన సువరిచితములు. ఆంగ్లమున ఎడిసన్ను పండితుఁడు స్పెక్టేటరు అను పేర నొక పత్రిక స్థాపించి, యందుఁ దననాఁడు వ్యాపించియున్న సాంఘికాది

పాశ్చాత్యవంగ హిందీభాషల నుండి పెక్కు కథానిక లనువదింపఁబడియున్నవి. టాల్‌స్టాయ్, మాక్సిం గోర్కి, మొపాసా, మాఘం మున్నగు పాశ్చాత్య రచయితలయు, రవీంద్ర, శరచ్చంద్ర ప్రభృతి వంగ రచయితలయు, జయశంకర ప్రసాద ప్రేమచంద్ర ప్రముఖ హిందీ రచయితలయుఁ గథానికలు వందలకొలఁది యింకను అనువదింపఁబడుచున్నవి.

ఆధునిక కాలమునఁ గథానికలకు జనులలో నపారమైన యాదరాభిమానము లున్నవి. రచయితలును వాని నభినివేశముతో రచించుచున్నారు. నిజమున కుత్తమనవలలు రచించుటకంటె, నుత్తమ కథానికలను సృజించుట యెక్కువ క్లేశకరమైన కార్యము. ఇం దల్పమైన స్థలమున ననల్పమైన కళాప్రతిభలు ప్రదర్శింపవలసిన యావశ్యకముండును. కథానికారచయిత లీ విషయమును గ్రహించి తమ రచనలలో సంఖ్యకంటె శిల్ప విశేషమున కధిక ప్రాధాన్య మొసంగుదురుగాక.

# ఆంధ్రవాఙ్మయ చరిత్రము

## వ్యాసములు, విమర్శలు. పరిశోధనలు

వచనవాఙ్మయ వృక్షమునఁ బెక్కు శాఖలున్నవి. వానిలో భాగవత రామాయణాది వచనములు, నీతిచంద్రికవంటి గ్రంథ ఇదివఱకుఁ బేర్కొనఁబడినవి. మిగిలినవానిలో వ్యాసములు, పరిశోధనలు ముఖ్యములైనవి. వ్యాసము కళాసంభరితమైన రచనా విశేషము. ఇది యాంగ్లమున మిక్కిలి పరిణతిని బొందినది. స్టీవెన్సను, లేహాస్టు, హేజ్లిట్టు, గార్డినరు మున్నగువారి వ్యాసములు భావగంభీరములై మనోహరములుగా నుండును. తెలుఁగున యుత్తమ వ్యాసములు రచించినవారెందఱో లేరు. వీనికిని శ్రీ వీరేశలింగంపంతులుగారే యాద్యులని చెప్పవచ్చును. వారు తాము నెలకొల్పిన మాసపత్రికలో స్త్రీ విద్యావశ్యకమును గూర్చియు, సంఘసంస్కరణావశ్యకమును గూర్చియుఁ బెక్కు వ్యాసములు వ్రాసి యుండిరి. పునర్జన్మము, బాల్యవివాహము, ప్రార్థన, ఈశ్వరదత్తగ్రంథ ములు మున్నగు విషయములను గూర్చి వారు రచించిన దీర్ఘవ్యాసము లనేకము లొక సంపుటముగా ముద్రింపఁబడినవి. వీరి వ్యాసములు హేతు వాద పూర్వకములును, యుక్తియుక్తములునై పూర్వపక్ష ఖండన ముతోఁ గూడి విజ్ఞానవికాసములను వెదజల్లుచుండును. వీరి శైలి మృదుమధురమై యన్వయ కాఠిన్యముకాని, శబ్దకాఠిన్యముకాని లేక మిక్కిలి సరళముగా నుండును.

తెలుఁగున వ్యాసకర్తలలోఁ బ్రథమగణ్యులు శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు. వీరి సాక్షివ్యాసములు సర్వాంధ్రజన సుపరి చితములు. ఆంగ్లమున ఎడిసన్నను పండితుఁడు స్పెక్టేటరు అనుపేర నొక పత్రిక స్థాపించి, యందుఁ దననాఁడు వ్యాపించియున్న సాంఘికాది

దురాచారములను ఖండించి యుండెను. దాని నాదర్శముగా గ్రహించి శ్రీ పానుగంటివారు సాక్షి ఉపన్యాసములను బ్రారంభించిరి. ఇవి యెడనెడ హాస్యరస సమ్మిశ్రితములై, దురాచారముల దెబ్బగొట్టుచు, వైవిధ్యముతోడను, శక్తిమంతమైన శైలితోడను గూడి మిక్కిలి యాహ్లాదకరములుగా నుండును. వీరి హేళన పద్ధతి కడుంగడు తీక్ష్ణమైనది. వీరి శైలి యచ్చటచ్చట దీర్ఘ సమాసములతోఁ గూడియున్నను ధారావాహియై, మనోహరముగా నుండును. తెలుఁగున నింత భావగంభీరములైన వ్యాసములు వ్రాసినవా రన్యులు లేరు.

ఆఁగ్లము నందలి టాట్లరు పత్రిక ననుసరించి, అనంతపురము నందలి యువకులు కొందఱు వదరుఁబోతను పత్రిక నెలకొల్పి, యందు వివిధ విషయములపై విమర్శనాత్మకములైన చక్కని వ్యాసములు వ్రాసియుండిరి. సాక్షివ్యాసములతో సాటికి రాలేకపోయినను ఇవి మిక్కిలి మనోహరములుగా నుండును.

తెలుఁగు నందలి దినపత్రికలలో నాంధ్రపత్రికయు, వారపత్రికలలోఁ గృష్ణాపత్రికయు మిక్కిలి ప్రసిద్ధములైనవి. వీనిలో నప్పుడప్పుడు సంపాదకీయములుగాఁ బ్రచురింపఁబడియున్న వ్యాసములు కొన్ని విషయప్రధానములే యయ్యు నుత్తమ సారస్వత మని చెప్పఁదగియున్నవి. కృష్ణాపత్రికలోని ముట్నూరి కృష్ణారావుగారి వ్యాసములిటీవలనే 'సమీక్ష' యను పేర గ్రంథముగా ముద్రింపఁబడినవి. కాళిదాసును గూర్చి యిందు రచితమైన వ్యాసము మిక్కిలి యుత్కృష్టమైనది. ఈ వ్యాసములందలి శైలి ప్రౌఢమై భావనిర్భరముగా నుండును.

కీ. శే. కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుగా రాంధ్రదేశమునందలి చారిత్రక పరిశోధకులలో నగ్రగణ్యులు. వీరు చరిత్రకుఁ, గళకు, సారస్వతమునకు సంబంధించిన వ్యాసములు పెక్కు రచించిరి. వీరు కళలను గూర్చి వ్రాసిన వ్యాసము మిక్కిలి ప్రశస్తమైనది. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వమున వీరు రచించిన వ్యాసములన్నియు భావమున గంభీరము

లును, శైలిని మృదుమధురములునై యధికమయిన ప్రామాణ్యము గడించినవి. చరిత్ర పరిశోధనలో వీరి శిష్యు లని చెప్పఁదగినవారు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, వీరి శైలి శక్తిమంతమును, ధారాళమునై, యుదాత్తముగా నుండును. చారిత్రకవ్యాసము లను పేర వీరు ప్రకటించిన గ్రంథము ప్రసిద్ధమైనది

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారి వ్యాసములు కొన్ని విద్యార్థ ప్రకాశిక యను పేర నొక సంపుటముగా ముద్రింపఁబడినవి. ఇందు విద్యకును, విజ్ఞానమునకును సంబంధించిన మంచి వ్యాసములు కలవు. వీని యందలి శైలి ప్రౌఢమై కొంచెము క్లిష్టముగా నుండును.

శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారి 'సారస్వత వ్యాసములు' కళాశాలలోఁ బాఠ్యగ్రంథముగా నుపయోగింపఁబడుచున్నది. ఇందు వాఙ్మయము-జాతీయత, విమర్శ పద్ధతులు మున్నగు వ్యాసములు కలవు. ఇవి గాక భాషాసారస్వతములపై వీరు వివిధ పత్రికలలోఁ బ్రకటించిన వ్యాసము లనేకములున్నను. అందుఁ గొన్ని భాషాచారిత్రక వ్యాసములను పేర గ్రంథముగాఁ బ్రకటింపఁ బడినవి.

ఇటీవల శ్రీ వావిలాల సోమయాజులుగారు మణిప్రవాళ మను పేర నొక వ్యాససంపుటమును బ్రచురించిరి. ఇందు భావనామయములు, నిరుష్ట రచనాశోభితములునైన మంచి వ్యాసము లున్నవి. పువ్వులు, శ్రమరాన్వేషణము మున్నగు నిందలి వ్యాసములు మనోహరములు.

ఆంధ్రమున సారస్వత విమర్శకుఁ గూడ వీరేశలింగంపంతులు గారే యాద్యు లని చెప్పవలెను. ఆంధ్రకవుల చరిత్ర వారి పరిశోధనకును, బట్టుదలకును నిదర్శనమైన యుత్తమగ్రంథము. శ్రీ గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగారి 'కవి జీవితములు' కూడ నట్టి గ్రంథమే కాని యందాధారములేని పుక్కిటిపురాణములు సైతము చారిత్రకవిషయములుగా గ్రహింపఁబడినవి. వీరి శైలి మాత్రము లాతుణికమై, రమ్యముగా నుండును.

పాశ్చాత్యదృష్టితో విమర్శ సాగించినవారిలో కీ. శే. డా. కట్టమంచి రామలింగారెడ్డిగా రగ్రగణ్యులు. వీరి కవిత్వ తత్త్వవిచార

ము_త్తమ విమర్శ గ్రంథముగాఁ బ్రసిద్ధినందినది. వీరికిఁ బ్రబంధములు పనికి మాలిన గ్రంథములు, అలంకారము లసహ్యాములు, కళాపూర్ణోదయ మొక్కటే వీరికి మెచ్చుగొల్పిన పూర్వప్రబంధము. కవికోకిల దువ్వూరి రామిరెడ్డిగారు ప్రాచ్య పాశ్చాత్య లాక్షణికుల విమర్శ పద్ధతులను జోడించి రచించిన వ్యాసములు విద్వాంసుల ప్రశంసలకుఁ బాత్రము లైనవి.

కి. శే. పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారి మహాభారత చరిత్రము ప్రసిద్ధికెక్కిన విమర్శగ్రంథము. ఇందలి భావములు కొన్ని సామాన్యాభిప్రాయములకు భిన్నములై స్వతంత్రములుగా నుండును.

సరసము, సమంజసమునైన సారస్వత విమర్శకు శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు పెట్టినది పేరు. వీరి వేమన ఆదర్శప్రాయమయిన యుత్తమ విమర్శ గ్రంథము. సారస్వతాలోకము, నాటకోపన్యాసములు మున్నగు వీరి రచనలు వాఙ్మయము నందలి వివిధ ఘట్టముల విలువను విద్వన్మనోరంజకముగా వ్యక్తముచేయుచున్నవి. వారి శైలి యాడంబర రహితమై యెడనెడ మృదువైన హాస్యముతోఁ గూడి ముచ్చటగొల్పు చుండును. శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు బహుభాషలు నేర్చిన విద్వాంసులు. వీరి రచనయు శ్రీ శర్మగారి రచనవలెనే మిక్కిలి పటువైనది. వీరి ప్రబంధ నాయికలు, రామకృష్ణుని రచన యుత్తమ శ్రేణికిఁ జెందిన విమర్శ గ్రంథములు. శిరోమణి శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రిగారి ప్రబంధపాత్ర లను గ్రంథము ప్రసిద్ధములైన ప్రబంధము లందలి పాత్రపోషణ విధానమును జక్కగాఁ బరామర్శించుచున్నది.

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి "నన్నయగారి ప్రసన్న కథా కలితార్థ యుక్తి" నన్నయ భారతమునందలి కథా కథన శిల్పమునకు నీరాజనము లెత్తుచున్నది. అసాధారణమైన ప్రతిభాసంపద గల వారగుటచే వారం దితరుల దృష్టికి గోచరింపని పెక్కుపూర్వ శిల్ప రహస్యములను వివరించి యున్నారు. శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారి

ఆంధ్ర భారత కవితా విమర్శము, శ్రీ గుఱ్ఱం వేంకటసుబ్బరామయ్యగారి కవిత్రయ కవితా విమర్శము, శ్రీ బి. లక్ష్మీనారాయణరావుగారి తిక్కన, యీ సందర్భమునఁ బేర్కొనఁ దగియున్నవి. శ్రీ కాళూరి వ్యాసమూర్తిగారి తిక్కన కళాసామ్రాజ్యము సంస్కృత భారతము నాధారము చేసికొని చేయఁబడిన విమర్శ.

ఆంధ్రవాఙ్మయ చరిత్రమును సమగ్రముగను ఏకదేశముగను వ్రాసినవారు పలువురున్నారు. కవిత్వవేది (వెంకటనారాయణరావుగారు) రచించిన ఆంధ్రవాఙ్మయ చరిత్రము సంగ్రహమైనను సమగ్రమై కళాశాలా విద్యార్థులచే విరివిగా నుపయోగింపఁబడుచున్నది. శ్రీ ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారి ఆంధ్రసాహిత్య చరిత్రము క్రీ. శ. 1800 వఱకు విలసిల్లిన ఆంధ్రవాఙ్మయ చరిత్రమును సులభ సరళమైన శైలిలోఁ జక్కగా వివరించుచున్నది. వీరును వీరి సోదరులగు శ్రీ బాలేందు శేఖరము గారును రచించిన ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి యను గ్రంథ మాంధ్రుల చరిత్ర సంస్కృతులను సమగ్రముముగాఁ దెల్పు నేకైక గ్రంథము. శ్రీ టేకుమళ్ల అచ్యుతరావుగారి విజయనగర సామ్రాజ్యమునందలి ఆంధ్రవాఙ్మయ మప్పటి వాఙ్మయ పరిస్థితులను సంపూర్ణముగాఁ దెల్పుచున్నది, శ్రీ కురుగంటి సీతారామభట్టాచార్యుల వారాంధ్రవాఙ్మయ చరిత్రను సంగ్రహ రూపముగాఁ బ్రచురించియుండిరి. వారి తంజావూరు రాజులచరిత్ర ప్రధానముగాఁ జరిత్ర గ్రంథమే యయ్యును అనుషంగికముగా నప్పటివాఙ్మయ పరిస్థితులను గూడ నభివ్యక్తము చేయుచున్నది. వీరి నవ్యాంధ్రవీధు లాధునిక కవితా రీతుల కద్దము వంటిది. ఆధునిక కవిత్వమునుగూర్చి యింత సమగ్రమైన పరిశోధన చేసినవారిం కెవ్వరును లేరు. ఈ గ్రంథమున నచ్చటచ్చట శ్రీ పిల్లలమఱ్ఱి వేంకటహనుమంతరావుగారి రచనకూడఁ గలదు. వీరు స్వతంత్రముగా రచించిన విమర్శ గ్రంథములుకూడ ననేకము లున్నవి. వానిలో సాహిత్య సమాలోచనము, మాధురీ మహిమ పేర్కొనఁ దగినవి.

ఆంధ్ర విమర్శక పరిశోధకులలో కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రి గారికిఁ బ్రత్యేక స్థానమున్నది. వారి విమర్శలు ప్రమాణ భూతములు. వారి శైలి లలిత సుందరమైనది. వారి శృంగార శ్రీనాథ మాదర్శప్రాయమైన యుత్తమ విమర్శ. ఇంకను వారు రచించిన వ్యాసము లసంఖ్యాకములున్నవి. వానిలోఁ గొన్ని మీఁగడ తఱకలు, సింహావలోకనము అను పేర గ్రంథములుగాఁ బ్రకటింపఁ బడినవి.

శ్రీ నిడుదవోలు వేంకటరావుగారి ఆంధ్రకవుల జీవితములు, దక్షిణాంధ్ర కవులు, అనునవి మదరాసు విశ్వవిద్యాలయము వారిచేఁ బ్రకటింపఁబడినవి. అవి గ్రంథకర్తకు వాఙ్మయముతోఁ గల యపారమైన పరిచయమును, వారి పరిశోధన పాటవమును జాటుచున్నవి. ఈ సందర్భముననే మదరాసు విద్యాలయము ప్రచురించిన శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగారి నన్నెచోడుని కవితా విమర్శను గూడఁ బేర్కొనవలసి యున్నది.

ఆధునికాంధ్ర చరిత్ర పరిశోధకులలో నగ్రగణ్యులని చెప్పఁదగిన శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారు వాఙ్మయ చరిత్రరచనమునఁ గూడ నాదరము వహించుట ముదావహమైన విషయము. వారి దక్షిణాంధ్ర కవిత్వచరిత్ర రూపమునఁ జిన్నదయ్యు గుణమున నెన్నఁదగియున్నది.

హైదరాబాదునందలి ఆంధ్ర సారస్వత పరిషత్తువారు ప్రశస్తములైన గ్రంథములు పెక్కు ప్రకటించి యున్నారు. వానిలో కీ. శే. సురవరము ప్రతాపరెడ్డిగారి ఆంధ్రుల సాంఘిక చరిత్రము కేంద్ర భాషా సాహిత్య అకాడమీ బహూకృతికిఁ బాత్రమైనది. శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారి కావ్యాలంకార సంగ్రహ వివరణ మాజాతి వాఙ్మయమున కపూర్వాలంకారము. పరిషత్తువారు పలువురువిద్వాంసులచే భారత భాగవతములను గూర్చి సవిమర్శకములైన యుపన్యాసముల నిప్పించి వానిని గ్రంథ రూపమునఁ బ్రచురించి యున్నారు. ఈ రెండు గ్రంథములును ఉత్తమ వాఙ్మయ విమర్శలుగా విఖ్యాతి గడించినవి. కేరళ

రాష్ట్రపాలకులును, రసజ్ఞులును, బహుభాషా కోవిదులునైన శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారు వివిధ సమయములలో వ్రాసిన వ్యాసములు పరిషత్తు వారిచే ప్రత్యేక సంపుటముగా ముద్రింపఁబడినవి. అందలి వ్యాసములు సులభ సుందరమైన శైలితోఁ గూడి అప్పకవ్యాదులను గూర్చి కొన్ని యపూర్వ విషయములను వెల్లడించుచున్నవి. శ్రీ దేవులపల్లి రామానుజరావుగారి నవనీతమున వేయిపడగలు, మాలపల్లి, మున్నగు నుత్తమ గ్రంథములను గూర్చి వ్రాయఁబడిన చక్కని విమర్శలున్నవి.

భారతి మున్నగు పత్రికలలో విద్వాంసులచే వ్రాయఁబడిన విమర్శ వ్యాసములు లెక్కకు మిక్కిలిగా నున్నవి. వానిని గూర్చి వ్రాయుట కిటఁ దావు చాలదు. అందుఁ బెక్కు కవులకును దద్రచిత కావ్యములకును సంబంధించినవి.

ఆధునిక కాలమున భాషా విషయకమైన పరిశోధనలు విరివిగా సాగినవి. కాల్డ్వెల్ అను మిషనరీ ద్రావిడ భాషలను గూర్చి గ్రంథము వ్రాయు వఱకును మన దేశమునందలి పండితులును, గవులును దెలుఁగు సంస్కృత ప్రాకృత జన్యమనియే తలంచిరి, "ఆద్యప్రకృతిః ప్రకృతిశ్చాద్యే ఏషాభవేత్తయోర్వికృతిః" అను చింతామణి వాక్యమును, 'జనని సంస్కృతంబు సర్వభాషలకును' అను శ్రీనాథుని వాక్యమును ఇందుకు నిదర్శనములు. కాల్డ్వెల్ గారు దక్షిణ దేశమునందలి భాషలును, తుళు, మున్నగు మఱి కొన్ని భాషలును ఆది ద్రావిడ భాషావికారములనియు, వానికిని సంస్కృత ప్రాకృతములకును సంబంధము లేదనియు నిరూపించిరి. అప్పటి నుండియుఁ బలువురు పండితులు వారి యభిప్రాయమునే యాదరించి దానిని బలపఱుచుచు గ్రంథములు వ్రాయఁ దొడంగిరి. కాల్డ్వెల్ గారి అనుయాయులలో శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారును, గంటిజోగి సోమయాజులుగారును ముఖ్యులు. కోరాడవారి భాషా చారిత్రిక వ్యాసములును, దేశి-దక్షిణదేశ సారస్వతము లను గ్రంథమునందలి కొన్ని

వ్యాసములును ద్రావిడ వాదమును సమర్థించుచున్నవి. వారి సంధి యితర ద్రావిడభాష లందలి సంధి విధానముతో తెలుగు నందలి సంధి విధానమును బోల్చి దాని స్వరూపమును జక్కఁగా వివరించుచున్నది. భాషోత్పత్తిక్రమ మను చిన్న గ్రంథమున వారు భాషోత్పత్తి విధానమును, భాషా కుటుంబము లేర్పడిన విధానమును వర్ణించి యున్నారు. శ్రీ జోగి సోమయాజులుగారు ద్రావిడ భాషలు, ఆంధ్ర భాషా వికాసము అను రెండుత్తమ గ్రంథములను బ్రచురించిరి. వీనిలో భాషావికాస మాంధ్రభాషా చరిత్రమును సమగ్రముగాఁ జిత్రించుచు గ్రంథకర్తగారి పరిశోధన పాటవమును వ్యక్తము చేయు చున్నది. కళాప్రపూర్ణ శ్రీ వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగా రిటీవలనే ద్రావిడభాషలపరిశీలనమను నుదాత్తమైన గ్రంథమును రచించి యున్నారు. వీరి వైయాకరణ పారిజాతము. ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వము, చింతామణి విషయ పరిశోధనము అను గ్రంథము లాంధ్ర వ్యాకరణమును గురించి వ్రాయఁబడిన ప్రమాణ గ్రంథములు.

ద్రావిడ వాదమును విశ్వసింపక ఆంధ్రము సంస్కృత ప్రాకృత జన్యమే యని నిరూపింప యత్నించినవారు డాక్టరు చిలుకూరి నారాయణ రావుగారు. వీరు రచించిన ఆంధ్రభాషా చరిత్రమను బృహద్గ్రంథ మాంధ్ర విశ్వవిద్యాలయము వారిచే ముద్రింపఁబడినది. వీరు భాషా విషయమునఁ గావించిన కృషి అమూల్యమైనది. ప్రాఙ్నన్నయ యుగము నందలి భాషను గూర్చియు, యక్షగానములను గూర్చియు, జానపదగేయ వాఙ్మయమును గూర్చియు నాంధ్రముపైఁగల యాంగ్లభాషా ప్రభావమును గూర్చియు నిటీవలఁ బ్రశంసా పాత్రములైన పరిశోధనలు జరిగి యున్నవి.

ఆంధ్రవాఙ్మయము తొల్లింటి రోజులలో సంస్కృత భాషనాదర్శ ముగాఁ జేసుకొన్నట్లే యిప్పు డాంగ్లభాష నాదర్శముగాఁ గైకొని, యందలి వివిధ ప్రక్రియల ననుసరించుచు దినదినాభివృద్ధి గాంచుచున్నది.

దేశమున నెలకొల్పఁబడిన పత్రికలు కూడ దాని యభివృద్ధికి సర్వవిధములఁ దోడ్పడుచున్నవి. భారతదేశమునందలి దేశభాషలలో గుణమునందుఁ గాని, పరిమాణమునందుఁ గాని యాంధ్రభాష దేనికిని దీసిపోదని చెప్పవచ్చును ఇఁక ముందుకూడ నిది యితోఽధికమైన యభివృద్ధి నంది సాటి భాషలకు మార్గదర్శకముగాఁ గలుగు చిన్నెలు గోచరించుచున్నవి.

— సమాప్తి —